Acc. No. 22468

# దక్షిణదేశ భాషాసారస్వతములు

## దేశి



కోరాడ రామకృష్ణయ్య

ప్రకాశకులు

కోరాడ మహాదేవశాస్త్రి

మద్రాసు.

1994

# DESI IN SOUTH INDIAN LANGUAGES AND LITERATURE

By

KORADA RAMAKRISHNIAH

Published : 1954

Reprint : 1971, 1994

Price Rs. : 50/-

For Copies :

S. Gopala Sastry,
'SITA NIVAS'
48-9-16, Dwarakanagar,
Visakhapatnam - 530 016.
Phones : 54098/54406.

Printed at :
Sri Ratna Printers,
Muttangivari Street,
Rajahmundry - 533 101.
Phone : 76345.

# కృతజ్ఞతాంజలి

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు 1950 నుంచి 1956 వరకు తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధన సంస్థలో తెలుగు విభాగ అధిపతిగా పనిచేశారు. అప్పుడే 1954లో 'దక్షిణదేశ భాషా సారస్వతములు - దేశి' ప్రచురింపబడింది. ఈ గ్రంథంలో ఆర్యేతరభాషా భావనలు ఆర్యసంస్కృతిలో అంతర్వాహినిగా విడదీయరానంతగా చేరిపోయినవని నిరూపిస్తుంది. దక్షిణభాషల ప్రాచీన సాహిత్యం లోని సాహితీ రీతుల విశేష లక్షణములను బట్టి ప్రాచీన దక్షిణ దేశీయమైన దేశికి సంబంధించిన వివిధ విషయాలను ఈ గ్రంథం తలస్పర్శిగా పరిశోధిస్తుంది. తెలుగులోని దేశి రచనల స్వరూపాన్ని ఉదాహరణలతో ప్రదర్శిస్తుంది. మేలుకొలుపులు, నివాళి పదాలు (ఆరాత్రికములు - ఆరతులు), శోభనము, సువ్వి ఉయ్యాలపాట, గొబ్బిళ్లపాట, ఆనందగీతము, లాలిపాట, కృష్ణ జననము, మేలుకొలుపుపాట, చిలుకపాట, ఏలపాట, మంగళం మొదలైనవి.

శ్రీ రామకృష్ణయ్యగారి శతజయంతి సందర్భంగా వారి రచనలన్నింటిని పునర్ముద్రించాలని మా సంకల్పం. 'దేశి' పునర్ముద్రణకు ఆర్థిక సహాయాన్ని అందించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం అధికారులకు కృతజ్ఞతాపూర్వక నమస్కృతులు.

కోరాడ మహాదేవశాస్త్రి





This Book is Published with the
Financial Assistance of
Tirumala Tirupati Devasthanams
under their scheme
"Aid to Publish Religious Books"



# DĒSI
# IN
# SOUTH INDIAN LANGUAGES AND LITERATURE

The DESI element in South Indian Literature does not seem to have attracted the attention of Scholars, even as much as the DESI element in those languages. Scholars like Dr. Caldwell and Kittel etc. have tried to collect, and to point out the characteristic features of this element in the vocabularies of the South Indian languages. Prakrit Grammarians like Hemachandra have collected the DESI element found in the Prakrits in works like "Desinamamala" of which a goo number of words have also been identified with the Dravidian.

It cannot be denied that there was an under-current of Non-Aryan thought and lan uaᵔe in the country—especially in South India, w ic after a time got inextricably mixed up with the Aryan to the advantage of both. Yet DESI in language is sometimes identified with "Tadbhava". Similarly Sanskrit Lakshanikas have endeavoured to

interpret the DESI in literature in terms of the "Marga" method, which having been espoused by the Sanskritists, gained an upper hand and only served to undermine the original DESI; yet this survived as an under-current in the lower starta of society. With the advent of foreign domination and consequent change in the outlook on life and customs, the hold on DESI is gradually being lost. It is time that we study and preserve what is yet left.

An attempt is here made to deal with the various aspects of DESI with a view to get at the common literary and prosodial tradition, underlying the development of the indigenous forms of Literature in South India. If this can rouse any interest in a comparative study of the Dravidian rosody and of forms of indigenous Literature of outh India the object of this work is fulfilled.

K. R.

# తొలిపలుకు

దక్షిణ హిందూదేశమున వ్యవహారములోనున్న నాగిరిక భాషలును ఉత్తరదేశమందలి కొన్ని యనాగరక భాషలును జేరి యొక ప్రత్యేక కుటుంబముగా నేర్పడుననియు నిది సంస్కృతా ద్యార్య భాషావర్గముకంటె భిన్నమనియు నాధునిక భాషా తత్త్వ వేత్తల యభిప్రాయమైయున్నది. ఇవి యార్యభాషాజన్యములేయని తలంచువారును గొందరు గలరు. తత్త్వాన్వేషణము విషయమున, మత, రాజకీయ వైజ్ఞానికాది వ్యక్తిగతాభినివేశములకు తావులేదు గదా. నేటి హైందవ విజ్ఞానమనునది ప్రాచీనములగు రెండుభిన్న వైజ్ఞానిక సంస్కారముల సంపుటియని టాగోరువంటి పరిశీలకు లనేకులు తలంచియున్నారు. వీనిలో నార్య విజ్ఞానము పై చేయి కల దగుటచే దేశీయ విజ్ఞానము మరుగుపడి - దానితో సమ్మేళనమును బొంది - దానికి వన్నెగూర్చినదైనది. దీని స్వరూప లక్షణముల నిప్పుడు కనిపట్టుట దుశ్శకమే యగును. కాని కొన్ని జాడలు లేక పోలేదు. దక్షిణదేశభాషా నిర్మాణమునందలి విశేష లక్షణములను బట్టియు, "దేశి" పదజాలమునుబట్టియు వీని ప్రత్యేకత నిరూపింపఁ దగియున్నట్లే, యీ భాషలలోని ప్రాచీన సారస్వతము నందలి ఛందస్సాహితీరీతుల విశేష లక్షణములనుబట్టి ప్రాచీన దక్షిణదేశీ యంబగు "దేశి" వాఙ్మయ సంప్రదాయ విశేషములలోఁగల ప్రత్యే కత యెంతవరకు నిరూపింపఁదగునోయను విషయమును పరిశీలించు

ఒకే యీ రచనయొక్క ముఖ్యోద్దేశము. మార్గ సాహిత్య ప్రాబల్యముచే మరుగుపడి యంతరించిపోవుచున్న మన ప్రాచీన "దేశి" సాహిత్యము నుద్ధరింపవలసిన యావశ్యకత యెంతేనియు కలదు. ఇది భావి పరిశోధకుల దృష్టి నాకర్షింపగలిగినచో నీరచన సఫలత జెందును.

తమిళమున తొలియుగమునందలి రచనలు దేశీయ ప్రభువుల యాదరాభిమానముల మూలమున సంకలితములై సంరక్షింపబడినవి. ఆంధ్రరాజుల కాలమున తెలుఁగు "దేశి" సాహిత్య మట్టి నోము నోచుకొనలేదు. ఇప్పటి నూతనాంధ్రసాహిత్యోజ్జీవనోద్యమ మైనను ప్రాచీన "దేశి" సాహిత్యోద్ధరణ ప్రవణంబగుగాక.

మద్రాసు
1-5-1949

కోరాడ రామకృష్ణయ్య

# విషయసూచిక

పుట.

# దక్షిణ దేశ భాషా సారస్వతములు

## దేశి

ఈ దక్షిణ హిందూదేశమున వ్యవహారములో నున్న భాషలలోఁ బ్రధానమైనవి నాలుగు : అఱవము, తెలుగు, కన్నడము, మళయాళము అనునవి. వీనినే ద్రావిడభాషలనియు నందురు. ఇవి వ్యాకరణ సంస్కారమును బొంది, వివిధ శాఖలతో గూడిన సారస్వతములు గలవగుటచే సంస్కారయుక్తములనిచెప్పబడుచున్నవి. అవ్యాకృతములై సారస్వతము లేనివగుటచే సంస్కారహీనములని చెప్పఁబడు తుళు, కొడగు, కుయి, గోండి మొదలగునవి మఱి కొన్ని దక్షిణోత్తర దేశముల వ్యవహారమునఁగలవు. వీని కన్నిటికిని సంస్కృత ప్రాకృతములతోడి సంసర్గము విశేషముగా నున్నను. ప్రత్యేక లక్షణములుగా గ్రహింపఁబడుచున్న కొన్ని భాషా సంప్రదాయములను బట్టియు, వీనికి సమానము సహజము నగు ధాతుకూటమును బట్టియు, పదజాలమును బట్టియు నీ దక్షిణ దేశ భాషలొక ప్రత్యేక కుటుంబమునకుఁ జెందినవని పలువురు భాషాతత్వవేత్తల యభిప్రాయము. ఇట్టివియొక్క కుటుంబమునకుఁ జెందినవగుటచేత భాషా సంప్రదాయముల విషయముననే గాక, వీనియందలి ప్రాచీన సారస్వత చరిత్ర నన్వేషించి పరిశీలించినచో, వీనిలోని ఛందస్సాహిత్య సంప్రదాయముల విషయమునఁగూడ సన్నిహిత సంబంధము సామ్యము నంతర్వాహినిగాఁ గనఁబడవచ్చుననుటకు సందేహము లేదు.

1)

ఇట్లీ భాషావిషయమునను ఛందస్సాహితీరీతుల విషయమునను ఈ దక్షిణ దేశ భాషలకు సహజము సమానమునగు సంప్రదాయ పద్ధతియే "దేశి" యని వ్యవహరింపబడు చున్నది. ఈ భాషలకు సంస్కృత భాషా సాహిత్య సంప్రదాయముల సంపర్కము గలిగిన పిదప తద్రీతు లీ దేశ భాషలలో ననుసరింపబడిన పద్ధతియే "మార్గ" పద్ధతియైనది. లాక్షణికు లీ భాషలకు లక్షణము చెప్పునపుడు అప్పటికే దేశమున విఖ్యాతి గాంచిన సంస్కృతభాషా వ్యాకరణ పద్ధతులనే యనుసరించినవారైనను, తద్భిన్నమగు సంప్రదాయమునకుఁ జెందిన శబ్ద జాలమును, లక్షణరీతులను-దేశ్యమని, అచ్చయని విభాగించి ప్రత్యేకముగాఁ జూపియేయున్నారు. ఛందో విషయమున సంస్కృతము నందలి యక్షరగణబద్ధములగు వృత్తములను తాము చేపట్టునపుడు వానికి స్వీయ దేశీయాచారానుసారంబుగ ప్రాసవళ్ళనెడి మంగళసూత్రములను గట్టియే గ్రహించియు, మాత్రాగణ బద్ధంబులగు దేశీయ చ్ఛందోరీతులను జాత్యుపజాతి భేదంబుచే ప్రత్యేకించియు వాని దేశీయతాగుణమును వ్యక్తము చేసినవారైనారు. ఇఁక సంస్కృత సాహిత్య రీతులను అందలి రీతి గుణాలంకార రసవర్ణనాదులతోఁ గూడ గ్రహించి పురాణ ప్రబంధ ఫక్కిలో నిమిడ్చికొని మార్గపద్ధతి నత్యాదరముతో విస్తరింపఁజేసియు, దేశీయంబులగు ద్విపద షట్పదాది పదరచనలు, రగడలు, వచనములు, యక్షగానములు, ఉదాహరణాదిగ్రంథములు మొదలగువానికి చాటు ప్రబంధములనియు దేశి రచనలనియు నొక విభాగము కల్పించుటచే వీని దేశీయతా లక్షణమును ప్రత్యేకించి

చూపినట్లైయైనది. తమిళభాషా సాహిత్యములపై సంస్కృత ప్రభావము కొంచెము తక్కువగుటచే అందీ మార్గ పద్ధతి కొంత ప్రవేశించినను, దేశి పద్ధతియే బాగుగా కుదుర్చుకొని యుండినది. కన్నడాంధ్రములందు మార్గపద్ధతిదే పై చేయి యగుటచే దేశి రచనాపద్ధతి కొంత వెనుకబడినను కేవల మడుగంటిపోలేదు. దేశి మార్గములను దేశీయములుగఁ జేయు యత్నములు-అనగాఁ వీనికి హృద్యమగు సమ్మేళనము కుదుర్చు ప్రయత్నములును కొనలు సాగినవి. కన్నడాంధ్రములందు పురాణ ప్రబంధ కవులు మార్గ పద్ధతిని విస్తరింపజేసినను, ద్విపద, షట్పది, యక్షగానోదాహరణ వాఙ్మయమునకు పట్టుగొమ్మలై నిలిచినవి. కాని యీ భాషలలోని దేశి రచనలుగాని దేశి పద్ధతులుగాని మార్గ పద్ధతులవలె పండితులయొక్కయు లాక్షణికుల యొక్కయు దృష్టి నంతగా నాకర్షింప లేదు. కావున భాషా విషయమునందువలెనే ఛందస్సాహితీ రీతులందును గల దేశి సంప్రదాయములను, వాని విశేష లక్షణములను బరిశీలింపవలసిన యావశ్యకత యెంతేనియుఁ గలదు. దక్షిణ దేశీయభాషల ప్రత్యేక సంప్రదాయములను గూర్చియు, నందలి శబ్ద జాలము యొక్క విశేష లక్షణములను గూర్చియు ప్రత్యేక పరిశీలనము భాషా తత్వజ్ఞులచే జేయఁబడుచునే యున్నది. కావున ప్రస్తుత మీ సందర్భమున వాని ప్రత్యేక లక్షణములను మాత్రము సంగ్రహముగఁ బరిశీలింతము.

— —

# II

## దక్షిణ దేశ భాషల విశేష లక్షణములు

ఈ దక్షిణదేశ భాషలన్నియు నొక్కకుటుంబమునకే చెందినవనియు, నొక మూల భాష నుండి వచ్చిన సజాతీయ భాషలనియుఁ జెప్పుట కాధారములైన "ద్రావిడ భాషా విశేష లక్షణ" ములు మాత్ర మీ క్రింద సూచింపఁబడుచున్నవి. ఇవి ద్రావిడ భాషా సామాన్యములనియు, నితర దేశీయ భాషా విలక్షణము లనియుఁగూడఁ జెప్పవచ్చును.

1. పదనిర్మాణమును బట్టి చేయఁబడుచున్న విభాగ పద్ధతిని ఈ ద్రావిడ భాషలను "సంయుక్త ధాతురూప పదభాషలు (Agglutinative languages) అని చెప్పుదురు. ఈ భాషలలో నర్థభేదములను సూచించుటకు ధాతువుపై ధాతువు, పదముపై మఱియొక పదము చేరుచుండునేగాని, సంస్కృతాద్యార్య భాషలలో వలె ఉపసర్గలు గాని ప్రత్యయములుగాని చేరవు. సంస్కృతభాషా వ్యాకరణ సంప్రదాయ దృష్టిని బట్టి ప్రత్యయము లనఁబడునవి కొన్ని యిటీవల కనబడుచున్నను, వాని పూర్వ స్వరూపచరిత్రముల నించుక నన్వేషించినచో నవియు ప్రత్యేక స్వతంత్రములగు పదములేయని గుర్తించుట కష్టసాధ్యము కాఁబోదు. ప్రత్యయాంతములైయున్న ఆర్యభాషల సాహచర్య ప్రాబల్యకారణమున, నీ ద్రావిడభాషలును ప్రత్యయాంతత్వమును బొందు మార్గమునఁ బడుచున్నట్లుగ పడుచున్నవేగాని, సహజముగ నట్టివికావు.

2. ధాతువు—దాని లక్షణములు :

(1) ద్రావిడ ధాతువులు సామాన్యముగా క్రియాబోధకము లేయైనను, అట్టివి కానివికూడఁ గొన్ని కలవు. అట్టివి గుణవాచకములు సంఖ్యా సర్వనామ వాచకములు నగును—కాళ్, కెం, మేల్, కీళ్, ఒన్, ఇర్, ఆళ్, నాన్, నీన్.

(2) ధాతువులు సామాన్యముగా నేకాచ్ ధాతువులు. ఆ, ఈ, పో, సా, వర్, తెర్, పోర్, ఆడ్, నిల్, చెల్ మొ. మూల ధాతువుల సంయోగముచే మరల భిన్న ధాతువు లేర్పడుచుండుటయుఁగలదు. అర్థభేద సూచకముగను ధాత్వంతర సంయోగ మేర్పడును. ఇట్లే కాచ్చు లనే కాచ్చులగును.

(3) క్రియాబోధక ధాతువులకు విధ్యర్థక మధ్యమ పురుషైక వచనమున స్వతంత్ర ప్రయోగము కలదు.

ఈ, తే, వా, చాల్, పో, నడ్

(4) ధాతువు నామవాచకముగను క్రియా వాచకము గను గూడ వ్యవహరింపఁబడుచుండును.

త—కొల్, తటి, ముటి; తె—చెప్పు. ఒక కట్టుకట్టు; ఒక వెలుఁగు వెలుఁగు.

(5) ధాత్వంతమందలి హల్లు ద్విత్వమునుబొంది భిన్నార్థములను సూచించును.

i నామమును విశేషణముగాఁ జేయుటకు :

ఆఱ్ - ఆఱ్ఱుంగటై_ఏటిగట్టు, నడ్ - నట్టిల్లు,

కుఱ్ - కుఱ్ఱుయిర్ - కుట్టుసురు, మాడు - మాట్టుత్తోల్,

ii అకర్మక ధాతువును సకర్మముగాఁ జేయుటకు :

ఓడు - ఓట్టు, తిరుందు - తిరుత్తు.

iii ధాత్వర్థమును సూచించుటకు : తగు_తక్క,

iv నామవాచకములఁ గల్పించుటకు : పాడు - పాట్టు - పాట, కూడు-కూట్టం-కూటము.

(6) ధాతుగతమగు హ్రస్వాచ్చు దీర్ఘత్వమును బొంది నామవాచక మగుచుండును లేదా స్వల్ప భేదమును బొంది ధాతువు నామవాచక మగును.

నడు_నాడు.

కడు_కాడు.

విన్_వీన్, విన్ను (ఆకాశము)

మిన్_మీన్ (చేప, నక్షత్రము)

వెళ్_వెళ్ళి_వెండి, కాణ్_కణ్_కన్ను,

కెయ్_కై, కయి, చెయి.

(7) అర్థ భేదమును సూచించుటకుగా ధాతువుపై భిన్న ధాతువులు చేర్పఁబడుచుండును. ఇవి రెండును గలసి మఱియొక ధాతువుగా నేర్పడును. చేర్పఁబడిన యీ ధాతువు స్వరూపము వ్యవహారమున మార్పునొందుటచే, నా మిగిలిన భాగ మేధాతువు యొక్క యవశిష్ట భాగమో తెలిసికొనుట సులభ సాధ్యము కాక

పోవుటచే కాల్డ్వెల్ పండితుఁడు ధాతువులపైఁ జేరు కు, గు, చు, జు, తు, దు, బు_మొదలగు వానిని ధాతువులపై చేరు అనుబంధములుగా గ్రహించినాడు. ఇవి ధాతువుల క్రియా బోధకత్వమును సూచించుటకుగాఁజేర్పఁబడిన అగు, ఇసు, ఉతు, మొదలగుసహాయ ధాతువుల యవశిష్ట రూపములయి యుండునని తలంపవచ్చును. వీనితోఁ గూడినవే మరల నీ భాషలలో ధాతువులుగాఁ బరిగణింప బడఁ జొచ్చినవి.

వెళ్ + అగు = వెలుగు_వెలుంగు.

గెల్ + ఉచు = గెలుచు_గెలువు_గెల్వు_గెల్పు.

తిర్ + అగు = తిరుగు_తిరుపు_త్రిప్పు.

తిర్ + ఉతు = తిరుందు_తిరుత్తు_; తె, తిర్దు_తిద్దు_దిద్దు.

నిఱ్ + ఉతు = నిఱ్ + ఉంతు_నిఱుంతు_నిండు_నింపు.

అడ్_అడై + ఇసు = అడైసు_అడైచ్చు_; తె. అడచు, అణచు,

ఈ యవశిష్టభాగములే కొన్ని నామవాచక రూపములలోఁ గానవచ్చుచు, ధాతువులనుండి నామవాచక రూపములను జేయుటకుఁ జేర్పబడిన యనుబంధములుగా (Formative Particles) గ్రహింపబడుచున్నవి.

వెళ్_వెలుగు, వెళక్కు_ etc.

కాయ్_కాఙ్గు_కాఁగు.

గెల్_గెలుపు_గెల్వు.

కోయ్_కొప్పు_కొమ్ము.

వేప్-వేప్పు-వేము.
తీర్-తీర్పు.
తూర్-తూర్పు.
కాప్-కాపు.
మరు-మరుందు-మందు.
తిర్-తిరుందు-తిరుత్తం 'correction.'

(8) ధాతువుల కర్థభేదమును గలిగించుట కుపసర్గలను చేర్చుట సంస్కృతాద్యార్య భాషలలోవలె నీ భాషలలో సహజముగానే లేదు.

సంస్కృతమునం దుపసర్గతోఁగూడిన క్రియారూపములట్లే చేరి యుండుటచే నర్థభేదముతో ప్రాకృతములలోనికి వచ్చినవి. ఈ ప్రాకృతములనుండి యేర్పడినవని చెప్పఁబడుచుండిన యాధునికార్యభాషలలో నా యుపసర్గలను వాడుకొను పద్ధతి లోపించి ధాతువులపై క్రియా విశేషణములను జేర్చి ధాతుపల్లముల నేర్పాటు చేసికొను విధానము ఇటీవలి కాలమున వాడుకలోనికి వచ్చుటచే, దీని ద్రావిడభాషా సంపర్క సంప్రదాయ బలమునఁ గలిగినదని చెప్పవలయునే కాని ఆధునికార్య భాషలయందును, ద్రావిడభాషల యందును నొక్కటే తీరున నేర్పడినవని తలంచుటకవకాశములేదు.

(9) ద్రావిడ భాషలలోని క్రియారూపములు క్రియావిశేషణములనుండి యేర్పడినవి. ఇందు సంస్కృతమందువలె దశ లకారములు లేవు. సంస్కృతమునను, ఆధునికార్యభాషలలోను సంపూర్ణ క్రియల స్థానమున క్రియా విశేషణములను వాడుట ద్రావిడభాషా సంపర్క బలము చేతనే యై యుండును.

3. వర్ణసమామ్నాయము :

(1) అ, ఇ, ఉ, ఎ, ఒ హ్రస్వదీర్ఘములు గలవు. ఈ భాష లలో సంస్కృతములోవలె ఋ, ఌ వర్ణములు లేవు. ఋ వర్ణము "రి" కారముగాఁబలుకబడును. ఋషి-రుషి-లేదా- రిషి; కృష్ణ-కిష్ట, ఎ,ఒ, హ్రస్వములు సహజములు. ఐ, ఔ లు అయి, అవులుగా మారును. కొన్ని పదముల తుదిని అర్ధమాత్రములగు ఇకార ఉకారములు పలుకఁబడును. హల్లులు:- వర్గాక్షరములలో క, చ, ట, త, ప లు వాని వర్గానునాసికలు మాత్రమే కలవు, బిందువు లేదు. కచటతపలే పద మధ్యమందు సరళములుగా నుచ్చరింపబడును. మహాప్రాణములు లేవు. శ, ష, స లు లేవు, య, ర, ల, వ లు శకట రేఫ ఱకార ళకారములు పదాంత నకార మును గలవు. ఇది యిపుడు తమిళమున మాత్రమే కనఁబడు చున్నను దాని పరిణామ మితర భాషలలోను గనిపట్టవచ్చును.

(2) తెలుఁగు కన్నడములకు సంస్కృతభాషా సంపర్క మెక్కువగుటచే నివి తమిళమునకంటె మూలభాషకు మిగుల దూరస్థముగాఁ గనఁబడును. మూలభాషలోని రూపములు తెలుఁగున కన్నడముకంటెను విశేషముగా మారిపోయినవి.

(3) పదాదిని క, ట, త, ప, మ వర్ణములు మాత్రమే యచ్చుతోఁగూడి యైనను రావచ్చును. చకారము ఇ, ఉ, ఎ, ఒ లతోఁగూడియే వచ్చును. వ కారము ఉ, ఊ, ఒ, ఓ లతోఁ గూడిరాదు. యకారము ఆకారముతోఁ గూడియే వచ్చును. ర, ల లు పదాదిని నిలువవు. ఇది తొల్కాప్పి

యుర్ చెప్పిన తమిళభాషా సంప్రదాయము. ఇది తక్కిన భాష లకును వర్తించుచునేయున్నది. కాని యీ ద్రావిడ భాషా సంప్రదాయములకు విరుద్ధమైన రూపము లాయా భాషలలో నేర్పడుటకు వానిలోఁగలిగిన వర్ణ సమీకరణ వర్ణ వ్యత్యయాదులు కారణము లగుచున్నవి.

(4) ఈ భాషలలో సంస్కృత శబ్దజాలము తత్సమ రూపమున విశేషముగాఁ బ్రవేశించియుండుటచేత, నందు సహజముగ లేని మహాప్రాణములు, శ, ష, స లు మొదలగు వర్ణములా శబ్దములతోపాటు చేరి వ్యవహరింపఁబడుచున్నవి. తమిళము నందాశబ్దములు దేశీయోచ్చారణ సంప్రదాయానుసారము మార్పు నొందియే వ్యవహరింపబడుటచేత నందీ వర్ణములకు తావు చిక్కలేదు.

4. ధ్వని లక్షణములు :

(1) పదాంతమందు ముఖ్యముగ పరుష వర్ణాంతములగు పదముల తుది నొక అర్ధమాత్రోకారము నుచ్చరించుట యీ భాషల కొక సహజ లక్షణముగాఁ గనబడుచున్నది. ప్రాచీన భాషలో ననేకములగు ధాతువులు హలంతములేయైనను కాల క్రమమున తమిళమున పరుషాక్షరములపైని, తెలుఁగు కన్నడ ములలో హల్వర్ణములపైని, ఒక పొట్టి "ఉ" కారమును జేర్చి - ఆ పదములను అజంతములుగాఁజేసి పలుకు నలవాటు ప్రబలినది. కావుననే తెలుఁగు కన్నడములు ప్రాయికముగా నజంత భాషలైనవి. సంస్కృత హలంత శబ్దములకుఁ గూడఁ జెనుఁగున ఉవర్ణము చేర్పఁబడుచున్నది. ఆక్ - ఏఱు,

విల్_విల్లు; నీర్_నీరు, మొ. వాక్ - వాక్కు, రోడ్ - రోడ్డు. ఇది యీ భాషకొక యపూర్వమార్దవము చేకూర్చినది.

(2) స్వరసామ్యము (Harmonic Sequence of vowels) ఏకపదమందు సన్నిహితములగు నక్షరములలోని స్వరము లొకదానిని బట్టి మరియొకటి మారుట. సమీపాక్షరము లోని "ఇ" కారము-ముందు వెనుకల యక్షరములలోని "ఉ" కారమును "ఇ" కారముగా మార్చుచుండును. పూర్వ మకార ముండినచో ఉకారము మారదు. పరమందలి ఉకారము పూర్వ మందున్న ఇకారము నుకారముగా మార్చుటయుఁగలదు. ఇది తెనుఁగున విశేషముగాఁ గాననగును.

హరి + కు = హరికి. రాముని + కు = రామునకు.
తమ్ముని + కు = తమ్మునికి. కత్తి + లు = కత్తులు.
కొట్టితి + వు = కొట్టితివి.

(3) పరుష సరళముల వినిమయము :

ద్రావిడ భాషలలో ముఖ్యముగా తమిళ మలయాళ ములలో పదాదిని సరళముండదు. పదమధ్యమున పరుష ద్విత్వమే గానవచ్చుచుండును. పదమధ్యమునందలి పరుషము నిటీవలి కాలముననే సరళముగ నుచ్చరించు నలవాటు ప్రబ లినది. కాని ప్రాచీన కాలమునుండియు నీ యలవాటే కలదని చెప్పవీలులేదు. తొల్కాప్పియర్ వ్యాకరణమున క, చ, ట, త, ప. ఱ అను పరుషాక్షరములు మాత్రమే చెప్పబడియుండుటచే నాకాలమున పదమధ్యమునను నివి పరుషములుగనే పలుకఁ బడి కాలక్రమమున నజ్మధ్యస్థములై నపుడు, ననునాసిక

సంయోగము గలిగినపుడును సరళోచ్చారణము గలవై నట్లగపడు చున్నవి. కావుననే "దంతం" అను సంస్కృత పదము—"తందం" అని తమిళమున పలుకఁబడవలసి వచ్చినది. ఈ సంప్రదాయ ముత్తర దేశీయ భాషా విలక్షణ మనక తీరదు.

గ్రియర్సన్ పండితుఁడు ప్రాకృతములలో నీ మార్పు గలుగుటకు ప్రాచీనములగు ద్రావిడ భాషల సంపర్కమే కారణ మని తలంచినాఁడు. అది విలక్షణముగాఁ గలిగిన ద్రావిడ భాషల సంపర్కముచేతనే యిట్టి మార్పు గలిగియుండును. కాని యిది ప్రాకృతభాషలయందే సహజముగ గలిగినదనుట కవకాశము లేదు. పదమధ్యమందు ద్విత్వాక్షరముతక్క భిన్న పరుషాక్షరముల సంయోగ మీ భాషా పదములలో రాదు, ట్క, ట్ప, అంత స్థాను నాసికములతోడి సంయోగమునే పద మధ్యమున రావచ్చును. పదాది నేవిధమైన సంయుక్తాక్షరమును రాఁగూడదు. ఈ కారణము చేతనే—"బ్రాహ్మణ" శబ్దము "పిరమిణ"యగుట తటస్థించినది. భిన్నహల్సంయోగ మెచ్చటగలిగినను వానిమధ్యమున నచ్చొకటి చేరి దానిని భిన్నాక్షరములుగా మార్చుచుండును. అనఁగా పరుషా క్షర సంయోగోచ్చారణము ద్రావిడ భాషలను వ్యవహరించువారి యుచ్చారణ సంప్రదాయములకు విరుద్ధమైనదన్నమాట.

కావుననే— శ్రీ - సిరి, లేదా తిరు, భక్తి - బగితి, స్నేహ - సినేహ, హర్ష - హరుష, భాగ్య - పాక్కియం— ఇత్యాది తద్భవరూపము లేర్పడినవి. ఇటీవల కొన్ని తెలుఁగు

పదముల మొదట గాన నగు రేఫ సంయోగమునకు వర్ణప్లుతియే కారణము. వరై-వ్రాయు, మరం-మ్రాను, మొ.

మహాప్రాణముల యుచ్చారణముకూడ ద్రావిడ భాషా సంప్రదాయమునకు విరుద్ధము. ఈ భాషలలో మహా ప్రాణములు లేవు. కావుననే తద్భవములలో నవి యల్పప్రాణములుగ మారు చుండుట, భూతి-బూది; వ్యథ-వెత. శ, ష, స, లును లేవు. ఇవి తద్భవములలో చకారముగ మారుచుండును, లేదా లోపించు చుండును. cf. సంధ్యా-త. అంది, శ్రావణ-ఆవణి, సీస-ఈయం, శ్రేణీ-ఏణి.

ర, ల, లు పదాదియందు రావు. కావుననే తమిళమున నుచ్చారణ సౌకర్యముకొరకు వాని ముందు అ, ఇ, ఉ, లు చేర్పఁ బడుచుండును. రాజ-అరశ, లోకం-ఉలగం. తెలుఁగులో దేశ్యశబ్దముల మొదటి రేఫ లకారములు వర్ణప్లుతిచే గలిగినవే. ఉరల్-రోలు, ఎఱక-రెక్క, ఉల్-లో.

తమిళములో పదాదిని హకారముకూడ లోపించును-హారం-ఆరం, హోమం-ఓమం, హేతు-ఏతు, హరి-అరి, హింగు-ఇంగువ, హరివాణం-అరివాణం.

(4) హ్రస్వ ఎకార, ఒకారములు, ట, డ, ణ అను మూర్ధన్యాక్షరములు, శకట రేఫ, ఱ-కారములు, తమిళమున నిలిచియున్న తాలవ్య నకారమునకు భిన్నమగు పదాంత నకారము, అనునవి యీ భాషలకు విలక్షణము లగు వర్ణము లని చెప్పవలసియున్నది. ఎ, ఒ లును మూర్ధన్యములగు ట, డ, ణ, లు నీ ద్రావిడ భాషలకు సహజములు. వైదిక భాషలో

గాని, సంస్కృత ప్రాకృతములలోగాని, యివి ప్రత్యేక పరిస్థితులను బట్టియో, అనార్య జనులయొక్కయు, వారియుచ్చారణ పరిపాటియొక్కయు సంపర్కము వలననో, కాలక్రమమున నేర్పడినవేగాని. ఆయా భాషలకు సహజములను చెప్పుటకుఁ దగిన యవకాశములేదు. శకట రేఫ, ళ కారములు పదాంత నకారము నిప్పటికిని తమిళ మలయాళములలో ననేకములైన శబ్దములలో ప్రాధాన్యమును వహించి నిలిచి యున్నవి. తొల్కాప్పియర్ నాటికే, అతఁడు తమిళ భాషను వ్యాకరించునప్పటికే ఆ భాషలోనవి కలవు. అంతకుఁ జిరపూర్వమే యా భాషాసాహిత్యములు వ్యాప్తి గాంచియున్నవి. కన్నడాంధ్రములం దివి క్రమమున కొన్ని మార్పులను జెందియున్నను, ఈ భాషలలోని ప్రాచీన వాఙ్మయమున ళకారమును, ఇటీవల కొంతకాలమువరకు శకట రేఫయును వ్యాప్తిలో నుండినవి. ఈ వర్ణములు సంస్కృతా ద్యార్య భాషలలో లేకుండుటేగాక ఆధునికార్య భాషలలో ద్రావిడ భాషా సంసర్గమువలన సుమారు క్రీ.శ. 10-వ శతాబ్ది నుండి బయలుదేరినవేగాని, వీనికి మూలము లనఁదగు ప్రాకృత భాషలలోఁగూడ నీవర్ణములు కానరావు, కావున నివి యీ ద్రావిడ భాషలకు విలక్షణము లనుటకు సందేహము లేదు. ద్రావిడ భాష లన్నిటిలోను సజాతీయములని చెప్పఁదగిన పెక్కుశబ్దములలోను ధాతువుల లోను నీ వర్ణముల యునికి నిశ్చయింపఁదగియుండఁగా, నిన్ని శబ్దములలోని యీ వర్ణములు నేవోకొన్ని సంస్కృత శబ్దముల లోని షకార రకారాదివర్ణ సంయోగమువలన జనించినవని చెప్పుట కేవలము హాస్యాస్పదము.

(5) ఈ భాషలలోఁ గొన్నిటిలోని యనుస్వార – బిందు సంప్రదాయము సంస్కృతభాషా సంసర్గ సంస్కారములను బట్టి వచ్చినదేగాని, వర్గాను నాసికము వ్రాయుటయే యీ భాషలలోని సహజసంప్రదాయము. ఈ యలవాటే యిప్పటికిని తమిళభాషా విలేఖనమున ననుసరింపఁ బడుచున్నది. తెలుఁగు కన్నడములలో ప్రాచీనవేంగిలిపి కాలము నాటికి ద్రావిడ సంప్రదాయమే దేశీయ శబ్దముల విషయమున ననుసరింపబడినను, కాలక్రమమున సంస్కృతలిపి సంప్రదాయమే ప్రబలఁజొచ్చినది. కావుననే దిగు బఱు, పసుపుబఱు, కొడికి–మొదలగు కొన్ని శబ్దములలో బిందువు పూర్వస్వరము ననుసరించునట్లుగా దిగుంబఱు పసుపుంబఱు అని వ్రాయక దిగుమ్బఱు, కొడిఙ్కి అను వ్రాతయొక్క సంప్ర దాయమును బట్టి మ, ఙ ల స్థానములందే బిందురూపమగు బొట్టు నుంచుటచేత—ఈ శబ్దములను చదివినవారు దిగుబంఱు, పసుపుం బఱు, కొడికిం—అని చదువుట తటస్థించినది. అనుస్వారము తల్లేఖన పద్ధతి సహజముగ ద్రావిడభాషా సంప్రదాయమునకుఁ జెందినవి కావని ఆ నాటి శాసనములలోని వ్రాతయు—దానికి భిన్నమగు సంప్రదాయమున కలవాటుపడినవారు వానిని చదువుట లోఁబడిన తప్పిదములే, మనకు వ్యక్తము చేయుచున్నవి.

(6) సంధి :— ఈ భాషలలోని సంధి సామాన్యముగా పరరూప సంధియే. సంధి లేనపుడు సాధారణముగా యకార వకారము లాగమములగును. సవర్ణదీర్ఘ, గుణ, వృద్ధి, యణా దేశాదు లిందురావు. ప్రాచీన ప్రాకృత భాషావస్థయందును

పదమధ్యమందు హల్లులు లోపించినపుడు ఉద్వృత్తాచ్చుల నడుమ యవలను జేర్చుట ద్రావిడభాషా సంపర్కబలమునే సూచింపఁ గలదు.

(7) వర్ణములలోని మార్పులు :— తమిళమునందలి ఇకారము తెలుఁగు కన్నడములలో ఎకారముగా కనఁబడును. ఉదా.

త, ఇళ, తె, ఎల, క, ఎళె; త, విళంగు—క, బెళగు—

తె, వెలుఁగు; త, పిఱ—తె, పెఱ, క, పెఱె మొ.

ఉ—ఒ—ముళై - మొళె; పుకళ్ - క, పొగళ్, తె, పొగడు; ముదల్ - మొదలు; కుళం - కొళం - కొలను.

ఆ—ఏ ల మార్పు :— త, ఆఱు - ఏఱు; ఆళ్ - ఏలు, యానై - ఏనుఁగు; ఆండు - ఏండు.

పదమధ్య పరుషము సరళముగా మారుట :—

త, పుకళ్ - పొగడు; పుకై - పొగె, పొగ; అకళ్ - అగళ్,

పదాది కకారము గకారముగా మారుట :—

త, కూన్ - గూను; కిళి - గిళి; కూండు - గూడు, కీఱ్ - గీరు, కుటి - గుడి.

పదమధ్య తకారము సకారముగా మారుట :—

త, నుతల్ - నొసల్—నొసలు; ముదలై - మొసలి.

ణ, ఱ, ళ కారములు తెలుగున న, డ; ల లగును :—

త, అణ్ణన్ - అన్న; కణ్ - కన్ను; మాణ్ - మాను, పూణ్-పూను, పుగళ్ - పొగడు, పాఱ్ - పాడు, అఱు-ఏడు, కోఱి-కోడి.

కుళం - కొలను, ఆళ్ - ఏలు, విళంగు - వెలుంగు, ఇళమ్ - ఎల.

"ఱ" కారము తెలుఁగులో రేఫ ణకారములుగాను మారుట కలదు :—

త, పుఱల్, క, పొఱల్-ప్రోలు; త, కీఱె-క, కెఱగె, తె. క్రింద; ముఱంగు - మ్రోఁగు, పొఱుదు - పొఱ్దు - ప్రొద్దు, ముఱుకు-మునుగు.

"న్ఱ" - తెలుఁగు కన్నడములలో న్డ, న్ద గా మారును :—

త, ఒన్ఱు - ఒన్దు - ఒణ్డు; కున్ఱు - కొండ; తిన్ఱి - తిండి; కన్ఱు - కందు.

5. లింగ వివక్ష :

ద్రావిడ భాషలలోని నామవాచక శబ్దములు రెండు విధములుగ విభాగింపబడినవి. తమిళమున ఉయర్ తిణై - అఱ్ఱిణై అని, తెలుఁగులో మహత్తులు - అమహత్తులు అని, వివేకము గలవారిని సూచించునవి "ఉయర్ తిణై" విభాగమునకును తద్భిన్నములు "అఱ్ఱిణై" విభాగమునకును జెందును. స్త్రీ తిర్యగ్జడ భిన్నంబులు - మహత్తులు, స్త్రీ తిర్యగ్జడ వాచకములు - అమ

హత్తులు, అని తెలుఁగు వైయాకరణుల విభాగము. తెలుఁగులో స్త్రీ వాచక శబ్దములు కూడ తిర్యగ్జడ వాచకములతోఁ జేర్పబడినవి. ఇట్టి విభాగ మితర భాషా కుటుంబములలో నెచ్చటను లేదు. స్త్రీ పురుష భేదమును. స్త్రీ పురుష వాచక శబ్దములను జేర్చి చెప్పుటచే (ఆడుబిడ్డ మగ గుఱ్ఱము అను రీతిగా) సూచింపఁబడును. కావున నిది వ్యాకరణమునకు లేదా శబ్దములకు సంబంధించినదికాదు. అర్థము నబట్టి వచ్చినది.

మహత్తులలో తమిళ కన్నడముల - లింగభేదము సర్వనామ ప్రత్యయములను జేర్చుటచే సూచింపఁబడినది - అవన్, అవళ్. బహువచనమున స్త్రీపుం భేదము లేదు. "అవర్" అనునదొక్కటే రూపము. బ్రాహుయిభాషలో మహత్తులలోఁ గూడ లింగభేదమును సూచించు మార్గము లేదు. కుయి, కురుఖ్, మాల్తో, గోండి, కొలామి, తెలుఁగు భాషలలో స్త్రీ ప్రత్యయము వేరుగాలేదు. అమహత్ ప్రత్యయమే స్త్రీలింగ సూచకమగుచున్నది. కావుననే స్త్రీవాచక శబ్దములు అమహద్వర్గములోనే చేర్పఁబడినవి. బండి వచ్చినది గుఱ్ఱము వచ్చినది, అన్నట్లే సీత వచ్చినది అన్నప్పుడునుగూడ తిర్యగ్జడ వాచక ప్రత్యయమే చేర్పఁబడుచున్నది. తమిళ కన్నడములందు మాత్రము స్త్రీవాచక శబ్దములకు "ఆళ్" అను ప్రత్యేక చిహ్నము కల్పింపబడుటచేత, వండి వందదు, కుదిరై వందదు, అని చెప్పినను, సీతా వందాళ్, అమ్మా వందాళ్ అని స్త్రీ వాచక శబ్దములకు "అళ్" ప్రత్య

యము చేర్చి చెప్పుదురు. కుయి, గోండి, భాషలలో స్త్రీవాచక శబ్దములకు బహువచనమునఁగూడ నపుంసక - అమహద్రూపమే వాడఁబడును. తమిళ కన్నడములందువలె స్త్రీలింగ వివక్ష లేక పోవుటచేతను, ద్రావిడభాషా కుటుంబములోనిదేయైనను వీనికి కొంత దూరస్థమై ఆర్యభాషల నడుమ తన వ్యక్తిత్వమును, విశేష లక్షణములను నిలుపుకొనియున్న బ్రాహుయి భాషలో నిట్టి లింగ వివక్షయే లేకపోవుటచేతను, లింగ వివక్షయనునది కాల్డ్వెల్ పండితుఁడు చెప్పిన ట్లీభాషలలోఁ గాలక్రమమున, సక్రమాభివృద్ధి నంది యేర్పడినదిగాఁ దలంపవలసియున్నది.

వచనము :— ఏక వచన బహువచనములే యీ భాషలలోఁ గలవు. ద్వివచనము లేదు. వచనమును సూచించుటకు సర్వనామ ప్రత్యయములును, కళ్, గళ్, లు అను ప్రత్యయములును జేర్పబడును.

6. విభక్తి స్వరూపము :

ఈ భాషలలోని విభక్తులను సూచించునవి స్వతంత్రశబ్దములే, లేదా వాని యవశిష్టభాగములు. ఇవి నామముపైఁ గాని క్రియా విశేషణ రూపముపై గాని చేరి వాని ప్రత్యేకతను నిలుపుకొనుచునే యున్నవి. నామవాచక శబ్దముపై విభక్త్యర్థక శబ్దము చేరినపుడు స్థానబలిమి చేతనే పూర్వమందలి నామము పరమందలి దానికి విశేషణమగుచున్నది. వచనములు రెండే. బహువచనమున నామముపై విభక్త్యర్థక శబ్దమునకుఁ బూర్వము

బహువచన చిహ్నము చేరుచున్నది. సంస్కృతాది భాష లలో ప్రతి విభక్తి యందును ప్రతి వచనమునకు నొక్కొక్క ప్రత్యేక చిహ్నము కలదు. వచనమును మాత్రము సూచించు ప్రత్యయము వేరుగానుండదు. ద్రావిడ భాషలలో విభక్తిప్రక్రియ యొక్క రీతికలదేగాని, సంస్కృతమునందువలె శబ్దములయొక్క స్వరూపమునుబట్టి మారుచుండినదిగాదు. ఒక విభక్తి యర్థమును సూచించుట కనేక శబ్దములు ప్రయోగింపఁబడుటయుఁగలదు. సామాన్యముగా విభక్తి పరమైనపుడు ప్రాతిపదికయందును మార్పేమియు జరగదు. దాని విశేషణత్వమును వ్యక్తముచేయుట కొరకప్పుడు ప్రత్యేక చిహ్నములు చేర్పఁబడును. నామవిభక్తివలెనే క్రియావిభక్తి ప్రక్రియయు నొకేరీతి గలది. ధాతువుపై కాల వాచక చిహ్నములు, లేదా తత్తదర్థబోధక శబ్దములు వానిపై సర్వ నామ రూపములు చేర్పఁబడుటచే క్రియారూపములు సిద్ధించును. ధాతుస్వరూపమున మార్పేమియు గలుగదు.

మొత్తముమీద విభక్తి లక్షణమంతయు, భిన్నశబ్ద—ధాతు - సంయోగరూపమును, విశేషణ విశేష్యభావ సంబంధ మూలకమునై యున్నట్లగపడక మానదు.

7. విశేషణములు :

ఇవి సామాన్యముగా గుణ వాచకములు, సంబంధ వాచకములు. వీనికి విభక్తులు లేవు. వీనియందలి తర తమ భావము సంస్కృతమందువలె ప్రత్యయముల మూలముగా సూచింపఁబడదు. విశేషణములు విశేష్యములనుబోలి లింగ

విభక్తి వచనములందు పొందిక గలిగియుండవలసిన యావశ్యకతయు లేదు. భిన్నశబ్ద సంయోగముచేతనే తరతమ భావములు వ్యక్తము చేయఁబడును. సామాన్యముగా నామవాచక శబ్దముల షష్ఠీ రూపము విశేషణమగును. క్రియాజన్య విశేషణములును విశేషణములే. శిరియ, పెరియ, ఉయర్న్ద.

8. ఉత్తమపురుష సర్వనామ బహువచన రూపము :

మనము, మేము, వంటివి. (ఎదుటివానిని చేర్చి చెప్పునదొకటి, ఎదుటివానిని పరిహరించి తమనుమాత్రమే చెప్పునదొకటి)—సంస్కృతాద్యార్యభాషలలో లేవు. మరాటీ - గుజరాతీలలో నిటీవల నట్టి రూపము లేర్పడుట ద్రావిడభాషా సంపర్క బలము వలననే యైయుండును.

9. ఈ భాషలలో ప్రథమ పురుషలలో ప్రత్యేక సర్వనామ శబ్దము లేవు :

అ, ఈ, ఏ— అను నిర్దిష్టార్థక రూపములపై— పుం స్త్రీవాచక చిహ్నములను జేర్చుటచే నవి యేర్పడుచున్నవి. అవన్, ఇవన్, ఎవన్, వాడు, వీడు, ఎవడు, అవళ్, ఇవళ్.

10. సంబంధార్థక సర్వనామముల కీ భాషలలో వాడుక లేదు. వీనికిఁబదులు క్రియావిశేషణములనే వాడుదురు.

11. ఈ భాషలలోని క్రియారూపము :

ఒక కాలమున నిది సర్వనామ ప్రత్యయములు లేకయే యుండి నట్లగపడును —cf. త, క, శెయ్‌గుమ్ - గెయ్ గుమ్, తె, చేయున్ - చేసెన్.) మలయాళమున

నిప్పటికిని లేవు. కాలవాచక, సకర్మకాకర్మక, ఆత్మనేపద, కర్మార్థ, విధ్యాద్యర్థ, ప్రేరణ వ్యతిరేకార్థకములగు చిహ్నములును లింగవచనద్యోతక చిహ్నములు నొకదానిప్రక్క నొకటి ధాతువుపై చేర్పఁబడి యెట్టి మార్పు నొందకయే క్రియా రూపము లగుచుండును. క్రియా రూపములలో సామాన్యముగా తుదిని నిలుచు సర్వనామ చిహ్నమునకు పూర్వభాగమంతయు విశేషణమగును. అనఁగా సర్వనామ చిహ్నములు ధాతువుపై గాక, కాల సూచక చిహ్నములతోఁగూడిన క్రియా విశేషణములపై నిలుచుచుండును. భిన్నధాతు సంయోగముచే నర్థభేదము లేర్పడుచు, ధాతుపల్లవములు, శబ్ద పల్లవములు కల్పితము లగుచుండును. ఉపసర్గ లీ భాషలలో లేవు. కర్మణ్యర్థము భిన్నధాతు సంయోగముచే సూచింపఁబడునేగాని, సంస్కృతమందువలె దీనికి ప్రత్యేక క్రియా రూపము లేదు. ఈ భాషలలో సనాద్యంత ధాతువృత్తిలేదు. అన్నంతమగు ధాతువుపై తత్తదర్థబోధక ధాత్వంతరములను చేర్చుటచేతనే ఆయా రూపము లేర్పడుచున్నవి. చేయన్ ఇచ్ఛయించినాడు, చేయన్ దలచినాడు.

12. వ్యతిరేకార్థక క్రియారూప ప్రక్రియ యీ భాషల విశిష్ట లక్షణములలో నొకటి.

13. ఈ భాషలలో సముచ్చయార్థకములకు బదులు క్రియాజన్య విశేషణ రూపములే వాడబడుచుండును. వాఁడు వండి పెట్టి పోయినాఁడు.

14. నామక్రియలు (Appellative verbs) :

నామవాచక శబ్దములకు విశేషణములకు సర్వనామ చిహ్నములను జేర్చుటచే నీ భాషలలో నామక్రియలేర్పడును. (నేను రాజను, నీవు కపివి. త. కోనేన్, అడియేన్, ఎల్లామ్. ఎల్లీర్). సంస్కృతా ద్యార్యభాషలలో నిట్టివి లేవు.

15. వాక్య నిర్మాణము :

నామమునకు ముందు విశేషణమును, క్రియకు ముందు క్రియా విశేషణములును నిలుచుచుండును. వాక్యము కర్తృవాచిపదములతోఁ బ్రారంభించి క్రియాపదముతో నంతమందును. వాక్యమున మొదట విశేషణములతోఁగూడిన కర్తృవాచి పదమును తరువాత కర్మయు, తరువాత క్రియా విశేషణము, వాక్యాంతమున క్రియాపదము నిలుచుట యనునది యిందలి వాక్య నిర్మాణపద్ధతి. సంస్కృతమున వాక్యములో నే శబ్ద మెచ్చటనైనను రావచ్చును. విశేషణములకు విశేష్యంబులంబోలె లింగవచన విభక్తులగును. ద్రావిడ భాషలలోని వాక్యము అందలి పదముల స్థాన నియమము, అంపు వానికి గలిగిన విశేషణ విశేష్యభావ సంబంధముపై నాధారపడి యేర్పడినది. అది సంస్కృత ప్రాకృతములందువలె విభక్తి ప్రత్యయములు లోపించుటచే నాధుని కార్యభాషలతోపాటు ఇటీవల నేర్పడినది కాదు. ప్రాకృతావస్థలోఁగూడ విభక్తి ప్రత్యయము లుండనే యుండినవి. ఆధునికార్య భాషలలో నవి లోపించి, వాని స్థానమున ప్రత్యేక పదములు వచ్చుటకును వాక్యనిర్మాణ పద్ధతి మారుటకును ద్రావిడ భాషా సంపర్కమే కారణ మనక తప్పదు.

ప్రాకృతములలోవలె ద్రావిడ భాషలలో సంస్కృత విభక్త్యంత శబ్దములు రూపము లొక కాలమున నుండి, తరువాత లోపింప లేదు. ఈ భాషలలో నట్టివి మొదటి నుండియు లేనేలేవు.

16. శబ్దజాలము :

ఈ ద్రావిడభాషా కుటుంబములో దక్షిణ హిందూ దేశము నందలి భాషలే కాక, ఉత్తరదేశమునందలి గోండీ, కుయి, ఒరెయన్, బ్రాహుయి మొదలగు ననాగరక భాషలుకూడఁ జేరి యున్నవి. ఈ యనాగరక భాషలను గూర్చి పరిశోధన మింక జరుగవలసియున్నను, వాయవ్య దిగ్భాగమున బ్రాహుయిభాషయు, మధ్యదేశమున గోండి, కుయి, ఒరెయన్, మొదలగు భాషలును- ఆర్యభాషల నడుమ నింతకాలమునుండియు నిలిచి వాని ప్రభావ మున కపరిమితముగ లోనై యున్నను, వానికి సహజములగు ద్రావిడ భాషా లక్షణముల నింకను విడువకుండెననుటయే ఆశ్చర్యకరము. దీనివలన ద్రావిడ భాషలను వ్యవహరించిన జనమీ దేశమందంతటను వ్యాపించి యుండిరనియుఁ దెలియ వచ్చుచున్నది. సంస్కృత భాషా సంపర్కము తత్ప్రభావము ద్రావిడభాషలపై నపరిమితముగా ప్రబలుటచేత సహజములగు దేశ్య శబ్దము లనేకములు ఆర్య శబ్దములచే వ్యవహారమునుండి తొలగింపఁబడిన వగుటచే, నిప్పటి స్థితిలో సంస్కృత శబ్దజాలము లేకయే ద్రావిడ భాషలకు నిలువలేనిస్థితి యేర్పడినను ఏర్పడవచ్చును. అంతమాత్రముచే సామాన్య వ్యవహారమునకుఁ దగిన శబ్దజాల మీ

భాషలలో లేనేలేదనుట యుక్తముకాదు. ఇప్పటి హైందవసంస్కృతిని నాగరికతను వ్యక్తీకరింపఁగల దేశి శబ్దజాల మొకప్పుడీ భాషలలో లేకపోవచ్చును. ప్రాకృత భాషలలోను, ఆధునికార్యభాషలలోను గల "దేశి" శబ్దజాలమునంతను ఏదోవిధముగా సంస్కృత ధాతుపాఠములోవి యే ధాతువులతోనో ముడిపెట్టి సంస్కృత జన్యమని సాధించుటకై చేయబడిన యత్నము లెంతమాత్రము సఫలము కాలేదు.

ద్రావిడ భాషాతత్త్వమును గనుగొనుటకు పెక్కుమంది విదేశీయ పండితులును కొందరు దేశీయులుగూడ కృషి సల్పుచునే యున్నారు. ద్రావిడ భాషలలోని దేశ్య పద జాలమంతయు నార్య భాషాజన్యమని రుజువు చేయగలిగిన సాహసికులెవ్వరు నింకను బయలుదేరలేదు. ఇతరములగు దక్షిణదేశ భాషలతోఁ బోల్చి చూచి కినంతవరకైనను ఈ దేశ్య శబ్దముల మూల రూపముల నన్వేషణకు దొరకొని సాధింపకయే, యీ భాషలను సహజములగు ధ్వని పరిణామ పద్ధతులనన్వేషించి నిర్ణయింపకయే యేదోయొక తెలుఁగు భాషలో మాత్రమే యనేకవిధ పరిణామములను బొంది యేర్పడిన కొన్ని దేశి శబ్దములను ఏ యక్షర సామ్యమును బట్టియో—యేవో కొన్ని సంస్కృత ధాతువులతో ముడిపెట్టి వ్యుత్పత్తులను కల్పించి రూప నిష్పత్తి చేయుటకై చేయఁబడిన యత్నములు సఫలములనిగాని, భాషాతత్త్వశాస్త్రసమ్మతములనిగాని తలంచుటకవకాశములేదు క్రీ.శ. 7వ శతాబ్దినాడే కుమారిల భట్టాచార్యుడీ సంస్కృత పండితు

లెట్లు భాషలలోఁ జేరిన యన్యభాషా శబ్దములకు సంస్కృత ధాతువులనుండి వ్యుత్పత్తులను గల్పించి, నిష్పత్తిచేయుచుండిరో సూచించియేయున్నాఁడు. పాప్, వయిర్, అతర్ - మొదలగు ద్రావిడ శబ్దములకు - పాప శబ్దములతోను, వైరి శబ్దముతోను (తర్తుం న శక్యత ఇతి అని) తౄ ధాతువులతోను సంబంధము కల్పించి తచ్ఛబ్ద నిష్పత్తి సాధింతురని చెప్పి ఆనాడే ఇట్టి సాహసిక నిష్పత్తి కల్పనోద్యమమును ఖండించి వారించినాఁడు. అనఁగా దీనివలన నాతని కాలమునకు ద్రావిడభాషలనఁబడునవి ప్రత్యేకములగు దేశీయ భాషలుగా నేర్పడి యుండినవనియు, నివి సంస్కృత జన్యములో ప్రాకృత జన్యములో, లేదా ప్రాకృత భాషా వికారములనియో తలంపక, అవి స్వతంత్రములగు దేశ భాషలనియే ఆ కాలమున నాతఁడు తలంచియున్నాఁడనియు దెలియ వచ్చుచున్నది. భరతుని నాటికే ద్రావిడము, ఆంధ్రము అనునవి భిన్నభాషలగుటయేగాక, శకారకోఢ్రాది భాషలకంటెను, శౌరసేని మొదలగు ప్రాకృతములకంటెను భిన్నములేయను భావమే ప్రబలినట్లు తెలియుచున్నది. కావున నివి 10-వ శతాబ్ది ప్రాంతమున నాధునికార్య భాషలవలెనే ప్రాచీన ప్రాకృతములనుండి యేర్పడినవనుట యేమాత్రమును సంభావ్యముకాదు.

కుమారిలభట్టు సూచించిన పిక నేమాది విదేశీయభాషా శబ్దములవలెనే, దేశీయ భాషాశబ్దములును వేదభాషయందును సంస్కృతమందును గూడ నాయాకాలములందుఁ జేరియుండు ననుటకు సందేహము లేదు. అట్టివానిని గూర్చి ద్రావిడభాషా తత్వ పరిశీలకులగు గ్రియర్సన్, గండర్టు, కిట్టెల్, కాల్డ్వెల్

మొదలగువారు చర్చించి నిర్ణయించియే యున్నారు. వైదిక భాష లోని అణు, అరణి, కటుక, కపి, కర్మార, కుట, కుండ, నీల, పుష్ప, ఫల, మయూర, మొదలగు శబ్దములును, బ్రాహ్మణము లలోఁ గానవచ్చు, అటవి, కంబరశ, తిల, మర్కట, వశక్ష, వ్రీహి, శవ మొదలగునవియు దేశీయములగు ననార్య ద్రావిడ భాషలనుండి గ్రహింపఁబడినవేయని భాషా తత్వజ్ఞులు తలంతురు. కాని పిక నేమాది శబ్దములు సంస్కృతీయములేయని వాదించినట్లే, పై శబ్దములన్నియు సంస్కృతీయములే యనువారును లేకపోరు. ఇది యిట్లుండ క్రీ. శ. 11వ శతాబ్దిని ప్రాకృత వ్యాకరణమును రచించిన హేమ చంద్రుఁ డాభాషలలోఁజేరిన దేశ్యశబ్దములను గూర్చి "దేశి నామమాల" యను నొక గ్రంథమునే రచించినాఁడు. వీనిలోఁ గొన్ని తద్భవరూపములు ప్రక్షిప్తములై యుండిన నుండ వచ్చును గాని, అంతమాత్రమున "దేశి" నామమాలను రచింపఁ దలఁచిన హేమచంద్రునకు "దేశి" తద్భవభేద పరిజ్ఞానమే లేక పోయినదనుట యుక్తముగాదు. వీనిలో కోల్ - ముండా భాషా పదములును కొన్ని చేరియుండవచ్చును. కాని యీ దేశినామ ములలోని యీ క్రిందివి ద్రావిడ భాషాపదములనుటకు సందేహము లేదు.

అక్కా-వృద్ధభగినీ, (అంబార్థస్తు సంస్కృత సమః), అత్తా-పితృష్వసా, శ్వశురభార్యా; భావ; మమ్మి, మామా; ఉడిదో-మాషాధాన్యం (cf. ఉఋన్దు-ఉద్దు); ఊరో – గ్రామః; కల్లా-కల్లు; కురుల – కుటిల కేశే; ఖడ్డం – శ్మశ్రుః; చించా-ఆమ్లికా; ణేసరో – రవిః; (కన్న – నేసర్, త. ఞాయిఱు);

పసెంఁడీ-కనకం; పావో-సర్పః; పుల్లీ-వ్యాఘ్రః; ముంగుసూ-నకులం; ముద్దీ- చుంబితం; రొట్టం-తండులపిష్ఠం; పూడియం-గృహం; మొగ్గర-కుట్మల-మొగ్గ; వెళ్ళాం-ధవళం; కావి-నీలివర్ణా; కన్నో-పంకః మొదలగునవి.

ఇవి దక్షిణ దేశభాషలన్నిటిలోను సమానముగాఁ గొంతవరకు సరూపములునై కనఁబడుచున్నవి. తద్భవములు కూడనీ భాషలన్నిటిలోను నట్లే కనఁబడునని చెప్పవచ్చును. గాని వానికి ప్రకృతియనఁదగిన శబ్దము సంస్కృతమున సహజమా, భాషాంతరములనుండి సంక్రమించినదా యను విషయము పరిశీలనార్హంబగును. ద్రావిడభాషా కుటుంబమునకుఁ జెందిన బ్రాహుయిభాష యిప్పటికిని బెలూచిస్థానమున, తన యనార్యత్వ చిహ్నములను, ద్రావిడభాషా లక్షణములను నిలుపుకొని బెలూచిస్థాను ప్రాంతమున నిలిచి యుండుటచేతను, వింధ్యప్రాంతమునందలి కొండ జాతులలో గోండి, మాల్తొ, ఒరయాఞ మొదలగు ద్రావిడభాష లిప్పటికి వ్యాప్తిలో నుండుటచేతను, ఈదేశ మార్యజనా క్రాంతమగుటకుఁ బూర్వమే యాదేశ భాగమునందంతటను ద్రావిడాది భాషలను మాట్లాడిన జనులు నివసించియుండిరేకాని ఇది నిర్జనారణ్యమనఁ దగదు. కావున వారితో నార్యులకీ దేశముప్రవేశించుటకు పూర్వము నుండియు సంసర్గము కలుగుచునేయుండి, హిందూదేశమునకు వచ్చి నెలకొనినపిదప హెచ్చుగాఁ గలిగినదనియు నిశ్చయింపఁ దగియున్నది. కావుననే ఋగ్వేదకాలమునుండియుఁగలిగిన యీ యనార్య ద్రావిడ సంపర్కమువలన నార్యభాషలోఁ దొలుత కొన్ని

యనార్యశబ్దములు మాత్రమే ప్రవేశించినను, కాలక్రమమున నీ యనార్య ద్రావిడజన మార్యభాషను నేర్చి వ్యవహరింపవలసిన వారైనపు డాభాషారూపములను స్వీయోచ్చారణ సంప్రదాయాను సారముగాఁ బలుకఁజొచ్చుటచే, వైదిక సంస్కృత భాషాధ్వని సంప్రదాయములలో మార్పు గలిగి ప్రాకృతభాషల ను నవి యేర్పడి నవని చెప్పనగును. ఈ కారణముచేతనే తొలియుగమున కొన్ని యనార్య శబ్దములు మాత్రమే చేరుటయు, తరువాతి కాలమున అనఁగా మధ్య హింద్వార్యావస్థలో లేదా ప్రాకృత భాషావస్థలో ధ్వనుల మార్పులే విశేషముగాఁ గనఁబడుటయుఁ దటస్థించినదే గాని, భాషానిర్మాణము వ్యాకరణరూపములలో మార్పులు విశే షముగాఁ గనఁబడలేదు. వైదిక యుగమునందలి భాషలో గల రూప సంపత్తి తగ్గినదేగాని, వ్యాకరణపద్ధతి మారలేదు.

ఇంకను మరికొంత కాలమునకు దేశమునందలి యనార్య జనులార్యసంఘములో నంత్యజాతివారై స్థిరపడుట తటస్థించిన తోడనే, అనార్యభాషలలోని వాక్యనిర్మాణ పద్ధతులు వ్యాకరణ సంప్రదాయములుగూడ నార్యభాషలగు ప్రాకృతములపై తమ ప్రభావమును నెరపి, ప్రాకృతములకు క్రమేణ యపభ్రంశావస్థను, ఆధునికార్య భాషావస్థను దెచ్చిపెట్టినవి. కావుననే ప్రాకృతావస్థలో నార్యభాషాధ్వనుల యుచ్చారణ విషయములలోనే కనఁబడజొచ్చిన యనార్యసంప్రదాయము లాధునిక కార్యభాషలలో వ్యాకరణ పద్ధతి యందును, భాషానిర్మాణరీతులయందునుగూడఁ జొరబడినవి. వైదిక యుగమునుండియు కొద్దిగనో గొప్పగనో దేశ్యశబ్దములాభాషలోచేరు

చునే యున్నవి. వానికి సంస్కృత ధాతువులనుండి వ్యుత్పత్తులను పండితులు కల్పింప యత్నించుచునే యుండిరి. ప్రాకృతావస్థలో నీ శబ్దజాలము పెరిగిపోవుటచేతనే వైయాకరణులు దేశి నామ మాల అను పట్టికలనే తయారు చేయవలసిన వారైనారు. ఇవి దేశభాషలనుండి ప్రాకృత భాషలలో సంక్రమించినవనియే నిశ్చ యింపవలసియున్నది.

ఈ 'దేశి' శబ్దములకు దేశభాషా శబ్దములతోఁ గల సంబంధమును బరిశీలించి వ్యుత్పత్తుల నారయవలసినదేగాని, సంస్కృత సంబంధమే యెట్లో చూపి వాని యార్యత్వమునో, అదేశీయత్వమునో స్థాపించు నుద్దేశముతోడనే కృషి సల్పవలయు నని వాదించువారి నే మనగలము? కుమారిల భట్టాచార్యుఁడాకాల మున ననినట్లే "తద్యథా ద్రావిడాది (దేశీయ) భాషా స్వైదృశీ స్వచ్ఛంద కల్పనా, తదా పారశీకయవన రౌమకాది భాషాసుకిం వికల్ప్యైకిం ప్రతిపత్స్యన్త ఇతి న విద్మః"-అనియే మనము ననవల యును. ఈ ఆంధ్రదేశ్యము యొక్క మూలరూపముల నితర దక్షిణదేశ భాషా రూపములతోఁబోల్చి కనుఁగొనకయే, మూల భాషా శబ్దములనుండి విశేషముగా మార్పుజెందియున్న యిప్పటి తెలుఁగు రూపముల నే సంస్కృత రూపములకో ముడివెట్టి వ్యుత్పత్తులను గల్పింప యత్నించుటవలనఁ బ్రయోజనమేమి? ఇకనైనను దక్షిణ దేశీయములై సన్నిహితములై యున్న భిన్న భాషా రూపములకుఁగల పరస్పర సంబంధము, వానిపరిణామక్రమ మునుగూర్చి విశేషపరిశోధనలు జరుగవలసినదేగాని, ద్రావిడభాషా

తత్వజ్ఞాన సంపాదనమునకు— ప్రాకృత భాషలను గూర్చి యింకను పరిశోధనలు జరుగవలయుననుట, యెంతమాత్రము ప్రయోజనకారిగాఁ గనఁబడదు.

ప్రాకృత వైయాకరణులవలెనే దేశభాషా వైయాకరణులు నీ భాషాశబ్దములను తత్సమ, తద్భవ, దేశ్యములనియే విభాగించిరి. తద్భవము తేర్పడు పద్ధతులీ భాషలన్నిటిలో చాలవరకు సమానములే. అనఁగా నీ భాషలలో లేని వర్ణములను పరిహరించి, వీరి యుచ్చారణ సంప్రదాయానుసారముగా నా శబ్దములను మార్పునొందించి గ్రహించుటయే ఆ పద్ధతి. తత్సమ శబ్దముల విషయమునఁ గొంత భేదము కలదు. తమిళమునకు సంస్కృత భాషాప్రభావ మంతగా తగులకపోవుటచే, నీ రెండు భాషలకు సమానములుగానున్న వర్ణములతోఁగూడిన సంస్కృత శబ్దములే యాభాషలో తత్సమములను పేర నట్లే గ్రహింపఁబడినవి. కావుననే మహాప్రాణములు, శ,ష,స లు మొదలగు సంస్కృత వర్ణము లీ భాషలో ప్రవేశింపలేదు. కన్నడాంధ్రములలో ద్రావిడ భాషలకు విజాతీయములగు వర్ణములతోఁగూడిన సంస్కృత శబ్దములను గూడనట్లే గ్రహించి వానిపై మహదమహత్సూచక ప్రత్యయములను జేర్చి వాడుకొను నలవాటు ప్రబలినది. ఇట్టి తత్సమ భాష సంస్కృత పండితుల శిష్ట వ్యవహారముననే బయలుదేరి యుండును. ఈ భాషలలోఁ దొలుత శిష్ట వాఙ్మయమును లేవదీసినవారును వీరే యగుటచే నా శిష్టమార్గకవితయం దీ భాష ప్రాధాన్యము వహింపఁ జొచ్చినది.

ఇక దేశ్యము :—తత్సమ తద్భవములతోపాటు దీనికిని ప్రాకృతవైయాకరణులవలెనే, దేశభాషావైయాకరణులును ఒక విభాగ మేర్పరచినారు. ప్రాకృతములలోని శబ్దజాలము వ్యాకరణ రూపములు నన్నియు సంస్కృతభాషారూప జన్యములే యగుటచే నచ్చటి భాషయంతయు సంస్కృతభవమే యగును. కొన్ని శబ్దములు మాత్రమే దేశభాషలనుండి యెరువు తెచ్చుకొనఁబడినవగుటచే వానిని వారు "దేశి" యని వ్యవహరించిరి. కాని దేశభాషలకు సహజమైయందు వ్యవహారములోనున్న శబ్దజాలమును "దేశి"యని విభాగించుటలో నర్థమేమి? భాషయంతయు దేశియేగదా. ఎంత శబ్దజాలము తత్సమ, తద్భవరూపమున భాషలోనికి వచ్చినను "తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును" అని చెప్పిన కేతనాది లాక్షణికు లా భాష యందెంత గౌరవముకలవారైనను, "దానివలన కొంత"వరకే "గానఁబడియె" ననియు "కొంతతానకలిగెననియు నంతయు నేకమై తెలుఁగు బాస సాగ వినుతి కెక్కె ననియు"- చెప్పిరే కాని, వారి భాషయంతయు నిందలి దేశ్య శబ్దజాలము— వ్యాకరణ రూపములు, ధాతుకూటము. అనునదంతయు గూడ సంస్కృత ప్రాకృతములనుండి యేర్పడినదే యని యెంత మాత్రము తలంచినట్లు లేదు, అట్లు చెప్పనూలేదు. వారాంధ్ర భాష "వికృతి" అని చెప్పినంత మాత్రమున, అందలి తద్భవ తత్సమభాగమే "వికృతి" యని వారు తలంచిరనియే మనము భావింపవలయును గాని, భాషయంతయు ప్రాకృతమువలె నామూలాగ్రముగా సంస్కృత భవమని తలంచిరని నిశ్చ

యించుటకు వీలులేదు. "వికృతి" శబ్దమున కట్టి యర్థము, తెలుఁగు ప్రాకృత పరిణత రూపమేయనియు నార్య భాషా వర్గమునకుఁ జెందినదే యనియుఁ దలంచి దానిని సమర్థింపఁ జూచిన యాధునిక పండితుల కల్పనయేకాని వేరు కాదు. వారు తమ భావనను ప్రాచీనాంధ్ర వైయాకరణులకుఁ గూడ నంటగట్టి తమ వాదమునకు బలము చేకూర్చుకొననెంచిరేగాని ప్రాచీన వైయాకరణుల కట్టి భావ మెన్నడు నున్నట్లగపడదు. దైవభాషయందు వారికిఁ గల గౌరవము చేతను, దేశభాష లన్నిటిలోనుగూడ సంస్కృత శబ్ద జాలము ఇంతో అంతో కనఁబడుచుండుటచేతను, వారట్లు చెప్పి యుందురు. చెప్పినను వెంటనే కొంత తానగలిగెనని చెప్పి వాస్తవస్థితిని వెలిబుచ్చియే యున్నారు. ఇంతేగాక ఒక్క వ్యాకరణ రూపమునైనను సంస్కృత భవమని వారు నిరూపింపయత్నింప లేదు గదా, కావుననే వానితోబాటు ఈ భాషలో సహజముగాఁ గలిగిన యీ శబ్దములను అచ్చతెలుఁగులని, అందరికి సులభముగాఁ దెలిసెడివని కేతన చెప్పియున్నాడు.

"తలనెల వేసవి గుడి మడి
పుల చలి, మడు గూరు, పేరు బూరుగు, మగవా
డలుక యని యెల్ల వారికిఁ
దెలిసెడి యా పలుకు లచ్చ తెనుఁగన బరగున్"-

ప్రాకృత వైయాకరణులవలె, సంస్కృతము నుండి వచ్చినవని చెప్పుటకు వీలులేనివి, అర్థము సులభముగాఁదెలియనివి

యగు శబ్దములనుగాదు వీరు "దేశి" అని చెప్పినది. ఈ దేశిశబ్ద ములకు "ఊరో గ్రామః" అన్నట్లు అర్థము చెప్పవలసిన యావశ్య కతయు, కేతనాదులకుఁ గలుగలేదు. ఇది "కలితీ" లేని అచ్ఛమైన-స్వచ్ఛమైన, తేరిన-తేట తెనుఁగు. తెనుగుదేశమునందలి యెల్లవారికి నప్రయత్నముగనే, సహజముగనే తెలిసెడి పలుకులు గావున-వీని కచ్చ తెనుఁగని కేతన పేరుబెట్టినాఁడు. దీనినే "సహజాంధ్ర దేశ భవము" అని విడమరచి చెప్పి కేతన భావము నీక్రింది విధముగా మరింత వ్యక్తముచేసినాఁడు విన్నకోట పెద్దన-

ఈ మూఁడు తెఱఁగులలో
నేమిటనున్ దొరలకున్న నెల్లజనులకున్
లోమిగులఁ దేట పడియెడు
నా మాటల యచ్చ తెనుఁగు లన నెగడొందున్.

తత్సమ తద్భవ దేశ్య శబ్దములు (దేశ్యము లనఁగా నన్యదేశ్యములని యీతని భావము) ఎల్లజనులకు నర్థము కాకపోవచ్చును గాని, సహజాంధ్ర దేశ్యములైన అచ్చతెనుఁగుమాటలు ఎల్లజనులకున్ మిగులఁ దేటపడియెడు నవియే వీని కర్థము చెప్పనక్కరలేదు. ఈ "అచ్చ తెనుఁగు" అనునది "తద్భవము" దొరలని దని పెద్దన చక్కగా వ్యక్తమే చేసినాడు. కాని తరువాతి వారు తద్భవమును గూడ అచ్చ తెనుఁగులోనే చేర్పఁ గడఁగినారు. తొలుత సంస్కృత భూయిష్ఠ రచనకు పోటీగా నీ యచ్చ దెనుఁగు రచన ప్రారంభమైనది. కాని అప్పకవినాటికీ కేతన

పెద్దనల సంప్రదాయము మారి అచ్చ తెనుఁగున కర్థభేదమే కలిగినది___

దైత్యదమన తత్సమమనఁ దద్భవమన
దేశ్యమున గ్రామ్యభాష నాఁ దెనుఁగు నాల్గు
విధములగు నందుఁ దత్సమ విడిచి మూఁడు
నాంధ్రములె యెందు నందు గ్రామ్యంబు దిరుగు.

దీనినిబట్టియే "తత్సమేతరంబగు భాషయచ్చయనంబడు" అని బాలవ్యాకరణ సూత్రముకూడ నేర్పబడినది. కేతన పెద్దనలు "అచ్చతెనుగు, దేశ్యము" అనువానిని భిన్నములుగాఁ జేసి, అచ్చ తెనుఁగు సహజాంధ్రదేశభవమనియు దేశ్యము "బహుదేశానేయములై యాయా నెలవులఁ జెవులకుఁ దీయములగు పలుకు" లనియు, "తేరనాడిన దేశ్యంపు బలుకులని"యుఁ జెప్పగా,అప్పకవి "దేశ్య"మునే శుద్ధాంధ్రదేశ్యమని, అన్యదేశజాంధ్రమని, రెండు భాగములుగాఁ జేసినాఁడు. ఈతని శుద్ధాంధ్ర దేశ్యమనునది కేతన పెద్దనల యచ్చతెనుఁగే. అది 'ఆంధ్రదేశపుర స్థాయులైన సకల జనములకును మఱుఁగు దేశంబు లేక తేటతెల్లమిగాఁ బల్కు మాటలతోఁగూడినది. అట్టివి పాలు,పెరుగు, నేయి మొదలగునవి.

ఆంధ్రులు నానా దేశంబులయందు నిలిచి, తెలుఁగులె తత్తద్దేశోక్తులంటఁ బలికిన నాశబ్దము లన్యదేశ జాంధ్రము లయ్యె. ఇట్టివి బహుదేశానేయములగుటచే మాండలికములు (Provincialisms) అనవచ్చునేమో, కాని యివి శుద్ధాంధ్ర

దేశ్యములవలె నంత సులభముగా నర్థమగునవిగామాత్రము లేవు. అయినను వీనిలో పెక్కింటి కితర భాషలలో సజాతీయ రూపము లగపడుచునే యున్నవి. శుద్ధాంధ్రములు నచ్చ తెలుఁగులు ననఁబడుచున్న వానిలో—కేతన చెప్పినవి.

తల, నెల, వేసవి, గుడి, మడి, పులి, చలి, మడుగు, ఊరు, పేరు, బూరుగు, మగవాఁడు, అలుక అనునవి. పెద్దన యిచ్చినవి వీనికంటె భిన్నములే.

ఎనుములు, గుఱ్ఱములు, మొదవులు, ఎద్దులు, బండులు పండులు, ఉప్పు, పప్పు, అనుములు, క్రొల్లులు, ఆముదము, ఆకులు, పోకలు, నెయ్యి, నూనె.

ఇట్లు భిన్నములైనను ఇవన్నియు చాలవరకు నిత్య వ్యవహారమునఁ బ్రయోగింపఁబడు వస్తువుల పేళ్ళగుటచే నెల్ల వారికి దెలిసెడి పలుకులే. అప్పకవి యిచ్చినవి యిట్టివే—పాలు, పెరుగు, నేయి, ఉట్టి, తోలు, బిడ్డ మొదలగునవి. కాని కేతన అచ్చ తెనుఁగు శబ్దముగాఁ బేర్కొనిన "వేసవి"— శబ్దమును అప్పకవి అన్యదేశ్యముగా నిచ్చినాఁడు. ఇది తద్భవమే యనియు విశాఖ శబ్దభవమని సులభముగా వాదింపవచ్చును. శబ్దరత్నాకర కారుఁడును దీనిని వైకృతమనియే తెల్పినాడు. కేతన పొరబడి యట్లు చెప్పినాఁడనియు కొందరనవచ్చును. కాని దీని నీ భాష లోని యితర శబ్దములతోడను, ఇతర సన్నిహిత భాషా శబ్ద ములతోడనుఁబోల్చి చూచినచో నిది దేశీయమేగాని తద్భ వము కాదని తెల్లముకాకపోదు. "వేసవి"— వేసఁగి— వేసంగి శబ్దములు కన్నడమునందలి బేసగి, బేసగె; త, వేనిల్, వేసల్

అను సమానార్థకశబ్దములతోఁ బోల్పఁదగియున్నవి. ఇంకను ఇవి కన్న-బిసు, బిసి, బెం, బెచ్చనె, బిసికల్ (సూర్యకాంతి-వేడిమి) బెంకి; త-వెయిల్, వెయ్యిల్, వేనిల్; తె-వేడి, వెట్ట, వేఁగు; వేయించు, వేడిమి; వెచ్చన; వేపు-వేపుడు, మొదలగు శబ్దములతో సంబంధించి యుండుటచే, నిది దేశీయమేగాని, "విశాఖ" శబ్దముతో సంబంధించినదిగాఁ దోపదు. నిత్య వ్యవహారములలోనున్న యితర శబ్దములకుఁగూడ చాలవరకు నితర దక్షిణదేశ భాషలలో సజాతీయ శబ్దములను సులభముగనే పోల్చుకొనవచ్చును. అట్టివి యీ భాష లన్నిటిలో సజాతీయ (cogntate) రూపములు గలవగుటచేతనే యవి దేశమునకు సహజములు, దేశ్యములు నగుచున్నవి.

తల-త, తలై; క, తలె.

నెల-త, నిల,నిలా.

మడి-త, మడి, క, మడి = a fold తె, మడత.

పులి-త. పులి; క, పులి, హులి.

చలి-త, కుళిర్; క-మ, కుళిర్ = to be cool, coolness.

మడుగు-త, మడు; క, మడు = a pool of deep water.

ఊరు-త-క-తు, ఊర్, a town, village.

పేరు-త, పెయర్, పేర్ cf. (పేచు—to sp-ak); క.

పేళ్ = to speak.

బూరుగు-క, బూరుగు; త, పూళై; మ, పూళ= silk, cotton.

మగవాఁడు-త, మగన్; క, మగ్ఁ= son.

అలుక-త, అలంగు. అలుంగు = to shake, tremble. త

అలై = to shake.

ఎనుము-త, ఎరుమై; క, ఎర్మె, ఎమ్మె; తు, ఎమ్మె.

గుఱ్ఱము-త, కుదిరై; క, కుదిరె.

ఎడ్లులు-ఎద్దులు; క, ఎత్తు, ఎఱు-ఎద్దు = ox త-మ ఎరుదు;

తు, ఎరు= an ox.

బండులు-త, పండి, వండి; క, బండి; మ, వణ్డి-వణ్డిల్=

a carriage.

పండు-త-క, పఱమ్.

ఉప్పు-త-క-మ-తు, ఉప్పు.

పప్పు-త, పరుప్పు; క-పప్పు.

ఆకు-క, ఆకు = a leaf, a herb.

పోక-త, పాకు, పాక్కు.

నూనె-నూల్ + నెయ్, cf. త-ఎళ్ నెయ్.

నేయి-క, నేయ్, నేయి = ghee, త, నెయ్ = fat, ghee,oil

పాలు—త-క, పాల్.

ఉట్టి-త, ఉఱి; క, ఉఱి.

పట్టి-క, పడు, పడె = to obtain, to catch, త, పఱ్ఱు =

to catch.

వంచు-క, బళ్కు; త, వళ్-వళై, వణ్, వాంగు.

రోలు-త, ఉరల్; క, ఒరల్, ఒరళ్.

ఎక్కు-త-క-మ, ఏఱు = to ascend, mount, to climb
తు, ఏఱు; క, ఎక్కు.

అన్యదేశ్యములని వీరిచ్చిన శబ్దములలో పెక్కు పైవాని వలెనే తేటతెల్లములు. సులభముగ నర్థమగు శబ్దములుగాఁ గనఁబడుటలేదు. ఇవి సామాన్యముగా కావ్య భాషలో నాయా ప్రాంతములవారు ప్రయోగించిన ప్రాంతీయ శబ్దములని తోచుచున్నది. తమిళ వైయాకరణుఁడగు-తొల్కాప్పియరుకూడ ఇయర్చ్చొల్, (సులభముగఁ దెలియు నచ్చ తమిళ శబ్దములు) తిరిచొల్ (కావ్య భాషా పదములు) తిశైచ్చొల్ (విదేశీయ పదములు) వడచొల్ (సంస్కృతము నుండి వచ్చినవి) అనియే యా భాషాశబ్దములను విభాగించినాఁడు. అందాఁతడు చేసిన "తిశైచ్చొల్" అను శబ్దముల విభాగమువంటిదే—మన భాషలోని "అన్యదేశ్య" విభాగము కావచ్చును. ఆంధ్రులై నానా దేశములందు నిలిచి తెలుఁగులై తత్తద్దేశోక్తులంట బలికినవి అన్యదేశజాంధ్రము లన్నారు. వీరు ప్రత్యేకముగా కావ్యభాషా పదము లను విభాగమును జేయకపోయినను ఆ శబ్దములు ఆయా ప్రదేశములందలివారు, రచించిన కావ్యముల నుండియే గ్రహింపఁబడియు నుండవచ్చును. వీరుదాహరించిన శబ్దముల తీరు నట్లె కనఁబడుచున్నది. పెక్కుశబ్దములు సమాసములు

నెత్తమ్మి, రేపూవి, తెమ్మెర, వలరాజు, రేవేడు, అలరుపిండు, వాలుగంటి, క్రొమ్మించు, కెమ్మోవి, కెంజాయ, కమ్మతావి, రేయెండ, క్రొన్నెల, నెమ్మోము, వేనవేలు ఇత్యాదులు.

ఇవి చాలవరకు నిత్యవ్యవహారములో లేక ప్రాతవడ్డ మాటలుగానే కనబడుచున్నవి. ఈ విషయమునే అప్పకవి కూడ "ప్రాఁదెనుగుల" ప్రశంసను దెచ్చి మనకుఁ దెలుపుచున్నవాఁడు వలె నున్నాఁడు. ఇది తొల్కాప్పియర్ చేసిన "తిరిచొల్" వర్గముతో సరిపోవును.

తొల్లింటి కవుల వాక్యము
లెల్లను బ్రాఁదెనుగులయ్యె నిప్పటివారలు
చెల్లుబడు వాడు నవియే
దెల్లమిగా నింకఁ బ్రాఁత తెనుఁగులు నృహరీ"

ఇట్టి ప్రాఁదెనుగుల కుదాహరణముగా పుడమి, సిరి.పడతి, వెడవిలుతుఁడు, పసిడికడుపు వేల్పు, మొదలైన శబ్దముల నిచ్చినాఁడు. అయితే యివి యాయా మండలంబులందలి వ్యవహారము నుండి యీ లాక్షణికులు సేకరించిన ననుటకును వీలుకనఁబడదు. కావున నాయా మండలమందలి కవులచే తమ కావ్యములందు ప్రయోగింపబడినవై, యందరకు సులభముగా నర్థము కానివగుటచే, నిట్టి శబ్దములు— అప్పకవి చెప్పినట్లు "ఆంధ్రమై నానా దేశములందు నిలిచి తత్తద్దేశోక్తులంట బలికినవేయైనను" నవి వారి కావ్యముల నుండియే సంగ్రహింపఁబడిన వగుటచేతఁ తొల్లింటి కవుల వాక్యములలోనివి యగుటయుఁగూడ తటస్థించియుండును. ఇట్టివి అన్యదేశ్యములని పేర్కొనఁబడినను వాస్తవముగా నవి మాండలికములే. కావుననే వీనికి నితర దక్షిణదేశభాషలలో సజాతీయములగు రూపములు సులభముగాఁ గనఁబడుచునే యున్నవి.

కేతన పెద్దనలు అచ్చతెనుఁగు దేశ్యము, అని ప్రత్యేక విభాగములఁజేసి చెప్పగాఁ అప్పకవి 'దేశ్యము'— అను దానినే శుద్ధాంధ్రదేశ్యము, అన్యదేశజాంధ్రము అని రెండు భాగములుగాఁ జేసి చెప్పుటయేగాక "అచ్చ దెనుఁగను" దానికి వేరొక యర్థమును గూడ గల్పించినాఁడు.

"నెంకొను సంస్కృత తత్సమ
ములు దొరలక తజ్జ దేశ్యములు మాటను సం
ధిలి కేవలాంధ్రములు నా
నలరు కృతుల నచ్చ తెనుఁగులంద్రు తెలుగునన్."

దీనినిబట్టి తద్భవములు శుద్ధాంధ్ర దేశ్యములు (అనగా కేతన పెద్దనలు చెప్పిన అచ్చ తెనుఁగులు) అన్య దేశ్యజాంధ్రములు (అనగా కేతనాదులు చెప్పిన దేశ్యములు), ఇవన్నియు గలిసి, అప్పకవి మతములో నచ్చ తెనుఁగులయినవని తెలియుచున్నది. ఇంతమాత్రమే కాదు. ఈతఁడింకను మరి రెండు రకముల తెలుఁగులను గూడ నీ యచ్చ తెనుగులలోఁ జేర్పఁదలఁచినాఁడు. అవి తెలుఁగు మఱుంగులు ప్రాదెనుగులు ననునవి.

"తెలుఁగు మఱుంగులు ప్రాఁదెను
గులు తద్భవదేశ్యములును గూర్చి మృదుపదం
బులుగాఁగ నచ్చ తెలుఁగులు
మెలకువతోఁ జెప్పఁదగు శమీప్రాంత గృహా."

తొల్లింటి కవుల వాక్యములు ప్రాదెనుఁగులు. తెనుఁగునఁ గావ్యరచన చేయదలఁచినవాఁడు తొల్లింటి కవులు

ప్రయోగించిన శబ్దములను మాండలికములైనను గ్రహించి తాను ప్రయోగించుకొనుననుటలో నాశ్చర్యములేదు. కాని భాషలో విశేష పదములుగా నేర్పడుట తటస్థించినదని మనము గుర్తింపవలసి యున్నది. వీనికి ప్రత్యేకముగా లక్షణము చెప్పక తెనుఁగు మఱుగు లనునవి—ఇట్టివి అని మాత్ర ముదాహరించి యూరకున్నాఁ డప్పకవి—

"అబ్ధిమేఖలకుదయించినట్టి సీతఁ
జేకొనియె రాఘవుండని చెప్పుచోట
కడలిమొల నూలిచేడియ గనిన పఱుచుఁ
దెచ్చుకొనె రాముఁడనఁగను దెనుఁగు మఱుగు."

అనఁగా సంస్కృత సమాసముల యర్థమును దెలుపుటకుఁగా, దేశ్యపదములతోఁ జేయఁబడిన దీర్ఘసమాస పదములీ తెలుఁగు మఱుగులని తేలుచున్నది. సహజముగఁ దెలుఁగులో నిట్టి దీర్ఘసమాసము లుండవు. సంస్కృత దీర్ఘ సమాసములను తత్సమ శబ్దములుగాఁ దెచ్చికొని తెలుఁగులోఁ బ్రయోగించుటకు వెనుకాడిన తరువాత కవులు కొందరా దీర్ఘసమాసముల యర్థమును దెనుఁగుపదములతో మాటి డొంకతిరుగుడు తెనుఁగు సమాసములుగాఁ జేసి ప్రయోగించుచు నట్టివానిని అచ్చ తెనుఁగు సమాసములని చెప్ప మొదలిడిరి. ఈ రీతి రచన అప్పకవికి చిరపూర్వమే ప్రారంభమైనది. కన్నడాంధ్రములయం దిదే మొట్టమొదట "జాణుడి" "జాణ తెనుఁగు" అను పేర వెలసినది. సంస్కృత సమాసముల యర్థము సులభమైన తెలుఁగు

పదములలోఁగొంత జాణతనము వ్యక్తమగునట్లుగా మఱుగు వెట్టియు చెప్పఁబడినదగుటచేత నట్టిది జాను తెనుఁగయినది. సంస్కృతపద ఘటిత దీర్ఘ సమాసములకంటె మృదువులైన తెనుఁగు పదములతోఁ దదర్థబోధకములగు సమాసములు రచింపఁ బడినచో, నట్టి జాను తెనుఁగు రచన సర్వజన సామాన్యమును ప్రసన్నతగలదియుఁగూడ నగును గదా, ఈ విషయమే పాల్కురికి సోమనాథుఁడు

"ఆరూఢ గద్యపద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠ రచన
మానుగా సర్వమాన్యంబుగామి
జాను దెనుఁగు విశేషము ప్రసన్నతకు."

అని చెప్పి అట్టి జాను తెనుఁగెట్టిదో, వృషాధిపశతక మందలి జాను దెనుఁగు పద్యమున తాను స్వయముగా రచించి చూపినాఁడు. అప్పకవి రచనలో అచ్చ తెనుంగని పేర్వడసిన యా తెలుఁగు మఱుంగులకును, సోమనాథుని వృషాధిప శతక మందలి యుదాహరణములోని "జాను తెనుఁగునకు"ను నేమియు భేద మగపడదు. రెండు నొక్కటియే. ఆనాఁటి జానుదెనుఁగే కాలక్రమమున నప్ప కవినాటికి తెనుఁగు మఱుంగై యచ్చ తెనుఁగు పేర్వడసి అచ్చ తెనుఁగు కార్యరూపమును దాల్చినది. ఇది తొలుత దీర్ఘ సమాసయుక్తమై తత్సమ బహుళంబగు భాష నరికట్టుటకుఁగానే దేశమున బయలుదేరినదే యైనను అప్పకవి కాలమునుండియు నీ యచ్చ తెనుఁగనునది "అచ్చతెనుఁగు

కావ్యము"లలో వెట్టితలలు వేయుటకు మొదలుపెట్టి, అతి దీర్ఘములగు డొంక తిరుగుడు సమాసములతో నిండిపోయి, యా సంస్కృత భూయిష్ఠ రచనకంటెను మఱుగై దుర్బోధంబుగాఁజొచ్చినది. సోమనాథుని రచనలోని "బలుపొడతోలు సీరయును" (వ్యాఘ్రచర్మాంబర మనుటకు) అను పద్యములోని జానుదెనుఁగునకును తరువాత నప్పకవి "తెనుఁగు మఱుఁగు"న కుదాహరణముగా నిచ్చిన "కడలి మొలనూలి చేడియ గనిన పడుచు" (అబ్ధిమేఖల కుదయించినట్టి సీత అనుటకు) అనుదానికిని భేద మే మాత్రమును లేదు గదా. తద్భవరూపములను గూడఁ జేర్చుకొనిన గాని యీ విధమగు రచన సాధ్యముగాదని కాఁబోలు వానిని గూడఁ జేర్చుకొని దీనినంతను "అచ్చ తెనుఁగని" వీరు పేరు పెట్టినారు. ఈ విధముగా కేతన పెద్దనల నాటి "అచ్చ తెనుఁగు" అప్పకవినాటికి మారు రూపుజెంది, క్రొత్త యర్థమును గూడ సంపాదించినది.

కేతన పెద్దనల అచ్చ తెనుఁగు దేశ్య శబ్దములును, అప్పకవి చెప్పిన శుద్ధాంధ్రాన్యదేశ జాంధ్రములును గూడ సహజములగు నాంధ్రదేశ్యములే యనుటకు సందేహము లేదు. కావుననే వీని కితర దక్షిణదేశ భాషలలో సజాతీయ రూపములు గానవచ్చుచున్నవి. ఈ లాక్షణికుల అన్యదేశ్యములలో సజాతీయములేగాక యితర దక్షిణదేశ భాషారూపములు గూడ జేరియుండ

వచ్చును. ఈ క్రింది యాంధ్ర దేశ్యములకు సజాతీయ శబ్దము లను సులభముగా గనిపట్టవచ్చును.

ఎఱుకువ:— "ఎఱుక" రూపాంతరము. క, అఱిక, అఱికె, అఱివు, అఱిత, అఱియమె; త, మ, అఱికై, అఱివు, (కువ.cf. మెలకువ, తేకువ, వేకువ, మక్కువ మొ).

నెత్తమ్మి:— నెఱ + తమ్మి; త, నిఱై; క, నెఱె(=full).

ఎరగలి:— కార్చిచ్చు, ఎరియు = మండు, కాలు, క, ఉరి = to burn, biaze. తుళు-ఎరి, త, మ,ఎరి=flame, blaze

ఎసకంబు:— క,ఎసె(=to shine, to be brilliant) ఎసక (=splendour, beauty).

నొసలు:— క,నొసల్(=forehead), త, మ, నుదల్; తు, నెసిల్ cf. తె, నుదురు.

ఇంతి:— (ఇల్ + తి) ఇల్-త, మ, క, ఇల్ = being,place; క, అల్లి, ఇల్లి=in that place, in this place.

తేఁటి:— (తేన్ + ఈ) తేనెటీఁగ-తేన్ + ఈ-తేన్టీ-తేఁటీ, తేఁటి, అయినది. "ఈగ" అనునది ఈ + గళ్=ఈగలు అను బహువచనరూపమునుండి కత్తిరింపఁబడి యేర్పడిన యేకవచన శబ్దము. త,తేన్,క, తేన్, జేను (=honey)

వెక్కసము:— క, బెక్కస = astonishment, amazement-surprise. బెక్కసంపడు.

నెమ్మి:—క, నమ్మగె, నమ్మిగె; నమ్ము (= to confide trust, rely upon) నెమ్ముగె: నెమ్మి + నమ్మి, నమ్మికె, (cf. నెమలి-నవిల్)

మక్కువ, మచ్చిక:—క, మచ్చు = devotion, to like. cf. మరుగు-మరుల్.

చెచ్చెర:—క, చెచ్చెర, చచ్చర (= haste, with haste, care.)

పొచ్చెము:—క, పుసి = to become or prove false, to lie త, పొయ్, పొయి = a falsehood. క, పుసె = a falsehood, a lie, uselessness.

కడిమి:—క, కడిమె (=That which is firm, strong). కడు (= firmness, hardness.) క, కటి.

ఏడ్తెఱ:—ఏడు (Time, year) తెఱ (తెఱవు) = opening, clearing, course. కాలముయొక్క తెఱపి, అభ్యుదయము.

లగ్గు:—అల్-ధాతువు, క, అల్ = to be fit, proper, to be desirable, desired. అల్ + అగు = అలగు-అల్గు-లగ్గు = what is desirable = శుభము.

వెన్ను:—క, బెన్, బెన్ను, బెమ్; త, పెన్ = The back. బెన్ననె = at the back.

వీనులు:—విను-ధాతువు. వీను-నామవాచకము. ఇతర ద్రావిడ భాషలలో నీ ధాతువగపడదు.

ఎక్కిలి:—cf. క, ఎక్కటి = greatness, wonder.

తివురుట:— తివురు = తిమిరు, తివిర్ = to rub, to annoy, to rub on. "తివిరి యసుమున తైలంబు తీయవచ్చు" తివిరి = గట్టిగా రాచి-నూరి by rubbing hard. దీని నుండి, తివురు = ప్రయత్నించు అను నర్థము వచ్చినది. తివురు ధాతువున కిది లాక్షణికార్థముగాని, తొలి యర్థము కాదు.

ఉక్కు:— క, ఉక్కు = steel ఉకుఁ, త, మ, ఉరుక్కు, cf. ఉచుఁ = to draw or attract towards oneself.

మేటి:— క, మేటి = loftness, greatness, superiority = a big man, chief; త, మేట్టిమై, మేణ్ = what is aloft, upwards. మేడు = height, rising ground.

బాగు:— క, బాగు = bending; a bend, curve. తనకు బాగున్నది-తన పైపునకు వంగినది. "బాగు" కన్నడము నుండి తెనుఁగున సంక్రమించిన శబ్దముగా గ్రహింపవలసి యుండును.

జోఁటి, జోఁటి:— పోడిమికలదు. క, పొణిమ= to couple, unite, to string together. పోడిమి=proportior fitness.

వేనలి:— త, వేనలి.

పొలపంబు:— క, పొళె=shīne. పొళపు=Radiancelustre, brightness.

విన్ను:— త.మిణ్=sky. క, వెళ్.

మన్ను:— క, త, మణ్=earth, clay, మణ్, మణ్ణు.

నెల్లి:— నెల్లికూర త, క, నెల్లి =myrobalan, ధాత్రి.

ఉల్లము:— త, ఉళ్ళం; క, త, ఉళ్=the inner side. what is inside, మనస్సు, ఉళ్ళంజిసు=to frighten the mind.

కొఱలుట:— తు, కొరలు=to blaze or shine. cf. తె, కొఱవి, క, కొళ్ళి=a firebrand.

వీఁక:— వీఁగు, క, బీగు; త,వీంగు, (త,మ,వీఱు-వీకున్) to be great or grand. puffed up. cf తె, "విఱ్ఱ వీగు" (Inflated, proud.)

కాఱియ:— కాఱులు, క, కాఱ్=wildness, ferocity, wickedness, a bad man, an enemy. కాఱాగు=to become trcublesome, hostile. కాఱ్మాతు =to utter bad language.

గ్రద్దలు :— త: కటు = a kite.

వేఁట :— త. వేట్టమ్; క. బేటె = hunting. బేట్టె; తుళు, బోట్టె.

కౌను :— పదాదియందలి ఔకారము ద్రావిడభాషా సంప్రదాయ సిద్ధము కాదు. తద్భవములయందు కొన్నింట గనఁబడ వచ్చునుగాని దేశ్యములందు సహజము కాదు. కావున నిది "కవును" శబ్దమునకు రూపాంతరమై యుండును. ఇది కవి, కవు, కవియు (to cover, to come upon, over-spread) అను ధాతువునుండి యేర్పడినదై యుండును. "కవుంగలి" దీనికి సంబంధించినదే యైయుండును.

పాలిండులు :— సమస్త పదము-పాల్ + ఇల్లు = పాలకు స్థానములు. పాల్. త. క. పాల్, పాలు; త. క, ఇల్.

ఒగి : — క. ఉగి = to pull, to draw towards. ఒగె = to come forth, to arise, appear, to be born.

మొగి :—(cf. ఒక్క- మొగిని) క. మొగసు = to exert one's self, to act zealously. త. ముయల్ = to apply one's self to a thing, to make effort.

తెమ్మెర :—ఇది దక్షిణదేశ భాషలలో నతి ప్రాచీన శబ్దము. ప్రాచీన భాషలోనిది తెమ్ + ఎరల్ = దక్షిణపు గాలి, అను నర్థమున ఏర్పడినది. "తెమ్మెరల్" అను శబ్దము తెనుగుదేశపు వాడుకలో "తెమ్మెరలు"

అను రూపమును బొందగా, ఈ భాషలో "లు" అనునది బహువచన ప్రత్యయముగా రూఢి చెందిన పిదప "తెమ్మెరలు" అనుదానిలోని తుది "లు" బహువచన ప్రత్యయమే యైయుండునను భ్రమచే నా 'లు'ను విడదీసి "తెమ్మెర" అను నేకవచన శబ్దమును గల్పించినారు. ఈ విధముగా "తెమ్మెర" శబ్ద మీ భాషలో నేర్పడినది. క. తెం- తెంక- తెంబు = The south; త, మ, తెన్, తెఱ్కు, తెక్కు; క. తెంగాలి = South wind. క, ఎరల్, ఎరళ్, ఎలర్ = wind, air.

లేమావి :—ఎల + మావి, త. క. ఎళ్, ఎళ (=tenderness, youth, tender). త. క. మ. మాం, మావు=mango tree.

తెలిగన్ను :—తెలి + కన్ను. క. తెళ్, తెలుపు = fine, fineness, thinnes, delicate, transparent. త. క. కణ్, కణ్ణు = eye.

క్రొన్నన :—క్రొత్త + నన. క. కొర = profit, use, good, advantage. తె. క్రొ, క్రొం; క. ననె; త. ననై = a flower-bud, a sprout, shoot

వలరాజు :— వల + రాజు. ఇందు రెండవ శబ్దము దేశ్యము కాదు. వల - (వలపు) అనునది "ఓల్ - ఒలు" ధాతువునకు సంబంధించినది. త. క. 'ఒల్' వల్ = to be pleased, to desire, to love. ఒలవు = pleasure.

రేపేఁడు :— రే + పేఁడు. ఇదియు సమస్తపదమే. రాత్రికి పేఁడు. రే-రేయి అనునవి దేశ్య శబ్దములేయైనను, పదాదిని రేఫముండుట ద్రావిడ సంప్రదాయసిద్ధము కాదు. తెనుగుననె ఇరులు = చీకటి అను శబ్దము కలదు. ఇది బహువచన శబ్దము కాదు. 'ఎరల్' వలె లకారమంతమందుఁగలది. cf. క. ఇరుళు, ఇరుళ్. త. ఇఱా = పేఁడు. దీని ప్రాచీనరూపము "తే" అనియే ప్రాచీన తెలుఁగు శాసనములలోఁ గనబడుచున్నది. (cf. పాలపేగారికి) బహు, పేలు, కాలక్రమమున "డు" ప్రత్యయము చేర్పఁబడినది. పదాదియందు "ఱ" కార ముండుట ద్రావిడ సంప్రదాయము కాదు. రాజశబ్ద భవమే యనుటకు నిది శకటరేఫ యుక్తము.

వాలుగంటి :—వాలు + కన్ను; వాలు-ఇందలి వకారము కూడ ఓకారమునుండి యేర్పడినదే. క. ఓలు = to bend, slope, slant- ఓరె - ఒరఁగు = leaning, slant, going sideways. cf. ఓర-వార.

అలరులపిండు :—అలర్ = to bloom, blossom, a flower.

తెక్కలికాఁడు :— తెక్కల్, cf, క. తెగె = to take away, to steal.

క్రొమ్మించు : — క్రొ - కొర్ + మించు, మిన్ - మించు = to glitter, lightning.

కెమ్మోవి :— కెం + మోవి. క. కెం, చెం, చెన్ను = red. మోవి-మో (ముఖ?) + వాయ్, త. మ. వాయ్ = mouth. క. బాయ్ = mouth.

కెంజాయ :— కెం + చాయ-చాయ-ఛాయాశబ్ద భవము.

కమ్మతావి :— కం-కమ్మని- కంపు - సువాసన, దుర్వాసన. క. కమ్ము = fragrance. తావి.

కడలి :— త. క. కడల్-సముద్రము, కడ = అల.

వెడవిల్తుడు :— వెడ, విల్. త. క. విల్, బిల్ = bow.

నలువ :— నలు + వ = నాలుగు-వాయి = నలువ. నలు- క. త. మ. నాల్ = four, క. నాల్కు. త. నాన్గు, తె. నాలుగు.

నాన :— సిగ్గు. త. క. మ. నాణ్, నాణ = bashfulness, shame, modesty.

ఎడకాడు :— తార్పుకాడు, దూత. ఎడ = సంధానము త. క. ఎణె- (ఎడె) = to unite, match, pair. cf. ఎనయు.

ఎలనాఁగ :— ఎల + నాఁగ; ఎల - లే - లేఁత. నాఁగ- నాణ్గ = నాణ్చి-నాచ్చి = సిగ్గుగలది, స్త్రీ.

చెలువ :— చెలువము, చెలువు, చెల్వు = అందము. క. చెలు, చెలువు, చెలువికె, చెలువత = beauty. క. చెలువి, చెలువతి = handsome woman. ధాతువు — చెంగి

కెం, చెన్ను, రూపాం, "చెల్" - చెలువు – చెన్ను.

చిగురుబోడి :— క.చిగుర్ = పల్లవోత్పత్తౌ = to sprout, to shoot. cf. త. కిళై.

తెలవ :— క. తెలవు = the price paid for a wife. తెల = tax (cf. దండు తెలెసిద్ధాయంబు etc. అహాదనకర శాసనము.)

తలిరుబోఁడి–మెఱుఁగుబోఁడి :— తలిరు, తలిర్చు = చిగుర్చు. క. త, తళిర్ = to sprout క. త. మెఱె = to shine. మెఱయు.

పదరు :— త్వరపడు, ఆక్షేపించు, త. క. పదఱు (తె.వదఱు) = to be over-hasty, to talk nonsense.

పరి :— పర్యాయము, సేన. క. పరి = to flow, advance a course, way, manner, flowing, stream. రీతి, భంగి.

గమి :— సమూహము. cf. క్రమ్ము, కవియు, "మేఘంబులెల్ల యెడలం గ్రమ్మి"

పసి :—సారము, చాతుర్యము. పసి, పసిమి = greenness, freshness, కాంతి, శక్తి. క. పొస = newness, freshness, beauty.

పొద్దు :—ప్రొద్దు. త. మ. పొఱుదు. క. పొత్తు = the sun. సూర్యుడు.

పోటు:— యుద్ధము, పొడు, పొడుచు, పోటు, త, క, పుడై ,పొడె =to strike, beat, to smite.

ముట్టు:— తాకు, త,మ, ముట్టు =to dash against, strike, ముట్టు =to touch, come in contact with.

తనివి:— తనివు, క, తణివు=Satisfaction. తణిపు =to satisfy, refresh, cf. తణి-cool.

చెంత:— cf. కట్టు, సమీపించు, క.త,కిట్టు =to be reacheb, to come to hand. to touch. మ, కిడె, కిణె = to approach, come near.

ఆలము:— ఉపేక్ష, cf. క, అలె = to annoy, disgrace, పరిభవము.

సోలము-చొక్కు:— క, జోలు, సోలు =hanging down, slackness, looseness. క, సోలు, = to fail, to fall off in respect of vigour,to lose onself.

పోరు:— యుద్ధము, త,క, పోర్ =battle, fight, quarrel.

కలను:— కల, కలసు, కలయు = to mix together etc.?

చెలి:— (cf. చెలిమి) త, కెళె, కెళది= a female companion or friend. కెళె, గెణె = friendship, union.

పొలతి:_ క, పొలతి = a low-caste woman. పొలది = a lewd, profligate woman. పొలె = The menstrual flux; impurity due to childbirth

మేను:_ త, మ, మెయ్, మేని; క, మెయ్, మెయి, మై = The body.

కేలు:_ క, కెయ్, చెయ్, కేలు-కయి శబ్దము నుండి యేర్పడిన బహువచన రూపమై యుండును. కయి_ఏకవచన రూపముండనేయున్నది.

తునక:_ క, తునుక, తుణుకు = a fragment, a bit, a piece, త, తుణి, తుణిక్కై, త, తుణి = to cut to pieces తుణి + కళ్ = తుణికలు_తునుకలు. తె. తునుగు.

ఇట్లు ప్రాచీన లాక్షణికులు పేర్కొనిన దేశ్యాన్యదేశ్య శబ్దములలో పెక్కింటి కితర దక్షిణ దేశభాషలలో సజాతీయ రూపములగపడచునే యున్నవి. వీనిఁబట్టి వీనిమూలరూపములను, ధాతువులను ,వ్యుత్పత్తులను నిరూపించుట దుర్ఘటము కాదు. ఇట్లే యీ భాషలోని యితర దేశ్యశబ్దములను ధాతువులను ఇతర దక్షిణ దేశ భాషారూపములతోఁ బోల్చి వాని మూలస్వరూపమును, పరిణామ క్రమమును నిర్ణయింపవలసినదేగాని, యిప్పటి తెనుఁగు భాషలో దేశ్యధాతువులని చెప్పబడినవానిని యథాస్థితములుగానే సంస్కృత ధాతువులతోనో, యేదోవిధమున ముడిపెట్టి యత్నించినంత మాత్రమున నాంధ్రదేశ్యముయొక్క యథార్థ స్వరూపమును గనుగొన్నవారమనికాని, ఆదియంతయు సంస్కృతభవమని నిరూపింపఁ

గలిగినవారమనిగాని తలంచుట కవకాశములేదు. అటు ప్రాకృత వైయాకరణులు, ఇటు దక్షిణదేశభాషా వైయాకరణులునుగూడ. చాలవరకుఁబరిశోధించియే సంస్కృత వికారమని చెప్పుటకు వీలు లేని శబ్దజాలమును "దేశి"యని, "దేశ్య"మని వేరుపరచియున్నారు. అచ్చటి "దేశి"లో కొంత శబ్దజాలము మాత్రమే చేరినది. కాని యిచ్చటి దేశ్యములో శబ్దజాలమేగాక అచ్చమగు తెలుఁగు భాష యంతయు (భాషా రూపములు-వ్యాకరణ రూపములుగూడ) చేరి నది. కావున నీ దేశ్యమునకు - నీయచ్చ తెనుఁగు భాషకు - నే ప్రాకృతముతో సంబంధముగలదని పరిశోధనలు సలుపవలెననియు, దేనితోడను సంబంధము చూపుటకు సాధ్యము కాదని తోచినపుడు దీనికి సంబంధించిన ప్రాకృతమేదో అంతరించియుండును గావున నది బయలుపడువరకు, ప్రాకృతములను గూర్చి పరిశోధనలు జరుగుచుండవలెనేగాని, ఆంధ్రభాషా స్వరూప లక్షణములనుగూర్చి మాత్రము నిర్ణయింప వీలులేదనియు, ద్రావిడభాషల తత్వమును గూర్చియే నిర్ధారణ చేయలేమనియు చెప్పుట, స్వీయవాదాభినివేశ మును సూచించునేమోగాని, సత్యాన్వేషణ పరత్వమును సూచింపదు. వైయాకరణులే సంస్కృతభవము ప్రాకృతభవము అని శబ్దము లను విడదీసిచెప్పి, దేశ్యమును వేరుపరచి చెప్పినపుడు, ఈ దేశ్య మునకు సన్నిహితములగు దేశీయభాషలలోని రూపములలోఁ గల సంబంధమెట్టిదో పరిశోధించి ఆయా భాషల పూర్వచరిత్ర నన్వే షించి - ఆయా రూపముల పరిణామ క్రమమును దెలిసి

కొన యత్నింపవలయునేగాని, భాషా లక్షణములలోను, వ్యాకరణ రూపముల విషయమునను సంబంధమే లేదని నిర్ణయింపఁబడిన ప్రాచీన ప్రాకృతములలో దేనితోనో ముడిపెట్టుటకై చేయు దీర్ఘ విచారణమువలన ప్రయోజనమేమి! ఎట్టి ప్రయోజనము లేదని తెలియవచ్చుటచేతనే వారాధుని కార్యభాషలలోని యనార్య ద్రావిడ భాషా లక్షణముల నూతగాఁగొని యందనార్యములని చెప్పఁబడు చున్న లక్షణములు వానికి సహజములేయైనట్లును, వానిలోవలెనే ద్రావిడ భాషలలోఁగూడ నవి యేర్పడినట్లును నిర్ణయించుచు,నట్లవి యేర్పడుటకు వీలుగా, నీ ద్రావిడ భాషలనునవి ఆధునికార్యభాషల వలెనే. క్రీ.శ. 7,8 శతాబ్దములనాడు బయలుదేరినవేగాని, అంతకుఁ బూర్వము లేనేలేవని చెప్పి—వాని యస్తిత్వమును గూర్చియే శం కింపవలసిన వారైనారు. "అహో మూలచ్ఛేదీ తవ పాండిత్య ప్రకర్షః" అనునట్లయినది.

కావున స్టెన్‌కోనో పండితుఁడు చెప్పినరీతిగా ద్రావిడభాషల కితరభాషా కుటుంబములతోఁగల సంబంధమును గూర్చిన విచారణ మును వదలిపెట్టి, వానినొక ప్రత్యేక కుటుంబముగానే గ్రహించి తత్పరిణామక్రమాన్వేషణమునకుఁ గడంగుటయె యుక్తము.

పైని జూపిన విశేష లక్షణములనుబట్టి దక్షిణ హిందూ దేశభాష లొక ప్రత్యేక కుటుంబమునకు జెందిన భాషలని నిశ్చ యింపవలసియున్నది.

8)

# దక్షిణదేశ భాషా సారస్వత లక్షణములు

ఒక్క కుటుంబములోని వేయైన-యొక మూలభాష నుండియే వచ్చినవని చెప్పఁబడుచుండిన యీ దక్షిణ దేశభాష లే కాలమున ప్రత్యేక భాషలుగా నేర్పడినవో చెప్పుట కవకాశములేదుగాని క్రీస్తు శకమునకు చిరపూర్వమే యివి యొక దానినుండి యొకటి విడివడి, ప్రస్తుతమవి వ్యాప్తి గాంచియున్న దేశభాగములందు నెలకొని యుండినవని మాత్రము చెప్పవచ్చును. ఈ దేశమున ప్రస్తుతము ప్రాధాన్యము వహించియున్న తమిళ, కన్నడ, మళయాళ, తెలుఁగు భాషలలో-తెలుఁగు తక్కినవానికంటె కొంత పూర్వమే మూలభాష నుండివిడివడి యుండుననుటకునుకొన్ని నిదర్శనములగపడుచున్నవి. (1) ఉత్తమపురుష సర్వనామ ప్రథమేతర విభక్త్యంగము-తక్కిన భాషలలో హ్రస్వాచ్కమైయుండ తెలుఁగుననొక్క ద్వితీయయందు నక్క తక్కినవానిలో ప్రథమలోవలె దీర్ఘచ్చుతోఁగూడియుండుట, (నా-నే-నన్ను-నాచేతను; త, ఎ౯-ఎన్నాల్-ఎనక్కు, క, నన్న-ననగె) (2) ప్రథమపురుషలో స్త్రీ వాచకరూపము తమిళ కన్నడము లలో వలె, "అవళ్" అనునది లేకుండుట; అమహత్ప్రత్యయమగు ది-అది అనునదే స్త్రీవాచక శబ్దములకు సూచకమగుట మొదలగు నవి. తమిళ కన్నడములకంటె హెచ్చు మార్పులకులోనై, ఇందలి రూపములు సులభముగ సజాతీయ శబ్దములతోఁ బోల్చుకొనుటకు వీలు లేనంతగా మిగుల వికారముల బొందుటకుగూడ నిదియే కార

ణము గావచ్చును. స్వరసామ్యము, వర్ణసమీకరణము, వర్ణప్లు మొదలగునవి తక్కిన భాషలలోనివానికంటె నీ భాషా రూపములపై విశేషముగా పనిచేసినవి. తమిళ కన్నడములు — తెలుగు తమిళముల కంటె కొంత సన్నిహితములుగాఁ గన్పట్టకపోవు. తమిళ మళయాళము లత్యంత సన్నిహితములనియే చెప్పవచ్చును. అట్లే తుళు కన్నడములకును దగ్గర సంబంధము కలదు.

ఇక నీ భాషలకు సంస్కృత భాషతోఁ గలిగిన సంబంధ స్వభావమును బట్టి కూడ నీ భాషల స్వరూపము మారియున్నది. తెలుఁగు కన్నడములపైవలె తమిళ మళయాలములపై సంస్కృత భాషా ప్రభావమంత ప్రాచీనమును బలవత్తరమునుగా గనబడదు. క్రీస్తునకు పూర్వమే తమిళదేశమున వైదిక మతవ్యాప్తికై అగస్త్యాదులవంటి యార్య మహర్షులు, బౌద్ధమత వ్యాప్తికై బౌద్ధ సన్యాసులు వచ్చి చేరి తత్తన్మత్తవ్యాప్తి గావించిన సందర్భముననా భాషకు సంస్కృత ప్రాకృత భాషల సంపర్కము బాగుగనే గలిగియుండవచ్చును. కాని వింధ్య దక్షిణభాగము నందలి తెలుఁగు కన్నడదేశము వలె నాదేశ మార్యజనాక్రాంతమే యగుటగాని యుత్తర దేశీయులగు రాజుల పరిపాలన ప్రాభవములకు లోనగుటగాని తటస్థింపలేదు. కావుననే క్రీస్తుశకారంభమునాటికే యాభాషలో దేశీయ ప్రభువుల యాదరణమున దేశి కవిత పెంపొందు

టయు, నవిరకాలముననే దేశీయ చ్ఛందోబద్ధములగు రచనలు_విజయ గీతములు_ప్రేమ గీతములు మొదలగునవి ప్రోవు చేయఁబడి గ్రంథరూపమును దాల్చుటయుఁగూడ దటస్థించినది. ఇంతే గాక తమిళ భాషా లక్షణమును అందలి ఛందస్సాహిత్య లక్షణమును గూర్చిన యుద్గ్రంథ మొకటి తొల్కాప్పియ మనునది యానాటికే యా భాషలో బయలుదేరుటచే, నీ భాషా సాహిత్యములంతకు పూర్వము చిరకాలము నుండి దేశమున స్థిరపడి యుండెననుటకు సందేహింపవలసిన పనిలేదు. తొల్కాప్పియమను లక్షణగ్రంథము సంస్కృత భాషా వ్యాకరణ సంప్రదాయముల ననుసరించి రచింపఁబడినదే యైనను ద్రావిడ భాషాసాహిత్యముల విశిష్ట లక్షణములను చక్కగా వ్యక్తీకరించునదై యున్నది.

అందు ఎళుత్తు,_శొల్, పొరుళ్అను పేరఁబరగు మూఁడధికారములు గలవు. మొదటి దానిలో సంజ్ఞా వర్ణ సంధి ప్రకరణములు గలవు. రెండవది పదాధికారము. పద లక్షణము_విభాగము, నామవిభక్తి_క్రియా విభక్తి అగమములు_నిపాతలు మొదలగు వానిని గూర్చి తెలుపును.

ఈ రెండును భాషా లక్షణమునకు సంబంధించినవి. ఇక మూడవది పొరుళధికారము కావ్యవస్తువును గూర్చినది. శృంగార వీరరసములు - బాహ్యాభ్యంతర వస్తువులు_నాయికా నాయకులు_ దేశ కాల పరిస్థితుల కనువైన వస్తు చిహ్న రూపములగు కవి సమయములు, ఛందోలంకారములు, వీనిని గూర్చి వివ

రించునది పొరుళధికారము. దీనిని బట్టి ద్రావిడ భాషా వ్యాకరణములన్నిటిలోను నతిప్రాచీనమని చెప్పఁదగిన యీ తొల్కాప్పియమను తమిళ లక్షణ గ్రంథము భాషా వ్యాకరణ చ్ఛందోలంకారములనుగూర్చి తెలుపు గ్రంథమని తెలియుచున్నది. తమిళమున బయలుదేరిన యీ లక్షణ గ్రంథరచనా సంప్రదాయమే తరువాత తెలుఁగు లక్షణ గ్రంథములలోఁగూడఁ గానవచ్చుచుండు టయే విశేషము. వీనిని సరిపోల్చి చూచినచో వీనికి మూలములగు సమాన సంప్రదాయములను గనిపెట్టుటకవకాశము కలుగవచ్చును. భాషావిషయమున వలెనే ఛందస్సాహిత్య రీతుల విషయమునను సంస్కృత సంప్రదాయములు తెలుగు కన్నడములలోవలె తమిళ మునఁ బ్రవేశించినట్లులేదు. అక్షరగణబద్ధములగు సంస్కృతవృత్త ములుగాని, సంస్కృత కావ్యపద్ధతి నష్టాదశవర్ణనలు, గర్భబంధ కవిత్వరీతులు మొదలగునవందవలంబింపఁబడలేదు. ప్రాచీన కవిత్వ మంతయు మూఁడేసి నాలుగేసి దేశియ చ్ఛందోగణములు గల మూడేసి-నాలుగేసి పాదములతోఁగూడిన పద్యములు గలది. "కురళ్" గ్రంథము మూడేసి పాదముల పద్యములతోఁ గూడినదే. షట్పదులు, అష్టపదులు మొదలయినవానివలె మరి కొన్ని 6, , 10, 12 పాదములతోఁ గూడినవియుఁ గలవు. పురనా నూరు, అగనానూరు కావ్యములు— వీరగీతములు— ప్రేమ గీతములు ప్రధానముగాఁగలవి. "కురళ్" కావ్యము నీతిగీత ములతోఁగూడినది. తరువాత ఆళ్వారుల కాలములో భక్తి గీతములు ప్రబలినవి. క్రీ. శ. 7, 8 శతాబ్దుల కాలమున

పెరిందేవనార్ అను కవిచే భారతము దేశీయంబగు "వెంబా" పద్యములలో రచింపఁబడినది. క్రీ. శ. 10, 11 శతాబ్దుల కాలములోఁగాని "జీవక చింతామణి" వంటి కావ్యముల రచన వాడుకలోనికి రాలేదు.

సుమారు ఈ ప్రాంతముననే కన్నడమునను తెలుఁగునను కూడ కావ్యరచన ప్రారంభమైనది. కాని తమిళమునందలి రచనలకును తెలుఁగు కన్నడములందలి రచనలకును ముఖ్యభేదమొకటి కలదు. ఈభాషలలో కావ్యరచన ప్రారంభమగునప్పటికే సంస్కృత సాహిత్యానుకరణము ప్రబలిన సూచనలు కనఁబడుచున్నవి. క్రీ.శ. 7, 8 శతాబ్దములనాటికే సంస్కృత వృత్తములు-సంస్కృత సాహిత్యాలంకారిక రీతులు కన్నడ కవితయందు ప్రవేశించినవి. క్రీ. శ. 8-వ శతాబ్దినాటి శ్రావణ బెళగొళ శాసనములోనే "స్రగ్ధరా" వృత్తములో రచింపఁబడిన కన్నడ పద్యమగపడుచున్నది. 9-వ శతాబ్దిలో దండిభామహాదుల యాలంకారిక లక్షణము ననుసరించి రచింపఁబడి, రాష్ట్రకూట ప్రభువగు నృపతుంగుని మూలముగ ప్రచారములోనికిఁ దేఁబడిన "కవిరాజ మార్గ" పద్ధతియే కన్నడ శిష్ట కవితా పద్ధతియై వెలసినది. 10-వ శతాబ్దిలో నాగవర్మ రచించిన ఛందోంబుధిలో సంస్కృత వృత్తముల ప్రశంసయే ప్రాధాన్యమును వహించినది. కాని దేశీయ చ్ఛందముల కట్టి ప్రాధాన్యములేదు. వీని ననుసరించియే యీ శతాబ్దియందు పంపాదులు భారత కథను చంపు పద్ధతిని ప్రబంధములుగా

రచించినారు. వీరి జైనపురాణముల రచనయంతయు మార్గపద్ధతిని అనఁగా, సంస్కృత వృత్తములు, తత్సమ బహుళంబగు భాష ప్రాధాన్యము వహించిన గద్యపద్యాత్మకమగు చంపూ కావ్య పద్ధతి ననుసరించి రచింపఁబడినదే.

12-వ శతాబ్ది మొదలు బసవాదులు తమ మతమును పండిత లోకమునఁ బ్రబలిన జైన బ్రాహ్మణమతములకు పోటీగా జన సామాన్యమున వ్యాపింపఁజేయవలసినవారగుటచేత, వారికి సుబోధంబగు రచనారీతి నవలంబింపవలసినవారైనారు. కావుననే లింగాయతవాఙ్మయ మంతయు-వచనములు, రగడలు, షట్పదులు, సాంగత్యము మొదలగు-దేశీయ రచనా ఫక్కి ననుసరించినది. వచన రచన బసవనితోడనే ప్రారంభించినట్లున్నది. షట్ స్థలవచనము, కాలజ్ఞాన వచనము మొదలగునవి తద్రచనలేయని చెప్పుదురు. ద్వార సముద్రము రాజధానిగా నేలిన బళ్ళాలరాజుల కాలములో హరీశ్వర కవి శివగణద రగడయును, కెరెయ పద్మరస——"దీక్షాబోధె" యను రగడయును రాఘవాంక కవి సిద్ధరామపురాణ, హరిహర మహత్వములను షట్పదీ కావ్యములను రచించియున్నారు. షట్పదీకావ్యరచనకీ రాఘవాంక కవియే మొదటివాఁడు. ఈ షట్పదీ రగడలను క్రీ.శ. 10-వ శతాబ్దిలోనే నాగవర్మ తన ఛందోంబుధిలో కన్నడ దేశిచ్ఛందముల క్రిందచెప్పి వాని లక్షణమును దెలిపినాఁడుగాని, ఆరచనలెచ్చటను ఆకాలమున గానరాలేదు. నృపతుంగుని కాలమున వేయఁబడినట్టియు-పంపాదులనుగమించినట్టియుఁ కన్నడ కవిరాజమార్గమగు "మార్గకవితాఫక్కి"యా దేశ

మున దృఢత్వమును జెందుటచే నీ దేశి కవితామార్గములు మాసి పోయినవి. రైలుమార్గములు వచ్చిన వెనుక నాటు మార్గములు మాసిపోయి పూడిపోవుచుండును గదా.

ఇట్లు మార్గ కవిత కవిరాజమార్గమై కన్నడ దేశమున వెల సిన పిదప, నాదేశమున దేశి కవితామార్గము మాసిపోవుటచేతనే, చాళుక్యరాజాదులు పలువురీ యంధ్రవిషయమున తెలుఁగుభాషలో దేశి కవితను పుట్టించి పెంపొందించి తెలుఁగు రచనల నీ యంధ్ర విషయమున నిలువబెట్టినారు. తెలుఁగుదేశమున నన్నయకుఁ బూర్వము దేశీయ చ్ఛందోరీతులలో రచింపఁబడిన పద్యములు- తరువోజ, అక్కరలు, సీసములు, గీతములు, శాసనములలో నైనను కనఁబడుటకును, కన్నడ దేశ శాసనములలో నేడవశతాబ్ది నుండియు స్రగ్ధరాది సంస్కృతవృత్తములేగాని దేశీయవృత్త ములు గానరాకుండుటకు నదియే ముఖ్యకారణము. ఈ దేశీయ చ్ఛందోరీతులు కన్నడమునను వ్యవహారములోనే లేవనుటకు వీలు లేదు గదా. ఏమనఁగా ఛందోంబుధిలో నాగవర్మ వీనికి లక్షణము చెప్పియేయున్నాఁడు. అంతకుమున్నే కవిరాజ మార్గమున అప్పటికే ప్రాచీన కావ్యభేదములని పేర్కొనఁబడిన చత్తాణె, బెందడె అను వానిలో రెండవది కందముతోపాటు అక్కర, గీతికె, తివది మొద లగు దేశీయ రచనలతోఁ గూడినదిగాఁ జెప్పఁబడియే యున్నది. కావున దండిభామహాదుల ననుసరించి వేయఁబడిన కన్నడ మార్గ పద్ధతి రాజమార్గమగుటచేతనే దేశిపద్ధతి యంతరించినదని తలం పక తప్పదు. తెలుఁగులో నన్నిచోడునివలెనే పంపాదులు

దేశినికూడ స్మరించి కొంత దేశి సంప్రదాయమును మార్గ పద్ధతిలోఁ జేర్చినను, కేవల దేశి రచనాపద్ధతి మరుగువడియే పోయినది. లింగాయతము వీరశైవము ప్రబలిన వెనుక గాని మరల కన్నడాంధ్రములందీ యచ్చదేశి రచనలు బయలు పడుట తటస్థించినది కాదు. కన్నడ దేశమున బయలుదేరిన యీ వీరశైవము తెలుఁగు దేశమునగూడ వ్యాపించిన తోడనే పాల్కురికి సోమనాథుడిక్కడ దీనికి పట్టుగొమ్మ యయినాఁడు. కన్నడమందువలెనే తెలుఁగునను దేశీయ చ్ఛందోభేదమై ప్రచారములోనున్న రగడరచన నతఁడును కన్నడ కవులవలెనే చేపట్టి - బసవరగళె, సద్గురురగళె, చెన్నబసవస్తోత్రద రగళె, అనువానిని కన్నడ భాషలోనే రచించినాఁడు. కన్నడమునందలి వచనములను బోలిన గద్యలను, అక్షరాంక గద్య, నమస్కారగద్య, పంచప్రకారగద్య అనువానిని గూడ తెలుఁగున రచించినాఁడు. ఇంతేగాక కన్నడ దేశమునఁ బ్రచారములోఁ గానరాక తెలుఁగు దేశమున మాత్రమే నిలిచియున్న వనఁదగిన దేశీయచ్ఛందములోని ద్విపదోదాహరణ సీసరచనా రీతులను గూడ నతఁడు గ్రహించి, బసవపురాణ పండితారాధ్య చరిత్రలను ద్విపద కావ్యములను, చెన్నమల్లుసీసములను సీసపద్య రచనను తెలుఁగుభాషలోను, బసవోదాహరణమును తెలుఁగు సంస్కృతములోను రచించినాఁడు. ఈ ఉదాహరణ మనునది రగడభేదములగు కళికోత్కళికలతోడను, విభక్త్యంతములు, సార్వ విభక్తికములునగు శార్దూలచంపకాది వృత్తములతోడను గూర్పఁబడిన

కన్నడ బెదెండెవంటి కలగాపులగపు రచనయే యైనను దీనిని తెలుఁగులోనే గాక, సంస్కృత భాషలో గూడ సోమనాథుఁడు రచించుట మిగుల విచిత్రమైన విషయము. సంస్కృత పండితు లకు గూడఁ దన దేశిరచనా పాండిత్యమును చవిజూపఁదలఁచినా డేమో! దీనివలన జన సామాన్యమున మతోద్బోధము కలిగింప నెంచిన వీరశైవ మతము కారణముగా, కన్నడాంధ్ర దేశములలో నంతకుపూర్వము జైనబ్రాహ్మణ మత వాఙ్మయముల మార్గపద్ధతి మూలముగా రూపుమాసియున్న దేశి రచనారీతు లొక్కమారుగా మరల బయలువడినట్లు తెలియవచ్చుచున్నది. ఈ దేశి రచనా సంప్రదాయము తెలుఁగు దేశమునకు సహజమే యైనను, తొలుత మార్గపద్ధతికి కన్నడ దేశ సంప్రదాయమే మూలమైనట్లు, పిదప 12-వ శతాబ్దిని తెలుఁగున దేశికి పునరుద్బోధకారణము కన్నడదేశ మున బయలుదేరిన లింగాయతమత ప్రచారమే యైనదనక తీరదు.

కన్నడమున హరీశ్వర కవి "పంపాశతకమును" వ్రాసి నట్లే తెలుఁగున సోమనాథుడు "వృషాధిప శతకమును" వ్రాసి యీ భాషలో శతక కవిత్వమునకుగూడ దారితీసినవాడైనాఁడు.

13-వ శతాబ్దిలో జైనులుకూడ నీ దేశి రచనా ఫక్కినవ లంబింప మొదలుపెట్టినారు. కావుననే శిశుమాయణ కవి సాంగత్య ములు, కుముదేందురచిత షట్పదీరామాయణము బయలు దేరినవి. తెలుఁగులో రంగనాథ రామాయణము ద్విపద రచనయు నప్పుడే

బయలుదేరినది. తెలుఁగు ద్విపదరామాయణములో కొన్ని దేశీయములగు నాచారములు కథలు (సులోచనా వృత్తాంతము - లక్ష్మణదేవర నవ్వువంటివి) చేరినవేగాని కన్నడ జైన రామాయణమున కథాస్వరూపమే జైన సంప్రదాయానుసారము విశేషముగా మారిపోయినది.

పాల్కురికి సోమనాథుఁడు తెలుఁగులో రచించిన ద్విపద బసవపురాణము ననుసరించియే పదునాలవశతాబ్దిని (1369)కన్నడ బసవపురాణము షట్పదీ కావ్యముగా భీమ కవియను నారాధ్య బ్రాహ్మణునిచే రచింపఁబడినది. ఇదివరకు పెక్కువిధముల కన్నడ కవితారీతులు తెలుఁగు కవితకు మార్గదర్శకములైనను, ఈ విషయమున తెలుఁగు కవిత కన్నడ రచనకు మూలమేయైనది. విజయనగర రాజగు ప్రౌఢదేవరాయల కాలమున అనఁగా 15-వ శతాబ్ది ప్రారంభమున చామరస కవి అల్లమప్రభు చరితమును "ప్రభులింగలీల" లను పేర రచించి ప్రౌఢదేవరాయల గౌరవమునకుఁ బాత్రుఁడైనాడు. ఈ కన్నడ గ్రంథమే రాయల ప్రోత్సాహముచే తెలుఁగు తమిళములలో ననువదింపబడినది. వీరశైవుఁడగు నీచామరసుని బావమరిదియే కన్నడమున షట్పద భారతమును రచించిన కుమార వ్యాసకవి. గురు బసవకవి యను శైవగురువు గురుశిష్య సంవాద రూపమున శైవమత సూత్రములగు "సప్తకావ్య"ములను షట్పదీచ్ఛందమునను, "అవధూతగీతె" యను దానిని గీతములుగను రచించినాఁడు.

విరూపాక్ష రాయని కాలమున వీరశైవమత ప్రచారమును విరివిగాఁజేసిన సిద్ధలింగయతి "షట్స్థల జ్ఞానామృత"మను వచన గ్రంథమును రచించెను. కృష్ణరాయల కాలమున మల్లనార్యుఁడు జ్ఞాన సంబంధరు వ్రాసిన తమిళ కావ్యమును "భావ చింతారత్న" మను పేర కన్నడ షట్పదీ కావ్యముగ ననువదించినాఁడు. "వీర శైవామృత" మనునది యీ కవి రచించిన మరియొక షట్పదీ కావ్యము. ఇది శివుని 25 లీలలను వర్ణించుచూ లింగాయత మతాచారములను వ్యక్తీకరించునది. క్రీ. శ. 16-వ శతాబ్ద్యంతిమ భాగమున సర్వజ్ఞ మూర్తియని ప్రసిద్ధిగాంచిన పుష్పదత్తుఁడను కవి రచించిన "సర్వజ్ఞ పదము" లనునవి దేశీయంబగు త్రిపదీ చ్ఛందస్సులో రచింపఁబడియున్నవి.

ఇట్లు దేశీయంబగు పదకవిత్వములో తెనుఁగున ద్విపద రచన వాడుకలోనికివచ్చి నిలిచినట్లే కన్నడమున త్రిపద, షట్పద కవిత్వము ప్రాముఖ్యము వహించినది. తెనుఁగులో త్రిపద వాడుక లోనికే వచ్చినట్లగపడదు. షట్పద రచన కొంత లేకపోలేదుగాని కన్నడమునవలె షట్పదీకావ్యము లీ భాషలో లేవు. కన్నడ కవులే కారణముననో ద్విపద రచన నవలంబింపనేలేదు. గీతము విషయమునగూడ కన్నడ "గీతికె"కును తెలుగు "గీతము" నకును లక్షణమునఁ గొంత భేద మగపడుచున్నది. అక్కరల విషయమునగూడ కన్నడాంధ్రములలోని వానికిఁ గొంత సామ్యము కొంత భేదమును కలదు. ఇవి దేశీయ చ్ఛందము నకు సంబంధించినవే యైనను, ఈ రెండు భాషలలోనుగూడ

తొలి యుగముననే యంతరించినవి. యతిప్రాసల విషయమున గూడ కన్నడాంధ్రముల కించుక భేదమే కలదు. కన్నడ కవులు సంస్కృత సంప్రదాయమునఁ గలిగిన విచ్ఛేద రూప యతి నవలంబించి దేశీయంబగు నక్షర సామ్యారూపంబగు వడిని విడనాడియు, తెలుఁగు కవులవలెనే దేశీయంబగు ద్వితీయవర్ణ సామ్యరూప ప్రాసమును దప్పక పాటించిరి. ఈ ప్రావళ్లు సహజముగ దేశీయములే యనుటకు తమిళమునందవి మోనై, యదుగై అనురూపమునఁ గానవచ్చుటయే నిదర్శనము. ఇట్టి దేశీయ రచనారీతులు కొన్ని భాషలలో గొన్ని కొన్నియే నిలిచియుండునట్లు తెలియ వచ్చుచున్నది.

తొలుదొలుత లింగాయతమత మే దేశి రచనలకు ప్రోద్బలక మైనను, తరువాతి కాలమున వైష్ణవాది గ్రంథములును దేశీయ చ్ఛందమున రచింపఁబడుచు వచ్చినవి. అట్టి వానిలో కుమారవ్యాస విరచిత షట్పదీభారతము ముఖ్యమైనది. ఇతఁడు దీనిని శాంతి పర్వమువరకు మాత్రమే రచించియుండుటచే మిగిలిన భాగము క్రిష్ణరాయల కాలమున "క్రిష్ణరాయ భారత"మను పేర తిమ్మణ్ణ కవిచే పూర్తి చేయఁబడినది. కుమారవ్యాస భారతమువలె కుమార వర్మ విరచితమగు రామాయణముకూడ నిట్లే కన్నడ భాషలోనికి వచ్చినది. చాటు విట్టలనాథకవి భాగవత పురాణమును రచించెను. ఇట్లే కృష్ణరాయల కాలమున విజయనగరాస్థానమున వెలువడిన కన్నడ కావ్యములు దేశీయ చ్ఛందోబద్ధములగు షట్పదీరచనలై వెలయఁగా తెలుఁగున ప్రబంధ రచనలు చంపూపక్కినే వెలయు చుండుట విశేషము.

ఈ విజయనగర రాజుల కాలముననే కన్నడభాషలో ననేకము లగు భక్తిగీతములు వైష్ణవ దాసులచే రగడలుగా దేశీయచ్ఛందము ననే రచింపఁబడినవి. ఇవి సామాన్యముగా "దాసర పదగళు" అను పేరఁ బరగుచున్నవి. ఈ భక్తి గీతముల రచనలో ప్రముఖుడు, మిక్కిలి ప్రసిద్ధిగాంచినవాడు పురందర దాసు, పండరపుర నివాసి. ఈతని సమకాలికుఁడే యగు కనకదాసు "మోహనతరంగిణి"యను సాంగత్యమును, నలచరిత్ర, హరిభక్తిసారములను షట్పదీ కావ్యములను రచించినాఁడు. తరువాత నీ దాసర పదములను రచించిన వారిలో ప్రముఖులు-విట్టలదాస, వెంకటదాస, వరాహ తిమ్మప్ప దాస యనువారలు కలరు.

17-వ శతాబ్ది తుదిభాగమున లక్ష్మీశుఁడను వైష్ణవబ్రాహ్మణుఁడు జైమిని భారతమును షట్పదీ కావ్యముగా రచించినాడు. ఈ షట్పది రచన కన్నడ వాఙ్మయమునందలి యుత్తమ గ్రంథములలో నొకటిగాఁ బరిగణింపఁబడుచున్నది. పండరిపుర నివాసి యగు నాగరస అనునాతఁడు "భగవద్గీత"ను శ్లోకమున కొకషట్పది చొప్పున కన్నడములోని కనువదించినాఁడు.

అద్వైత మతమును పురస్కరించికొని రచించిన గ్రంథములలో రంగావధూత రచించిన "అనుభవామృత"మను షట్పదీకావ్యము కన్నడభాషలోని ముఖ్య వేదాంత గ్రంథముగా దలంపబడుచున్నది. ఇట్లీ షట్పద రచనలు, రగడలు తొలుత లింగాయత మతముతో బయలుదేరినను కాలక్రమమున నన్ని మతముల వారిచే నాదరింప

బడి చంపూ కావ్యముతో సమానమగు—అంతకంటె నెక్కువేయగు నాదరమును ఈ భాషలో గాంచినట్లు తెలియవచ్చుచున్నది. ఇవియే తరువాత కన్నడ వాఙ్మయమున నొక ముఖ్య శాఖయై ప్రాధాన్యమును బడసినవి.

ఇంక కన్నడాంధ్రములకు సమానమై రెండు భాషలయందును ఇటీవలికాలముననే పొడసూపి వ్యాప్తిగాంచిన దేశి రచనా భేదములలోనిది-యక్షగాన మొకటి.

ఇక్కడ ముఖ్యముగా గమనింపదగిన విషయమొకటి కలదు. ఈ పైని దెలుపఁబడిన దేశి రచనా రీతులన్నియు- సాంగత్యము, రగడ, షట్పది మొదలగునవన్నియు—తాళ లయానుగుణములగు మాత్రాగణబద్ధములగుటచేత, పాటలుగా పాడుకొనుట కనువగు రచనా ఫక్కి గలవై యున్నవి. అక్షరగణ బద్ధములగు సంస్కృత వృత్తము లిందుకు పనికిరావు. అవి పాండిత్య ప్రదర్శనమునకు చదువుకొనుటకు మాత్రమే పనికివచ్చును. కావుననే గద్యపద్యాది రచన సర్వజన సామాన్యము గాదని చెప్పి సోమనాథుఁడు జన సామాన్యమున మతవ్యాప్తి కనువగు ద్విపద రచనను సాగించినాడు. శిష్టులు సంస్కృతపండితులు జనసామాన్యము పాడుకొన వీలగు నీ దేశి రచనలను వదలివేసి, సంస్కృత భూయిష్ఠ రచనను సంస్కృత వృత్తములలో రచింప దొడంగుటచేతనే దేశిరచనాఫక్కి దేశమున నడుగంటినది. వీనిని గ్రంథరూపమున వ్రాసి నిలువబెట్టు వారు లేకపోయిరి. సామాన్య జన ముఖస్థములై యీ పాటలు తరతరములుగా వచ్చినన్ని వచ్చినవి. అంతరించినన్ని అంతరించినవి. వీనిని

గ్రంథస్థము చేసినవారు లేరు. మార్గపద్ధతిని వీనిని సమన్వయపరచి శిష్టకవితలో జేర్పగలిగిన కొన్ని రచనలకుమాత్రమే లాక్షణికులు లక్షణము చెప్పిరిగాని దేశీయవ్యవహారమునఁగల యనేక విధము లగు పాటలను కొంతకాలమువరకు వీరు స్మరింపనైనలేరు. కవి జనాశ్రయకారుఁడు కన్నడ ఛ్ఛందోంబుధిలోవలెనే, పెద్ద వృత్తాధి కారమును సంస్కృత వృత్తములనుగూర్చి చెప్పి జాత్యధికార ములో తెలుఁగు జాతులను గూర్చి యల్పముగనే తెలిపినాఁడు. అందు సీస, గీత, తరువోజా క్కరలను, ద్విపద, త్రిపద, చౌపద, షట్పదములను జెప్పినాడు. వీని కుదాహరణములు లేవు. లక్షణ పద్యమే లక్ష్యము. చౌపదివలెనే షట్పదికూడ నాలుగు పాదములు గల వృత్తముగనే చూపఁబడినది. రగడ భేదములను గూర్చి యీతఁ డెత్తుకొననే లేదు.

విన్నకోట పెద్దనయు మాత్రాగణ రచనలకుఁ బాత్రము లైన జాతులనుగూర్చి చెప్పుచు, సీస, గీత, అక్కర, తరువోజ భేదములను, షట్పది, చౌపది, త్రిపది, ద్విపద, మంజరులను మాత్రమే చెప్పినాఁడు. కాని కావ్యభేదములను జెప్పుటలో మాత్రము ముక్తకాదిచాటు ప్రబంధములను బేర్కొనుచు ఉదా హరణముతోపాటు రగడ నొక కావ్యభేదముగాఁ జెప్పినాఁడు.

"ధరచాటు కృతులలోనం
బరగు నుదాహరణమును ప్రబంధము తద్వి
స్తర లక్షణంబు బరువడి,
బరికింపగఁదగు నశేషభాషా కవులుౘ"

అని ఉదాహరణమును బేర్కొనినాడు. దీనికి తెలుఁగు దేశి రచనలలోఁ గొంత ప్రాధాన్యము కలదు.

చతురశ్ర త్ర్యశ్రాది
వితతయతి తాళములు గల దళముల నెల్లన్
గృతిగుచ్చాను ప్రాసం
బతులితరతి నిలుఁపదగు నుదాహరణలకున్"

అనుటచే నిందలి దళములు తాళగతులపై నేర్పడిన వనియు నవి ప్రధానముగాఁ బాడుకొనుట కుద్దేశింపబడిన వనియు సుస్పష్టమగుచున్నది. అయితే యీ యుదాహరణ మను చాటు ప్రబంధము కేవలము పాటయూగాక పద్యమునుగాక, కన్నడ బెదండె కావ్యమువలె వృత్తములతోను, జాతులతోను గూడ సంఘటింపఁబడిన రచనయైయున్నది. ఏల యనఁగా,

మును శుభగణవర్ణత బ
ర్వినమాలిని యొండె జండ వృత్తమయొండెం
ధనరింపవలయుఁ బ్రథమకు
ఘనకలికాష్టక తకర్థకలికాయుక్తిన్.

ఈ ప్రబంధానికి ముందుగా ప్రథమావిభక్త్యంత శబ్దములతో గూడిన యొక మాలినీ వృత్తమునో, చండవృత్తమునో-అనఁగా శార్దూలాదులనో రచింపవలెనట. ఆ పైని కళికలు-అర్థకళికలు రావలెను. ఇట్లే ప్రథమాది విభక్త్యాలంబన పద్యముల నిడగవలయును మరియు "కళిక యేతాళమునఁ బరిఘటితయయ్యె నుత్కళికయు దానన

యునుపవలయు" అని యీ కళికోత్కళికలు తాళగతి ననుసరించి నవని చెప్పెనేగాని వీని లక్షణము మాత్రమీతడు చెప్పలేదు. కేవల కళికా సంగతిని గావించిన కృతికిఁ బేరు కల్యాణి యగు ననియు నుత్కళికలతో మాత్రమే చెప్పిన నుత్ఫల్లకమగునని, యుదాహరణములలోఁగల భేదమును దెల్పుచు—

"గ్రంథబాహుళ్యభీరుత్వ కథనమిదియు
ధరనుదాహరణాది భేదములు పెక్కు
తెలియు డొండెడ.

అని వీనిలో భేదము లనేకములింక గలవని సూచించి వదలి వేసినాడు. ఈతడు చెప్పిన సద్దళి, పద్దళి, విద్దళి, కల్యాణి, ఉత్ఫల్లకములకే మనకుదాహరణములు దొరకలేదు. పాల్కురికి సోమనాథుడు చెప్పిన "బసవోదాహరణ" మొక్కటే యీ కాలపు టుదాహరణ ప్రబంధముల కుదాహరణమగు చున్నది. ఈ దేశీయ రచనలు తాళలయ బద్ధములై పాటల రూపమున నుండుటచేతను, శిష్ట కవులచే నా రూపమున నాదరింపబడక పోవుటచేతను, వారు నలనామగణ బద్ధములు గనునాలుగంఘ్రులు గలవానిగనుజేసి మార్గ పద్ధతిలోఁ జేర్చుకొని యాదరించిన తరువోజ, సీస, అక్కర, గీతాదులు తప్ప తక్కినవాని యునికి మనకు స్ఫుటముగాఁ గనఁబడదు గాని, నన్నయ కాలముననే కోరుమిల్లి శాసనములోని కెక్కిన సంస్కృతభాషారచిత "రగడ" భాగమును బట్టి యీ కాలముననే రగడ రచన యీ దేశమున విశేష వ్యాప్తిలో నున్నదని మనము

నిశ్చయింపవచ్చును. కన్నడమున రగడ రచన సాగుచుండెనను టకు నాగవర్మ పేర్కొనుటేగాక, పంపాదులుగూడ వాడియుండు టయే నిదర్శనము. కావున నివి నన్నయకు పూర్వము నుండియు తెలుఁగు కన్నడ దేశముల వాడుకలో నుండెననవచ్చును. సోమ నాథాదు లుదాహరణ కావ్యమునఁ బ్రయోగించిన కళికలును రగడ భేదములే. చతురశ్రత్ర్యశ్రాది తాళములు గల దళములతోఁ గృత గుచ్ఛానుప్రాసంబు గలవనియు, కళిక యే తాళమునఁ బరిఘటిత మయ్యె నుత్కళికయు దానన యునుపవలయునని యీ కళికల లక్షణమున తాళప్రాధాన్యమును మాత్రము పెద్దన సూచించినాఁడే గాని, అప్పకవి యే రగడ కే తాళమో వ్యక్తము చేసినాఁడు. వృషభగతికి త్రిపుట తాళము. తురగవల్గనమునకు రూపకము.

---

తుదనెడు -లఘువులు తొలగించి చదివిన
త్రిపుటకు వృషభగతి పదయుగము
లిలఁగడపల నొక్క లఘువుమానిన జంపె
మను ద్విరదగతి, సమపదయుగము
గురుతు రూపకమునకుఁ దురగవల్గనా
హ్వయమేకతాళి యా మధురగతికి
హరికివిర్వచినాలు గటతాళమునమాత్ర
లోలి విశ్రాంతి పద్నాలుగింట
దెలియ నర్థంబు నర్ధ చంద్రికలు వీట
యక్షగాన ప్రబంధంబు నతుకవచ్చు
రగడ భేదంబులివి యండ్రు రసఁ గవీంద్రు
లవితనిజసేవకస్తోమ యబ్ధిధామ. అప్పకవీయము. 4 ఆ.

ద్విరదగతికిజంపె, మధురగతికి ఏకతాళి, హరికి అటతాళము. ఈ విధముగ తాళగతులుగలవై మాత్రాగణ బద్ధములైన అర్ధ చంద్రిక లనే రగడ భేదంబులని యందురట. ఈ రగడ భేదంబులనే యక్ష గాన ప్రబంధంబులో నతుకవచ్చునట. దీనివలన నుదాహరణముల లోని చంద్రికలు అర్ధ చంద్రికలే గాక యక్షగానములలోని పాటలు గూడ రగడభేదంబులే యనియు, నివి యన్నియు తాళ ప్రధానము లగు గేయ రచనలే యనియు నప్పకవి యభిప్రాయమైనట్లు స్పష్ట మగు చున్నది. పెద్దన రగడ యనుదానినొక చాటు ప్రబంధ భేదం బుగా మాత్రమే తలచెనుగాని, "దేశి" కవిత్వములో వెలసియున్న యనేక విధములగు పాటలు తాళబద్ధములగు రగడలే యని గుర్తిం చిన ట్లగపడదు. గుర్తించినను మార్గ కవితాభిమాన మాతని నీ పాటలు కూడ లక్షణయుక్తములే యని చెప్పుట కాతనిని ప్రోత్స హించి యుండదు. ఐనను మాత్రాగణ బద్ధంబేయైన ద్విపద రెండు పాదముల నొక పాదముగాఁ జేసి కల్పింపఁబడిన "తరువోజ" దంపుళ్ళ పాటగా నుపయోగపడుచున్నదే యని యాతఁడు సూచిం పకపోలేదు. రగడను ప్రత్యేకచాటు ప్రబంధముగాఁ జెప్పిన విన్నకోట పెద్దనయు యక్షగాన ప్రబంధము నెత్తుకొననే లేదు. కాని ఆనాటి కివి లేవనియు దలంపరాదు. మార్గ పద్ధతి ప్రబలిన కాలమున వీని నాదరించు ప్రభువులు లేక యివి సామాన్య పామరజన వినోదములుగ నిలిచిపోయినవి. 17_వ శతాబ్దిని నాయక రాజుల యాదరణమును బడయుటచే నవి యాస్థాన రంగస్థలమున కెక్కి గ్రంథస్థములై నిలిచినవి. శ్రీశైల

మున నేకాదశినాటి రాత్రి జాగరణోత్సవ సందర్భమున పాల్కురికి సోమనచే వర్ణింపఁబడిన బహువిధ నాటకములలో నీ యక్షగానములుకూడ నుండియుండును. తొలి లాక్షణికులలో విన్నకోట పెద్దనాదులు వీనిని స్మరింపకున్నను చిత్రకవి పెద్దన వివరించిన మధురకవితా రీతులన్నియు నంతకు పూర్వము— నన్నయకు పూర్వముననుకూడ— లేవనిగాని, యాతని కాలముననే యెక్కు సారిగా బయలుదేరినవనిగాని తలంపకూడదు. ఆతనికి పూర్వమున గల లాక్షణికులకు, నన్నిచోడ పాల్కురికిసోమనాథుల కవిత్వమందువలెనే, యీ దేశిరచనలయం దాదరములేకపోయినది. కావున వారు వీనిని గ్రహింపలేదు. లక్షణదీపికాకారునికి దేశికవితయగు మధురకవితయం దాదరము కలిగినది. అతఁడు దాని భేదములను వర్ణించుటచే నా కాలముననైనను అవి కలవని మనము తలంచుటకవకాశము కలిగినది. కాని యీ మధురకవిత యంతయు తాళలయబద్ధమై జనసామాన్యమున వ్యాప్తిలో నున్న యనేక విధములగు పాటల రూపము గలదై, కన్నడాంధ్ర దక్షిణదేశీయ సామాన్య సాహిత్యమునకుఁ జేరినదై యున్నది. వీనిలో కొన్ని రచనలు కొన్ని దేశ భాగములందే నిలిచియుండవచ్చును. కాని రగడలు, అక్కరలు, ఏలలు, గీతికలు, త్రిపదషట్పదాష్టపదులు మొదలగునవి కన్నడాంధ్ర సామాన్యములే. మధుర కవితలోని యుదాహరణాది ప్రబంధములలో కళికోత్కళికలు మాత్రమే — అవియు వృత్తములతో గూడి — వచ్చుచుండును. గాని యక్షగానములలో నింక ననేక విధములగు దేశి

రచనలు నిలిచియుండుటయే వీనిలో గల పెద్ద విశేషము. దేశి రచనారీతులెన్నియో వీనియందు చేర్పఁబడియున్నవి. అప్పకవి యైనను తాళానుబద్ధములగు కొన్ని రగడ భేదంబులను మాత్రమే తెలిపి వానిని యక్షగానములలో నతుకుదురని చెప్పి యూరకున్నాడుగాని యక్షగాన లక్షణమునుగాని స్వరూపమునుగాని వివరింపలేదు. చిత్రకవి పెద్దన తెలుఁగు కవితాభేదములగు ఆశు, మధుర, చిత్ర, విస్తరములను బేర్కొని అందు మధుర కవిత్వం బన్న దానిని వివరించుచు నందు యక్షగానమున వచ్చు దేశిరచనలను చెప్పినాఁడు. దేశీయ కవిత్వము నిట్లు నాల్గు విధములుగల దానిగా విభజించి చెప్పుట 12-వ శతాబ్దిని "పాట్టియల్" అను తమిళ లక్షణ గ్రంథమునందుగూడ గానవచ్చుచున్నది.

మధుర కవిత్వములో పెద్దన-నాటకాలంకారములను జేర్చినాఁడు, నాటకములనేగాక, మరల యక్షగానంబులను వానిని బేర్కొని యుండుటచే, నివి భిన్నజాతులేమోయని యనిపించును గాని, మధుర కవిత్వములో యక్షగానంబున వెలయు పదంబులు దరువులు, ఏలలు, ధవళంబులు, మంగళహారతులు, శోభనంబులు, ఉయ్యాలలు, జోలలు, జక్కులరేకు పదంబులు, చందమామ సుద్దులు, మొదలగు వానిని బేర్కొనుటచే, యక్షగానంబుల వచ్చు నీ పదముల నన్నింటిని దేశి రచనా భేదములుగాఁ జెప్పదలచెనేమోయనియు తలంపవచ్చును. లేదా నీ ప్రదర్శనములలోనే కొన్నిటికి నాటకములని, కొన్నిటికి యక్షగానములని పేళ్లుండి యుండవచ్చును. రుద్రకవి సుగ్రీవ విజయమును యక్షగానమని,

రంగాజమ్మ రచనను మన్నారుదాసవిలాస నాటకమని అన్నారు కదా. కొన్నిటిని ప్రబంధములనుటయు గలదు. పల్లకీసేవా ప్రబంధము, త్యాగరాజ వినోద ప్రబంధము అనునవి, శాహజీవిరచిత యక్షగానములు తంజావూరు గ్రంథాలయమున గలవు. ఏపేర నున్నను ఇవన్నియు ప్రదర్శనీయములుగా రచింపబడినవే. అన్నియు చాలవరకు దేశీయములగు ననేకవిధ గేయ రచనలతో గూడినవే. వీనిమూలముగనే యనేకవిధములగు దేశి రచనలు సంరక్షింపఁబడియున్నవి. వానిలో ఏలలు, జోలలు, సువ్వాలలు, ఆరతులు, ధవళములు, వెన్నెల పదములు, నివాళి పదములు, తుమ్మెద పదములు, గొబ్బి పదములు, అల్లో నేరేళ్లు, త్రిభంగులు, ద్విపద, త్రిపద, చౌపద, షట్పదాష్ట పదులు, మంజరులు, జక్కుల రేకులు మొదలగునవి గలవు.

ఇవియన్నియు పాటలుగనే తాళబద్ధములై యేర్పడి జన సామాన్యముచే నిత్య జీవితమునఁ బాడుకొనబడునవి. పాట కనుకూలముగా హ్రస్వ దీర్ఘములు తారుమారగుచుండుటయు సంభవించుచుండుటచే గాబోలు వీనిలో పెక్కింటికి లక్షణ మేర్పడలేదు.

మనకిప్పుడు లభించి ప్రకటింపఁబడియున్న యక్షగానములలో 16—వ శతాబ్దివాఁడగు రుద్రకవి యక్షగానమే మొదటిదిగాఁ గానఁబడుచున్నది. 17—వ శతాబ్దిని నాయక రాజుల కాలములో ననేకములు బయలుదేరినవి. పెక్కు తంజావూరు పుస్తక భాండారములోను, మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము

లోను గలవు. ఇంకను వీథినాటకములు కురవంజిలు అనుపేరుతో నచ్చుపడినవియుఁ గొన్ని గలవు.

దక్షిణదేశమునందలి యక్షగాన కర్తలలో ఉత్తర రామాయణ కర్తయగు కంకంటిపాపరాజు, గిరిరాజకవి, శివాజియను వారు కలరు. పాపరాజు విష్ణు మాయావిలాసమును, గిరిరాజకవి శాహేంద్ర చరిత్రమును, శివాజి అన్నపూర్ణాపరిణయము— అను యక్షగానములను రచించిరి. వెంకటాద్రి వాసంతికా పరిణయమను యక్షగానమును, చంగల్వరాయకవి పారిజాతము, ఎరుకల కథ, సత్యభామ కథ, అనువానిని రచించెను. కామపీడితయగు సత్య యొద్దకు బ్రహ్మ నిజాంగనను కొరవంజివేషంబున బంపుటయు నామె యెఱుక చెప్పి సత్యభామను హర్షమొందించుటయు, రెండవ దానిలోని కథ. మూడవదానిలో రుక్మిణీ సత్యభామల సవతుల కయ్య మీ విధముగాఁ గలదు.

'మంచిదీ కానీవె రుక్మిణీ, వేలు, వంచాలేవే సత్యభామినీ,
నాసరీ దానవా రుక్మిణీ, భామ, నీసారివారిలో దెల్సుకో
గద్దారితనములు విడువవే, భామ, సుద్దూలకేమాయె, వేగదే
గొంచాపుగుణములు మానవే, నీ, కొంచాపువగలెల్ల విడువవే,
కయ్యానికొచ్చిన విధమేమీ, నీగయ్యాళిసుద్దుల భయమేమీ
జాతికొద్ది మాటలాడవే, అక్క, నీతిగాదు నోరు ముయ్యవే
మందులమారివే రుక్మిణీ, నీ విందారిలో నిజము చేసుమీ
చేతులు తిప్పాకె రుక్మిణీ,—— మూతులూ తిప్పాకే భామినీ."

ఇక నాటకములని కొరవంజులనియు మరికొన్ని గలవు. యక్షగానములకు వీనికిని రచనలో విశేష భేదమున్న ట్లగపడదు. నాటకములను రచించినవారిలో, విజయరాఘవ నాయకుఁడు (1633-1673), షాజీ, శివాజి, మన్నారుదేవుఁడు మొదలగు తంజావూరి రాజులే కలరు. విజయరాఘవ నాయకుఁడు కాళియమర్దనము, పూతనాహరణము, రఘునాథాభ్యుదయము, ప్రహ్లాద చరిత్రము మొదలగు నాటకములనేగాక యింక ననేక దేశి రచనలనుగూడ రచించినట్లే ప్రహ్లాద చరిత్రవలనఁ దెలియవచ్చుచున్నది. ఇరువది ముప్పది నాటకములనేగాక ఫాల్గుణోత్సవరగడ, రాజగోపాల దండకము, వీర శృంగార సాంగత్యము, సంపంగిమన్నారు సాంగత్యము, విన్నపములు, దరువులు, ఏలలు, పదాలు, సంకీర్తనలు, కురవంజి, చౌపదము, జక్కిణి, దురుపదము, చిందు, సవతిమత్సరంబు మొదలగువానినిగూడ నీతఁడు రచించినట్లు—ప్రహ్లాద కథా నాటక చాటు కావ్యంబునఁ జెప్పికొన్నాడు. ప్రహ్లాద చరితమునే త్యాగరాజస్వామికూడ యక్ష గానముగా రచించినాడు. "నౌకా చరిత్ర" మను యక్షగానమునుగూడ రచించినాడు. ఇది మద్రాసు యూనివర్సిటీ సంగీతశాఖ వారిచే చక్కగా ముద్రింపబడినది. మన్నారు దేవుఁడు హేమాబ్జనాయికా స్వయంవరమును, మహారాష్ట్రరాజగు ఎకోజీ-విఘ్నేశ్వర కల్యాణము, తులజరాజు శివకామసుందరీ విలాసము, వెంకటపతి సోమయాజి విజయరాఘవ చంద్రికా విలాసము, శాహరాజు—రతీ కల్యాణము, పార్వతీ పరిణయము, వల్లీ కల్యాణము మొదలగువానిని రచించిరి. గిరిరాజ

కవి రచించిన "రాజమోహన కొరవంజి" అనునది శాహమహా రాజున కంకితము. ఈ "కొరవంజి" నాటకమున ముఖ్యవిషయము, విరహ పీడితులగు నాయికానాయకులకు ఒక యెరుకత వచ్చి ఎరుక చెప్పుట యనునదిగాఁ గనఁబడుచున్నది.

భోసలకుల శాహ భూపాలుమీద
చెన్నుగా మోహిత చిత్తయై రాజ
కన్యకామణి సరి కాంతలు గొలువ
గరిమెతోడుతమున్న కదలివచ్చుటయు
విరహభరంబుచే వెతలఁజెందుటయు
నెరుకత వచ్చి తా నెరుకజెప్పుటయు
గురుతుగా శాహేంద్రు గూడియుండుటయు
అనియెడి రాజమోహన కురవంజి"

అని యందలి కథాసూత్రము నెరుకపరచినాఁడు కవి. ఈ కొరవంజి యనునది తొలుత కొండలజాతివాళ్లగు ఎరుకలు నివసించు కొండ ప్రదేశములకుఁ జెందిన నాట్య కథారూపమై యుండెనేమో. ఈ కురవంజి కన్నడాంధ్రములందే గాక తమిళ దేశమున గూడ నిటీవల వ్యాప్తిగాంచియున్న రచనా విశేషము.

తొల్కాప్పియం పొరుళధికారమున తమిళ కావ్యవస్తువు, తద్వర్ణనారీతులును చెప్పఁబడు సందర్భమున — కావ్యము లోని శృంగారము గాని వీరరసము గాని యా యా దేశ కాల విభాగమున కనుగుణముగనే వర్ణింపబడవలయునను నదొక కవి సమయముగా నేర్పడుటయే గాక దీని కనుగుణముగాఁ జేయబడిన దేశ

విభాగము లయిదింటిలో కొండప్రదేశము "కురుంజి" యని పేర్కొన బడినది. ప్రాచీన తమిళకవి సంప్రదాయ ప్రకారము దేశ విభాగము కురుంజి, (పర్వత ప్రాంతము), పాలై (మరు ప్రదేశము) ముల్లయ్ (అడవి ప్రదేశము), మరుదం (మాగాణి ప్రదేశము), నయ్దల్ (సముద్ర ప్రాంతము) అని యైదు విధములు గలదై యున్నది.

ఈ ప్రదేశములందు శృంగార వీర సంప్రదాయములగు కథలను వర్ణించునప్పుడు, కొన్ని ప్రత్యేక కవి సమయముల ననుసరించి చేయవలయునను నియమము కూడా కలదు. ఒక్కొక్క ప్రాంతమునకు చిహ్నములగు రంగు పుష్పములు, మొదలగునవి కూడ తెలుపఁబడినవి. శృంగారము రసమైనప్పుడు నాయికా నాయకుల సమాగమము (పుణర్చ్) కురుంజి అనఁగా పర్వత ప్రదేశములందే జరిగినట్లు, రాత్రి మొదటి జామున సంఘటిల్లినట్లును వర్ణింపఁబడవలయును. యుద్ధాదివర్ణనము మొదట గోగ్రహణముతోఁ బ్రారంభింపఁ బడవలయును. అది కురంజి—పర్వత ప్రదేశమందే జరిగినట్లు సూచింపబడవలె. దాడి వెడలుటకు సంబంధించినది ముల్లయ్ ప్రదేశము. ముట్టడి (మరుదం) మాగాణి ప్రదేశమున జరిగినట్లును, యుద్ధము (నెయిదల్) సముద్ర ప్రాంతమున జరిగినట్లును, సూచింపవలె. విజయమునకు సంబంధించినది పాలై (ఎడారి ప్రదేశము). ఇక పుష్పములలో ఎర్రనిరంగుగల "వెచ్చి" పూవులు రుధిర స్రావము గల యుద్ధమునకు సూచకములుగా వర్ణింపవలె. పసుపుపచ్చని "వంచి" పువ్వులు అప్రతిహత శక్తి

చిహ్నములు. తుంబె—ద్రోణపుష్పములు కోటను ముట్టడించువారిచే ధరింపబడును. వాహై యను తెల్లని పుష్పములు విజయ చిహ్నములు. ఈ కవి సమయములన్నియు దేశీయములేగాని సంస్కృతాలంకారిక పద్ధతులకేమాత్రము సంబంధించినవి కావు. కాని యివి యితర భాషలలోనికి రాలేదు. "కురంజి"—"కురవంజు"లకు సంబంధమేమైన నుండునా ?

ఈ విధముగా యక్షగానము, కురవంజి, నాటకము అను నాట్య ప్రదర్శనార్హములగు రచనలుకూడ షట్పదీ ద్విపద కావ్యాది రచనల వలెనే, దక్షిణ దేశమున కంతకును సమానముగు "దేశి" సాహిత్య సంప్రదాయ రీతులలోఁ జేరినవే యని మనము నిశ్చయింపవలసి యున్నది.

వీరశైవ మతోద్బోధము కలిగినపిదపనే దేశీయచ్ఛందో ఫక్కి ననుసరించి రచింపబడిన షట్పదీ సాంగత్యాది కావ్యముల వలెనే కన్నడ భాషలో మరికొంత కాలమునకు యక్షగాన వాఙ్మయ శాఖయు బయలుదేరినది. తెలుగున నిట్లేజరిగినది. అంతకుపూర్వమే కన్నడములో పంపాదులు "కవిరాజమార్గ" ఫక్కి ననుసరించి పురాణ ప్రబంధ కవితను కన్నడ భాషలోనికి దింపినట్లే, వారిని జూచియే నన్నయయు సంస్కృత వృత్తాదులను వర్ణనా రీతులను ఆలంకారిక పద్ధతులను తెలుఁగు కవితలోనికి దింపి, భారత రచనను సాగించినతోడనే యిది శిష్టలోకము నాకర్షించుటచే, దేశీయ రచనలకు తగిన యవలంబనము లేకపోయినది. అవి సామాన్య జనుల

లోనే వ్యాప్తిగాంచియుండినవి. ఈ దేశమున గూడ బ్రా
మతమునకు పోటీగా వీరశైవ మతము ప్రబలినపిదప, జన
న్యమున నా మతమును వ్యాప్తిగావించుటకై — పాల్కురికి
నాథుడు ప్రసన్నమైన జానుదెనుఁగులో ద్విపద రచనను
నాఁడు. దీనినిబట్టి సామాన్య జనాదరణము బడసిన
రచనలో — రామాయణాది గ్రంథములును బయలుదేరినవి.
మున షట్పదీ రచన ప్రాధాన్యమును వహించి యొక
వాఙ్మయ శాఖయయినట్లే, తెలుఁగులో ద్విపద రచన ప్రాధా
వహించి - ప్రబంధ శాఖకు భిన్నముగా - నొక ప్రత్యేక వా
శాఖగా నేర్పడినది. మార్గపద్ధతి నవలంబించిన కన్నడ భా
శిష్ట వాఙ్మయము పంపాదులు తీర్చిన ప్రబంధ రచనతోడనే ప్ర
మైనను, తెనుఁగులో నిచ్చటి దేశ కాలపరిస్థితులనుబట్టి నన్న
భారతమందు సంహితా దృష్టియే ప్రాధాన్యమును వహించు
నామార్గ ఫక్కి ప్రబంధ రచనారూపము నొందక, పురాణ
రూపమునే పొందుట తటస్థించినది. నన్నయకు తరువాత
నన్నిచోడుఁ డాకన్నడ కవుల ప్రబంధ ఫక్కినే యను
తెలుగుభాషలోఁ గూడ ప్రబంధశాఖ కంకురార్పణము చేయనే
నాఁడు. కాని యందాతఁడు జోడించిన "దేశి" ఫక్కి, యా
శిష్టలోకమునకు రుచింపక పోవుటచేఁగాఁబోలు, నీ ప్రబంధ
రీతిని వెనుకకు నెట్టివేసి, నన్నయ పురాణరచనాపద్ధతియే ము
సాగి, తొలియుగమునంతను పురాణయుగమను పేరనేబరగుదాని

జేసెనవి. కాని అంతర్వాహినిగా "ప్రబంధ" దృష్టి ప్రవహింపక పోవుటయులేదు. తిక్కన భారత సంహితనే ప్రబంధ మండలిగాఁ జేయఁజూచినాఁడుగదా. ఎఱ్ఱన భారతారణ్యపర్వశేష రచనమూలముననే ప్రబంధపరమేశ్వరుఁడైనట్లు కూడఁ జెప్పఁకొన్నాఁడు. ఈ రీతిగా ప్రబంధఫక్కి పురాణయుగమున ప్రసిద్ధకవులని చెప్పఁదగిన వీ రిద్దరిని వెంటాడించుచునే యున్నది. అయినను ఆంధ్రభాషలో "ప్రబంధ" మనునది వెలువడుట కింకను గొంతకాలము పట్టినది. 16-వ శతాబ్దిగాని ఆంధ్రప్రబంధ స్వరూపము తేటపడలేదు. ఈ నడుమ దేశి ద్విపదశాఖయు చిలువలు పలువలు వేయుచునే వచ్చినది. గౌరన హరిశ్చంద్ర నవ నాథచరిత్ర ద్విపదలు శ్రీనాథుని పల్నాటి వీరచరిత్ర మొదలగునవి కొన్ని బయలుదేరి యీ శాఖను పెంపొందించినవి.

17-వ శతాబ్ది ప్రాంతమున దేశ కాలపరిస్థితులలో గలిగిన మార్పు సహాయకారిగా నేర్పడినపిదపగాని దేశి కవిత రాజాదరణమును బడయుట-ద్విపద యక్షగానాది రూపముల మరల విజృంభించుట తటస్థింపలేదు. అనగా 11-వ శతాబ్దిలో నన్నయ పెంపొందించిన మార్గ కవితా మూలముగా వెనుకబడిపోయిన దేశి కవిత 12, 13 శతాబ్దులలో మతవ్యాప్తి మూలమునను, 17-వ శతాబ్దిలో -రాజకీయ పరిస్థితులవలనను-అనగా తెలుఁగువారు విదేశంబగు తమిళ దేశమున నెలకొనిన వారగుటచేతను - అనుకూల వాతావరణము కలుగువరకు మరల తలయెత్తుట కవకాశము కలుగ

లేదన్నమాట. ఈ విధముగా కన్నడాంధ్రములలో మార్గపద్ధ
ననుసరించిన పురాణ ప్రబంధ వాఙ్మయశాఖలేగాక, "దేశి" పద్ధతి
ననుసరించిన-షట్పదీ ద్విపదోదాహరణ యక్షగానాది శాఖలును
ఆయాకాలములందు గలిగిన యనుకూల వాతావరణమునుబట్టి, యీ
భాషలలో వృద్ధినొందుచు వచ్చినవి. కాని తెలుఁగున పురాణ
ప్రబంధశాఖలతోడి సమానగౌరవ మితర శాఖలకింకను రాలేదు.
వానినిగూర్చి తగినంత పరిశ్రమయు జరుగలేదు. ఇటీవల కొంత
ప్రారంభమయినది.

అయితే క్రీస్తు శకారంభముననే తమిళభాషలో తగినంత
వాఙ్మయము, భాషా సాహిత్య లక్షణము నేర్పడి యుండగా,
సోదరభాషలే యగు తెలుగు కన్నడములలో నాకాలమునుండియు
దేశి వాఙ్మయము లేకపోయెనా? ఏ వాఙ్మయమును లేకపోవుటకుఁ
గారణమేమి. ఈ దేశీయులంత వెనుకపడి యుండిరా. ఇప్పటికిని,
తొడ, కుయి, గాండ్ మొదలగు భాషలవలెనే యివియు నంత
యనాగరక భాషలై యుండెనా. లేక యే దేశారిష్టములవలననైన,
మత రాజకీయ కారణములచేనైన, బయలుదేరిన వాఙ్మయము
నశించినదా? అంతకుపూర్వము వాని స్థితిగతులెట్టివి. వీనినిగూర్చిన
ప్రశంస యెంతవరకు గలదు. మన భాషకు ఆంధ్రము, తెలుఁగు
అను రెండు పేళ్లు గలుగుటకు గారణమేమి? ఈ మొదలగు విష
యములను దెలిసికొనవలెనన్నచో, నీ భాషలకు నెలవగు మధ్య
దేశీయ పరిస్థితులను కొంత పరిశీలింపవలసి యుండును.



జేసినది. కాని అంతర్వాహినిగా "ప్రబంధ" దృష్టి ప్రవహింపక పోవుటయులేదు. తిక్కన భారత సంహితనే ప్రబంధ మండలిగాఁ జేయఁజూచినాడుగదా. ఎఱ్ఱన భారతారణ్యపర్వశేష రచనమూలము ననే ప్రబంధపరమేశ్వరుఁడైనట్లు కూడఁ జెప్పకొన్నాఁడు. ఈ రీతిగా ప్రబంధఫక్కి పురాణయుగమున ప్రసిద్ధకవులని చెప్పఁ దగిన వీ రిద్దరిని వెంటాడించుచునే యున్నది. అయినను ఆంధ్ర భాషలో "ప్రబంధ" మనునది వెలువడుట కింకను గొంతకాలము పట్టినది. 16-వ శతాబ్దిగాని ఆంధ్రప్రబంధ స్వరూపము తేటపడ లేదు. ఈ నడుమ దేశి ద్విపదశాఖయు చిలువలు పలువలు వేయు చునే వచ్చినది. గౌరన హరిశ్చంద్ర నవ నాథచరిత్ర ద్విపదలు శ్రీనాథుని పల్నాటి వీరచరిత్ర మొదలగునవి కొన్ని బయలుదేరి యీ శాఖను పెంపొందించినవి.

17-వ శతాబ్ది ప్రాంతమున దేశ కాలపరిస్థితులలో గలిగిన మార్పు సహాయకారిగా నేర్పడినపిదపగాని దేశి కవిత రాజాదరణ మును బడయుట-ద్విపద యక్షగానాది రూపముల మరల విజృం భించుట తటస్థింపలేదు. అనగా 11-వ శతాబ్దిలో నన్నయ పెంపొం దించిన మార్గ కవితా మూలముగా వెనుకబడిపోయిన దేశి కవిత 12, 13 శతాబ్దులలో మతవ్యాప్తి మూలముననను, 17-వ శతాబ్దిలో -రాజకీయ పరిస్థితులవలనను-అనగా తెలుఁగువారు విదేశంబగు తమిళ దేశమున నెలకొనిన వారగుటచేతను - అనుకూల వాతా వరణము కలుగువరకు మరల తలయెత్తుట కవకాశము కలుగ

లేదన్నమాట. ఈ విధముగా కన్నడాంధ్రములలో మార్గపక్కి-ననుసరించిన పురాణ ప్రబంధ వాఙ్మయశాఖలేగాక, "దేశి" పద్ధతి ననుసరించిన-షట్పదీ ద్విపదోదాహరణ యక్షగానాది శాఖలును ఆయాకాలములందు గలిగిన యనుకూల వాతావరణమునుబట్టి యీ భాషలలో వృద్ధినొందుచు వచ్చినవి. కాని తెలుఁగున పురాణ ప్రబంధశాఖలతోడి సమానగౌరవ మితర శాఖలకింకను రాలేదు. వానినిగూర్చి తగినంత పరిశ్రమయు జరుగలేదు. ఇటీవల కొంత ప్రారంభమయినది.

అయితే క్రీస్తు శకారంభముననే తమిళభాషలో తగినంత వాఙ్మయము, భాషా సాహిత్య లక్షణము నేర్పడి యుండగా, సోదరభాషలే యగు తెలుగు కన్నడములలో నాకాలమునుండియు దేశి వాఙ్మయము లేకపోయెనా? ఏ వాఙ్మయమును లేకపోవుటకుఁ గారణమేమి. ఈ దేశీయులంత వెనుకపడి యుండిరా. ఇప్పటికిని, తోడ, కుయి, గాండ్ మొదలగు భాషలవలెనే యివియు నంత యనాగరక భాషలై యుండెనా. లేక యే దేశారిష్టములవలననైన, మత రాజకీయ కారణములచేనైన, బయలుదేరిన వాఙ్మయము నశించినదా? అంతకుపూర్వము వాని స్థితిగతులెట్టివి. వీనినిగూర్చిన ప్రశంస యెంతవరకు గలదు. మన భాషకు ఆంధ్రము, తెలుఁగు అను రెండు పేళ్లు గలుగుటకు గారణమేమి? ఈ మొదలగు విషయములను దెలిసికొనవలెనన్నచో నీ భాషలకు నెలవగు మధ్య దేశీయ పరిస్థితులను కొంత పరిశీలింపవలసి యుండును.



# IV

## ఆంధ్రము - తెలుఁగు

ఆంధ్రము, తెలుఁగు అను నీరెండును సహజ సంబంధము లేని శబ్దములేయైనను, ఏకార్థబోధకములేయై మన మీ దేశమున వ్యవహరించు భాషను సూచించునవై యున్నవి. లోకములో నొక మనుజునకుగాని, ఆతని భాషకుగాని, దేశమునకుగాని తత్సంకేత రూపమగు నొక్క పేరుండుటయే స్వాభావికము. కాని మనకు, మనభాషకు, మన దేశమునకు రెండు పేళ్ళుగలుగుట కొంత విప రీతముగాఁ గనఁబడక మానదు. ఇట్టి స్థితియే అఱవము (తమి ళము, ద్రావిడము) మొదలగు మఱికొన్నిటి విషయమునగూడఁ గనఁబడవచ్చునుగాని, లోక వ్యవహారమున కది సౌకర్యమనికాని, స్వాభావికమనికాని చెప్ప వలనుపడదు. ఇట్లు గలుగుటకుఁ గల కారణముల నించుక పరిశీలించితిమేని మన భాషా సాహిత్యముల యొక్కయు, సంఘముయొక్కయు ప్రాచీన స్థితియుఁ బరిణామ క్రమమును కూడ కొంతవరకు బయలుపడకపోవని తోచుచున్నది.

భాష యనునది మానవులు తమ హృద్గతాభిప్రాయములను దమ సంఘములోని యితరులకు వ్యక్తపరచుటకై యేర్పరచుకొనిన సంకేతరూపమగు నొక సాధనము. కావున నాయా మానవ సంఘ ములు, లేదా జాతుల పేళ్ళనుబట్టియే వారు నివసించెడి దేశమున కును, వ్యవహరించెడు భాషకును పేళ్లేర్పడుచుండుట స్వాభావికము.

ఆంగిలుల దేశ మాంగ్లలాండు. అదియే ఇంగ్లాండైనది. వారి భాష ఇంగ్లీషు. పారసీకుల భాష పరిషియన్; దేశము పరిషియా. ఓడ్రుల భాష ఓడ్రము. తుళువల భాష తుళు, కోదుల భాష కోదు. ఎరుకలవారిది ఎరుకల భాష. ఒక్కొక్కప్పుడు దేశ నామమును బట్టికూడ నందలి జనులకును, భాషకును పేర్లేర్పడుచుండుటయుఁ గలదు. "సింధు"నదినిబట్టి, లేదా దానికి రూపాంతరమగు"హిందు" శబ్దమునుబట్టి యీ దేశము హిందూదేశమైనది. అందలి భాష హిందీ. మహారాష్ట్రము. శౌరసేనము,మగధ, కర్ణాటము(కఱు + నాడు), మలయాళము (మలై + ఆళం) అను దేశ నామములను బట్టి యేర్పడినవే మహారాష్ట్రి, శౌరసేని, మాగధి, కన్నడము, మలయాళము మొదలగు భాషలు. దక్షిణదేశభాషలలో తమిళము "తమిఱర్" అను ద్రవిడజాతివారినిబట్టి యేర్పడినదే. దీనికి "అఱవము" అను నామాంతరముకూడ "అఱువాళర్" అను నొక తెగ వారినిబట్టి యేర్పడినది. కాని తమిళదేశమున గాని, తద్వాఙ్మయమునగాని యీ పేరు వాడుకలో లేదు. ఇది ఉత్తరమున వీరికి సమీపస్థులైయున్న యాంధ్రులచే పెట్టఁబడిన పేరుగాఁ గనఁబడుచున్నది. కాని భాషమాత్ర మొక్కటే. తమిళము, అఱవము వలెనే ఆంధ్రము, తెనుఁగు అను పేళ్లుగూడ నాయా జాతుల నామములనుబట్టి యేర్పడినవే. చిరకాలమునుండి యీ పేళ్లు రెండును దేశపరముగను, భాషాపరముగను నా దేశ జనులచే నభిన్నములుగనే వ్యవహరింపఁబడుచున్నవి. కాని యా రెండు తెగలవారు నాదికాలమునుండియు తమిళమువలెనే యొక భాషనే వ్యవహ

రించిరా, లేక వేర్వేరుభాషలుగల భిన్నజాతులవారై యుండి, యీ దక్షిణాపథమున నెలకొనిన వెనుక నేకజాతివారై యేకభాష నవలంబించిరా యను విషయము విమర్శనీయమైయున్నది. ఐతరేయ బ్రాహ్మణమునందలి కథనుబట్టి యార్యాంధ్రు లార్య సంఘము నుండి బహిష్కరింపఁబడి పుండ్ర పుళింద మూతిబాది తెగలతో పాటు వింధ్య దక్షిణ భాగమున నెలకొనినట్లు తెలియవచ్చుచున్నది. వీరు కాల క్రమమున దక్షిణాపథమును జేరి యందు కృష్ణా గోదావరి ప్రాంతములందలి యాదిమనివాసులగు తెలుఁగులతో గలిసి, కొంతకాలమునకు కృష్ణానది యొడ్డున నాంధ్రరాజ్యమును స్థాపించిరి. మెగస్తనీస్ కాలమునకే, అనఁగా క్రీస్తుకు పూర్వము మూడవశతాబ్దినాటికే యిది అప్పటి మగధరాజ్యము తరువాతఁ జెప్పఁదగిన ప్రబలరాజ్యముగ నాతనిచే నెన్నబడినది. అశోకుని కాలమున కించుక తరువాతివని తలంపబడుచున్న భట్టిప్రోలు శాసనములలో గృష్ణానదీ ప్రాంతమున "కుబీరకు"డను ఆంధ్రరాజొకఁడు పేర్కొనఁ బడియున్నాఁడు. క్రమముగా నాంధ్రులు పశ్చిమ దిగ్భాగమునగూడ వ్యాపించి మగధరాజ్యము నాక్రమించి హైందవ సామ్రాజ్యధురంధరులైరి.

ఇట్లుత్తరదేశీయులగు నార్యాంధ్రులు కృష్ణా గోదావరీ ప్రాంతమును తమ నివాసముగాఁ జేసికొని యచ్చటి జనులతో గలిసి సామ్రాజ్యపాలకులగుటచేతనే యీ దేశ మాంధ్రదేశమైనది. ఇందలి జను లాంధ్రులైనారు. అప్పటి యాంధ్రుల ప్రాభవాతి

శయముచే నిచ్చటి యాదిమనివాసుల యూరుపేరులు కొంతకాల మంతరించినను ఆర్యాంధ్రులు వచ్చునప్పటి కిది నిర్జనారణ్యముగా నుండెననిమాత్రము తలంపరాదు. బౌద్ధయుగమున నుత్తరదేశము నందలి తామ్రలిప్తిప్రాంతమునుండి సముద్రమార్గమున దక్షిణదేశ మున్నకుఁ బోవుచుండిన బౌద్ధయాత్రికులకుఁ గృష్ణానదీ ముఖద్వార మున నాగరాజు లాతిథ్యమిచ్చినట్లు సూచించెడి యమరావతీస్తూప శిల్పమున జిత్రితములగు గాథలనుబట్టి యీ దేశమున నాగజాతి వారు కూడ నున్నట్లు తెలియుచున్నది. ఆ కాలమున భూమిమీద కంటెను సముద్రముమీద ప్రయాణ మెక్కుడు సుకరమై యుండి యుండును. ఇక్ష్వాకులనాటి నాగార్జునకొండ శాసనములలో నొకదాని యందు వీరపురిసదత్తుని రాజ్యకాలమున "బుధిమ్ణక"ని భార్యయగు "బోధిసిరి" యను నామె శ్రీపర్వతమునకు సమీపమున నున్న విజయపురియందలి "చులదమ్మగిరి విహారము"లో నొక 'చెతియ ఘర' (చైత్యగృహము) నిర్మించినట్లున్నది. అది "తంబపణ్ణ" — అనగా తామ్రపర్ణి యనఁబడు సింహళమునుండి వచ్చు బౌద్ధ సన్యాసినులకును (థెరిస్), ఇంకను కాశ్మీర, గాంధార, చీన, చిలాత, తోసలి, అపరాంత, వంగ, వనవాసి, యవన, దమిల, పాలూర దేశముల నుండి వచ్చు సన్యాసినులకును నివాసముగా నుపయోగపడున ట్లామె యుద్దేశించినదని చెప్పఁ బడుటచే నా కాలమున నాయా దేశముల నుండి బౌద్ధ సన్యాసినులు ఆంధ్రదేశమునకు వచ్చుచుండెడివారనుట నిశ్చయము.

అప్పటికి చిరకాలమునుండి కృష్ణానదియొడ్డున నున్న "కంట కొస్సల" (ఘంటసాల) గొప్ప రేవుపట్టణమైనట్లు తెలియుచున్నది. కావున కృష్ణా గోదావరీనదుల మధ్యప్రాంత మా కాలమున నిర్జనారణ్యమై యుండెననుట కవకాశములేదు. కాని యప్పటి తెలుఁగు వారిని గూర్చిన ప్రశంసమాత్ర మెచ్చటను గానరాదు. బహుశః చిరకాలము క్రిందటనే బర్మాదేశమునకు వలసపోయిన యచ్చటి తైలంగులనువారును, ఈ దేశమున నిప్పటికి నిలిచియున్న తెలగాణ్య బ్రాహ్మణులు, తెలగాలు అనువారును మాత్రమే యిందాదిమ నివాసులగు "తెలుఁగు" జాతివారిని స్మరింపఁజేయుచున్నట్లెంచవలసియున్నది. ఆంధ్రుల మూలమున నీ తెలుఁగుదేశ మాంధ్రదేశమైన తరువాత పెక్కు శతాబ్దములవరకును దాని ప్రశంస గానరాలేదు. కాని క్రీస్తు శకారంభకాలమున నీ దేశమున కీనామము కేవల మంతరించిపోయిన ట్లగపడదు. యవన యాత్రికుఁడగు టాలమీ యనునాతడు "ట్రిలింగాన్," "ట్రిగ్లిఫాన్" అను పదములచేఁ బేర్కొనిన దేశమిదియే యనఁదగి యుండుటచే, నాతని కాలమున, కనఁగా క్రీ. శ. ౨-వ శతాబ్దినాటి కీ దేశమున కీ పేరు కొంచెము మార్పుతోనైన నింకను సుప్రసిద్ధమైయున్నట్లే తలంపనగును. త్రిలింగములను గూర్చిన కథ పౌరాణికము. తరువాతికాలమునఁ గల్పింపబడినదే యైయుండును. అట్లే యైనచో టాలమీ ప్రయోగించిన శబ్దములోని తొలి వర్ణము రేఫ యుక్తమగుట యెట్లు సంభవించునను సందేహము కలుగ వచ్చును.

త్రైలంగులు, తెలగాలు, తెలింగానా, తెలుగు మొదలగు శబ్దము లనుబట్టి "తెలుఁగు" అనునదే తొలిరూపమై యుండినను, ఆ కాల మునందలి సంస్కృత పండితులు దీనిని సంస్కృతీకరించి యీ దేశీయ శబ్దమునకు స్వభాషానురూపమగు రూపమును, వ్యుత్పత్తిని గల్పించి యుందురనుటకు సందేహములేదు. అట్టి రూపమే వారి మూలముగా "టాలమీ"కి జేరియుండవచ్చును. కృష్ణానదికి ప్రాచీన నామము "మైసోలాస్" అని యున్నట్లగపడుచున్నది. తత్ప్రాంత దేశము "మైసోలియా," అదియే "మచిలీపట్టణ"మైనది. "మై" శబ్దమునకు ద్రావిడభాషలలో నలుపర్థము. దీని సంస్కృతీకర ణము మూలముననే యా నది "కృష్ణ"మై యుండును. ప్రాచీన కాలములో నిది "కృష్ణబెణ్ణా" అని పేర్కొనఁబడి యుండగా తరువాత "కృష్ణవేణి" యైనదిగా, "గోదావరి" అను శబ్దములోని రెండవ భాగము కావేరి, పొన్నేరి, పెన్నేరి (పెన్నార్),పాలార్, అడై యార్ మొదలగు నదీ నామములలోని రెండవభాగమువలెనే, "ఆర్" అను ద్రావిడ (తె, ఏరు) శబ్దమే. కాని యది సంస్కృతీ కరణము మూలముగా "వరి" అని మారినది. ఇట్లు ప్రాచీన కాల మున సంస్కృత పండితులు మ్లేచ్ఛభాషా శబ్దములను గూడ సం స్కృతీకరించి సంస్కృత శబ్దాను రూపములగు వ్యుత్పత్తులను గల్పించి వానియర్థమునెట్లు సాధింపయత్నించుచుండిరో కుమారిల భట్టు తంత్ర వార్తికమున ద్రావిడభాషా శబ్దముల నుదాహరణముగా

గ్రహించి వివరించివేయున్నాడు *త్రిలింగశబ్దము నట్టి సంస్కృతీకరణము మూలముగా నేర్పడిన శబ్దమనియే తలంపనగును.

మొత్తముమీద టాలమీ తరువాత చిరకాలము వరకు నీ దేశమునకును, నిందలి జనులకును, వారి భాషకును గూడ నాంధ్ర శబ్ద వ్యవహారమే ప్రబలుటచేత తెలుఁగు శబ్ద వ్యవహార మంతరించినదనియే చెప్పవచ్చును. క్రీ. శ. ४-వ శతాబ్ది ప్రాంతమందలి యువమహారాజు శివస్కందవర్మ మైదవోలు శాసనములో నీ దేశ "మంధపథ" మనియే పేర్కొనబడినది. (అంధాపథీయగామో విరిపరదత్తం). భరతుడు నాట్యప్రయోగమున కిరాతాంధ్ర ద్రవిడాది జాతుల విషయమున వారివారి భాష ప్రయోగింపగూడదనియు, శౌరసేని ప్రాకృతమే సమాశ్రయింపదగినదనియుఁ జెప్పినాడు. కాని ఒకప్పు డిచ్చవచ్చినచో ద్రావిడాది జాతులకు ద్రావిడియుఁ బ్రయోగింపవచ్చునన్నాడు. దీనినిబట్టి ఆంధ్రము, ద్రావిడము ననునవి శౌరసేన్యాదులకంటె భిన్నములైన ప్రత్యేక భాషలని వ్యక్తమగు

* "తద్యథా ద్రావిడాది భాషాయామేవతావత్ వ్యంజనాంతభాషాపదేషు స్వరాంత విభక్తి స్త్రీ ప్రత్యయాది కల్పనాభిః స్వభాషానురూపానర్థాన్ ప్రతిపాద్యమానా దృశ్యంతే. తద్యథా-ఓదనం "చోర్" ఇత్యుక్తే చోరపదవాచ్యం కల్పయంతి. పన్థానం "అతర్" ఇత్యుక్తే "అతర్" ఇతికల్పయిత్వాహుః సత్యం దుస్తరత్వా దతర ఏవ పన్థా ఇతి. తథా "పాప్" శబ్దం పకారాంతం సర్పవచనం అకారాంతం కల్పయిత్వా సత్యం పాపవ వాసా వితి వందతి..........తద్యథా ద్రావిడాదిభాషాసు ఈ దృశీ స్వచ్ఛందకల్పనా తదా పారసీక బర్బర యవన రౌమకాది భాషాను కిం వికల్ప్య కిం ప్రతిపత్స్యంత ఇతి నవిద్మః."

చున్నది. కుమారిలభట్టీదేశభాష నాంధ్రమనియే పేర్కొనినను, నిది ద్రావిడభాషకంటె భిన్నమనియు, నీరెండునుగూడ నార్య భాషలలోనివికాక మ్లేచ్ఛ భాషలలోనివనియుఁ దెలిపియున్నాడు. ఇట్లుత్తరదేశమునుండి యార్యాంధ్రులు దక్షిణాపథమునకు వచ్చి తెలుఁగుదేశమున నెలకొనినపిదప తెలుఁగు లాంధ్రులలోఁ గలిసి యాంధ్రులైనట్లే తెలుఁగుదేశ మాంధ్రదేశమైనది. ఆంధ్రరాజులు వారి శాసనములలో మాత్రమే ప్రాకృతము నవలంబించినను, నిత్యవ్యవహారమున నీ దేశీయభాషనే యవలంబించిరన్నచో భాషా విషయమునగూడ నీ యభిన్నత్వ మా కాలముననే యేర్పడిన దనవచ్చును. కాని కొందఱిటీవల తలంచినట్లుగా నాంధ్రరాజుల శాసనములలోని భాషయే యాంధ్రమనియు, దాని పరిణతరూపమే యిప్పటి మన తెలుఁగనియు నెంచినచో నీ విషయమింకను పరిశీలింపదగియుండును. అంతకుఁబూర్వము మాట యెటులున్నను నన్నయభట్టు కాలమునకు మాత్ర మీ రెంటికి నభిన్నత్వమేర్పడిన దనుట స్పష్టముగదా. నందంపూడి శాసనమున నీతఁడు నారాయణ భట్టు నాంధ్రభాషా కవీశ్వరుడని చెప్పుటయు, నీతనిని రాజరాజ నరేంద్రుడు భారతమును "దెనుఁగున రచియింపు" మనగా నీ నన్నయభట్టు తెనుంగునన్ మహాభారతసంహితా రచనబంధురుఁ డగుటయు నిందుకు నిదర్శనములు. తిక్కనయు నాంధ్రావళి మోదముం బొరయునట్లు "పదునేనింటి దెనుఁగుభాషనే" రచియించెను. నన్నయకు బూర్వమీ భాషను "తెనుఁగ"ను పేరుతో స్మరిం

చినవారెవరు నున్నట్లగపడదు. నన్నయయు నంతకుఁ బూర్వ మీ భాష స్థితిగతులను గూర్చి యేమియు తెలుపలేదు.

క్రీస్తు శకారంభమునుండియు నాంధ్రరాజుల కాలములో నీ మధ్య దేశమున ప్రాకృతభాషకే ప్రాధాన్యము కలుగుటచే దేశ భాషలు వెనుకబడిపోయినవి. క్రీ.శ.౪-వ శతాబ్దివఱకును ప్రాకృత భాష, బౌద్ధమతము నీ దేశమున విశేషవ్యాప్తి గాంచి యున్నవి. అటుపిమ్మట వైదిక మతమునను, సంస్కృత భాషకును ప్రభావము హెచ్చినది. కావుననే యీ దేశమున నైదవ శతాబ్ది నుండి బయలుదేరిన పల్లవ, శాలంకాయన, విష్ణుకుండిన రాజుల శాసనము లన్నియు సంస్కృత భాషారచితములేయై కనఁబడుచున్నవి. రాజాదరణయు సంస్కృత కవితకే. దేశ భాష, దేశి రచనలు సామాన్యజనుల నోళ్ళలో నిలిచినవే గాని, వానికి స్థిర రూపమును దాల్చుటకవకాశము కలుగలేదు.

ఈ స్థితి సుమారేడవ శతాబ్ది వఱకు సాగినది. కాని రాష్ట్రకూటులు చాళుక్యరాజులు దక్షిణాపథమున ప్రభుత్వము వహించినప్పటి నుండియు సంస్కృతభాష నాదరించినను దీని ప్రాబల్యము మూలమున దేశమున వెనుకఁబడి యుండిన దేశి కవితను లేవనెత్తి, దేశ భాషలలో గూడ తమ శాసనములను రచింప మొదలు పెట్టినారు. కన్నడ దేశమున సంస్కృత భాషాలంకార చ్ఛందస్సంప్రదాయముల ననుసరించిన మార్గ కవిత 8-వ శతాబ్దికే పొడసూపినది. 9-వశతాబ్దిలో రాష్ట్రకూటరాజుల ప్రోత్సాహమున కవిరాజ

"మార్గమే" యేర్పడినది. కాని యాంధ్రదేశమందు మాత్రము తూర్పు చాళుక్యరాజులు పలువురు "దేశి" కవితకే ప్రోత్సాహమిచ్చి దానిని తెనుఁగున నిలిపినారు.

ఇట్లీటీవల బయలుపడిన చాళుక్యరాజుల తెలుఁగు శాసనముల మూలముగా, రాజనరేంద్రుని ప్రోత్సాహముచే నన్నయ చేతనే సృష్టింపబడెనని కొందరచేఁ దలపబడుచుండిన తెలుఁగు భాషయొక్క ప్రాచీనత క్రీ.శ. ఏడవ శతాబ్ది ఆరంభమువఱకు బోవుచున్నది. అంతకుఁబూర్వము రెండుమూడు శతాబ్దములవఱకు గల శాసనములన్నియు సంస్కృతభాషలోను ఇంకను వెనుకటి శాసనములు ప్రాకృతభాషలోను రచింపబడి యుండుటచే నేడవ శతాబ్దికి బూర్వము తెనుఁగుభాషయొక్క స్థితిగతులను గూర్చి తెలిసికొనుట కాధారమేమియు గనబడుటలేదు. దాని యూరుపేరుల నెచ్చటను గానము. అవి రెండు నాంధ్రములోనే లీనమైపోయినట్లున్నవి. ఈ కాలమున శ్రీకాకుళమందలి తెల్గువల్లభుఁడు కూడ నాంధ్రవల్లభుఁడుగనే యణిగి మణిగి యుండెనే కాని, 16-వ శతాబ్దమున విజయనగర సామ్రాజ్యాధీశ్వరుఁడగు తెనుఁగు రాయలు తనను దర్శించువరకు "దేశంబు తెలుఁగేను తెలుఁగువల్లభుండ"నని తన నిజస్వరూపమును బ్రకటించుకొని "దేశభాషలందు దెలుఁగు లెస్స" యని చాటలేకపోయినాడు. కాని ఏడవ శతాబ్దికి బూర్వము తెలుఁగుదేశ మాంధ్రదేశమున లీనమైనదని చెప్పగలిగినట్లుగనే తెలుఁగుభాష ఆంధ్రమున లీనమైన

దని చెప్పగలుగుటకు పూర్వము అప్పటి ఆంధ్రభాషయొక్క స్వరూపమేదో మనము నిర్ణయింపవలసి యుండును. ఆంధ్రరాజుల శాసనములలోని ప్రాకృతభాషయే యా కాలపుటాంధ్ర మని తలంచినచో, నేడవ శతాబ్దమునాటి చాళుక్యరాజుల శాసనములలోని తెలుఁగు, ఆంధ్రరాజుల శాసనభాషయగు నా యాంధ్రమున లీనమైనదనికాని, యీ రెంటికి నభిన్నత్వ మేర్పడినదనికాని చెప్పుటకు వలనుపడదు. కాని యాంధ్రరాజు లాకాలమున దేశమందలి బౌద్ధమత ప్రాబల్యమువలన ప్రాకృతభాషకుఁ గలిగిన విశేషవ్యాప్తిని బట్టి దాని నీ కాలపు టింగ్లీషువలె రాజభాషగా గ్రహించి, వారికి దానియందుగల యభిమానముచే శాసనములను మాత్ర మా భాషలో రచించియుండిరేకాని ఆ కాలమున నాంధ్రదేశీయులగు జనులతోపాటు నిత్యవ్యవహార మంతయు దేశీయమగు తెనుఁగు బాసనే నడుపుచుండిరని తలంచినచో, తెలుఁగున కాంధ్రముతో నభిన్నత్వ మప్పటినుండియే కలిగెనని చెప్పవచ్చును. అనగా ఆంధ్రులీ దేశమునకువచ్చి యందల జనులతోఁగలిసి, వారి కాంధ్రత్వమును గలిగించినట్లే యీ దేశభాషను దాము చేబట్టి దాని కాంధ్రత్వము కలిగించినవారని చెప్పుట కవకాశము కలుగును. భరతుడు, కుమారిలభట్టు, హ్యూఎన్త్సాంగ్ మొదలగు వారీ యాంధ్రమును గూర్చి వారివారి కాలములఁ జెప్పినదానిని బట్టి చూడగా వారీ యాంధ్రమును ప్రాకృత భాషలకంటె భిన్నమైనట్లును, మ్లేచ్ఛభాషగాఁ గూడఁ బరిగణించినట్లును తెలియవచ్చుచునేయున్నది. కావున తెలుఁగున కాంధ్రముతో నభిన్నత్వము

గ్రహించినపుడు ఆంధ్రము ప్రాకృతమునకంటె భిన్నమనియే గ్రహింపవలయును. కావున తెలుఁగుభాషయొక్క ప్రాక్తన స్వరూపమును దెలిసికొని దాని చరిత్ర నింకను వెనుక కన్వేషింపవలె నన్నచో నాంధ్ర రాజుల ప్రాకృత శాసనములలోని భాష యీ విషయమున నిరుపయోగము కాకమానదు.

ఇక ప్రాచీనాంధ్రరాజులు తమ శాసనముల నుపయోగించిన ప్రాకృత భాషయే యీ దేశమున నా కాలమున నిత్యవ్యవహారములో నుండిన యాంధ్రభాష యని చెప్పువారు ఏడవశతాబ్దికి బూర్వమాంధ్రమున శాసనములేమియు గనఁబడకుండుటచే నా కాలమునందలి చాళుక్య శాసనములలోని తెలుగుభాష యా ప్రాకృతాంధ్రముయొక్క పరిణత రూపమే యనియు, తక్కిన ప్రాకృతములతోపాటు ఈ యాంధ్రము నార్యభాషాజన్యమగుటచే దెనుఁగు భాషకూడ నార్యభాషాజన్యమే యనఁదగుననియు వాదింతురు. కాని చాళుక్య శాసనములలోని తెలుఁగు ఆంధ్రరాజుల శాసనములలోని ప్రాకృతభాషతో నభిన్నమనికాని, తత్పరిణత రూపమనికాని, చెప్పుట యెంత యసమంజసముగాఁ గనబడునో వాని నించుక సరిపోల్చిచూచిన వారికి వ్యక్తము కాకపోదు.

## ఆంధ్రరాజులనాటి యమరావతీస్తూప శాసనము

"సిధం రనొ వాసిఠీపుతస సామిసిరిపులమావిస సవచ్ఛె దె....... పిండసుతరియాణం కహుతర గహపతిస పురిగహపతిసచపుతస ఇసిలస సభాతుకస సభగినికస నాకానికాయస

ప్రతకస భగవతో మహచెతియె చెతికియానం నాకా (య)స పరి గహె అపరదారె ధమచకం దెధమ్మం ఠాపిత."

ఇందలి శబ్దములేకాక విభక్తి ప్రత్యయములు, క్రియా రూపములు, వాక్య నిర్మాణపద్ధతి యంతయు సంస్కృత భాషకు ఛాయయే యనుట యీ క్రింది ఛాయవలన బోధపడగలదు.

"రాజ్ఞో వాశిష్ఠీ పుత్రస్య స్వామి శ్రీపులమావి(స్య) సంవత్సరే....ఇసిలశ్య (ఋషిలకస్య)సపుత్రకస్య, సభ్రాతృకస్య.... దేయధర్మచక్రం అపరద్వారే స్థాపితం."

క్రీ.శ. నాల్గవశతాబ్ది మధ్యభాగమున పల్లవరాజు శివస్కంద వర్మ కాంచీపురమునుండి చేసిన యాజ్ఞప్తి శాసనము ప్రాకృతము ననే కలదు:—

"కాంచీపురతో యువమహారాజో భారదాయస గొత్తో పలవానం సివఖందవమ్మో ధర్మఖడెవాపతం ఆనపయతి. అంధాపతీ యగామొ.........విరిపరం అంహేహి ఉదకాది నంపదతో. ఏతస గామస విరిపరస సవబంహదేయ పరిహారే వితరామ."

తరువాత నేడవశతాబ్దివరకు నాంధ్రదేశమును పాలించిన శాలంకాయనులు, విష్ణుకుండినులు మొదలగువారి శాసనము లన్నియు సంస్కృతభాషలోనే యున్నవి. 7-వ శతాబ్ది ప్రారంభమున చాళుక్యరాజగు జయసింహవల్లభుని శాసనముపై ప్రాకృతమునకు భిన్నమనియే చెప్పదగిన తెలుఁగులో నున్నది.

"జయసింఘువల్లభ మహారాజులాకున్ ప్రవర్ధమాన విజయ రాజ్య సంవత్సరంబుళ్ ఎణుంబొది అన్బెట్టి అమ్మఱ పూణ్ణమ నాణ్డుం ప్లావిండిరాజులముట్లు కలిముడిరాజుల్ ప్లావిండిసముద్ర రక్తై నాకు బణిసేసిన కల్చివీఱ రుఙ్ల మద్దికదు మూటికి విత్పత్తి ఉత్తరంబున పులొంబున చెఱువు పడు మాఱికోటఱ ఎణుంబొది పుట్లు ఆఙ్లపట్టుసేను తాఱుతోంట శాయు పడువారంబు ఇచ్చిరి."

ఇందలిభాషపై యాంధ్రరాజుల శాసనములోని భాషకంటె నెంతయు భిన్నమై ప్రాత తెనుఁగులక్షణముకలదై యున్నదనుటకు సందేహము లేదుకదా. కొన్ని తత్సమ శబ్దములు, సుబోధ్యము గాని ప్రాచీనరూపములు నున్నను, విభక్తి ప్రత్యయములు, శబ్ద స్వరూపము వర్ణక్రమము మొదలగునవన్నియు సంస్కృత ప్రాకృత భాషాపద్ధతినిగాక, యితర దక్షిణదేశ భాషాపద్ధతిని బోలినవై కనఁబడుచున్నవి. ప్రాకృతభాషల యపభ్రంశ రూపములనుండి క్రీ. శ. ౧౦, ౧౧-వ శతాబ్ద ప్రాంతములబయలుదేరిన వని చెప్పబడుచున్న ఉత్తర హిందూస్థాన భాషలలో సయితము సంస్కృతభాషా వ్యాకరణ పద్ధతులే నిలిచియుండుటనుబట్టి, యంతకు పెక్కు శతాబ్దములకుఁ బూర్వమే తద్భిన్నపద్ధతుల నను సరించి వృద్ధినొందియున్న యీ దక్షిణదేశభాషలు తజ్జన్యములే యనుట యసంభవమనక తప్పదు. కావున నాంధ్రరాజుల కాలముననే యీ దేశమునందలి యాంధ్రులు ఆ కాలపు ప్రాకృత శాసనములలోని భాషకంటె భిన్నమైన మఱియొక

తెలుఁగు భాషనే వ్యవహరించియుండిరని తలంచినగాని, తరువాతి చాళుక్యరాజుల శాసనములలోని తెలుఁగుభాష దాని పరిణతరూపమని చెప్పుట కవకాశమేర్పడదు.

దీనినిబట్టి 7-వ శతాబ్దమునాటి శాసనములలోని తెలుఁగు భాషయొక్క పూర్వ చరిత్ర నన్వేషించి తెలుసుకొనుట కంతకు పూర్వమున గల యాంధ్రరాజుల ప్రాకృత శాసనము లేమాత్రము తోడ్పడఁజాలవని విశదమగుచున్నది. కావున దీని పూర్వ చరిత్రమును, ప్రాచీన స్వరూపమును దెలిసికొనవలెనన్నచోఁ బరిసరములందున్న యితరదక్షిణదేశ భాషలలక్షణములతోసరిపోల్చియే చూడవలసియుండును.

క్రీ. శ. 7-వ శతాబ్దికి బూర్వము తెలుఁగు శాసనములు లేకున్నను, తెలుఁగు దేశమున బయలుదేరిన యా సంస్కృత ప్రాకృత శాసనములలోని నదులు, ఊళ్లు మొదలగువాని పేళ్లును కొన బిరుద నామములు నా కాలపు దేశభాషా స్వరూప చిహ్నములను వ్యక్తపఱచుటకుఁ దోడ్పడుచునే యున్నవి. నాగర లిపిలో వ్రాయబడిన కొన్ని సంస్కృత శాసనములలో తద్భాషా వర్ణసమామ్నాయమున లేని నూతన వర్ణములతోగూడిన దేశీయ శబ్దములను వ్రాయవలసి వచ్చినపుడు ఆశాసనములను జెక్కినవారు ఈ దేశీయ వర్ణములనే యా నాగర లిపి నడుమఁ జొనుపవలసిన వారగుటచే నా కాలమున సంస్కృత ప్రాకృత భాషాసంప్రదాయములకు భిన్నములగు సంప్రదాయములతోఁ గూడిన భాషలు దేశమున వ్యాప్తి జెందియున్నవనియే వ్యక్తమగుచున్నది. అట్టి శబ్దములే యీ దేశ

భాషల ప్రాచీన చరిత్రను సూచించునవై తదన్వేషణమున మనకు మిగులఁ దోడ్పడఁగలవు. ఇట్టివానిలోఁ గొన్నిటి నిచ్చట పరిశీలింతము.

పై ఆంధ్రరాజుల ప్రాకృత శాసనములలోఁ గానవచ్చు "నాగనిక" మొదలగు పేళ్లు ఆర్యులగు నాంధ్రజాతివారివి గాక, దేశీయులగు నాగజాతివేయై యుండుననుటకు సందేహము లేదు. అమరావతీ శాసనములలో నొక రాతిపై గానంబడు "నాగబు" శబ్దము కూడ ద్రావిడ భాషా సహజమగు "బు" వర్ణకముతోఁ గూడిన దేశ్య శబ్దమేయైయుండును. cf. త, పామ్బు, వేమ్బు, ఇరుంబు; తె. మరబు.

ఆంధ్రశాతవాహనుల తరువాత ఆంధ్రదేశములోని కృష్ణా గుంటూరుప్రాంత దేశమున ఇక్ష్వాకువంశీయులు పాలించిరి. వారిలో వాశిష్ఠీపుత్ర శాంతమూల అను నాతఁడు మొదటివాఁడు. ఈ శాంతమూలుని కుమారుఁడు వీరపురిసదత్తుఁడు. ఈతని రాజ్యకాలమున బయలుదేరిన నాగార్జునకొండ శాసనములలో నొకదానిలో శాంతమూలుని చెల్లెలు చాంతిసిరి మహాసేనాపతి, మహాతలవరుఁడగు ఖందసిరి భార్య యైనట్లు తెలుపఁబడినది. ఈ "మహాతలవర" శబ్దము "సేనాపతి" వలెనే యొక బిరుదు చిహ్నముగా గనఁబడుచున్నది. జైన గ్రంథములలో ౧౮ గణరాజులలో నీ మహాతలవరులు గూడ గ్రహింపఁబడుటచే నిది జైన సంప్రదాయ సిద్ధమైయుండునని తోచుచున్నది. జైనకల్ప సూత్రములో దీనినిట్లు నిర్వచించియున్నారు. "తలవరాః తుష్ట భూపాల ప్రదత్త పట్టబంధ

విభూషిత రాజస్థానీయాః" అని. కాని యీ శబ్దము స్వతస్సిద్ధముగ ద్రావిడభాషల లోనిదై జైనులలోనికి సంక్రమించియుండునని తలంపఁదగి యున్నది. తెలుఁగున "తలారి" శబ్ద మొకటి గ్రామ నాయకుఁడు, గ్రామమునందలి కాపలావాడు అనునర్థమున గలదు. ఇదే త, తలైయారి, కన్న, తళవర, తళవార అను రూపములపై యదార్థములనే కలదు. తమిళమున "తలైవన్" అనునది అధ్యక్షుడు, శాసకుడు. రాజు అను నర్థమున గూడ గలదు. దీని బహువచన రూపము "తలైవర్," ఐకారాంత శబ్దములు తెలుగున ఆకారాంతములగుట సహజము (తలై-తల, వలై-వల, మలై-మల), కావున "తలైవర్" అనునది తెలుఁగున 'తలవర' అగును. కావున పై తెలుగు దేశము నందలి ప్రాకృత శాసనములోని "తలవర" అనునది తెలుఁగు శబ్దమే కావచ్చును. అది యానాఁడొక బిరుద చిహ్నముగా ప్రాకృత భాషలో గ్రహింపఁబడి కాల క్రమమున గ్రామ రక్షకుఁడను నర్థమున వ్యవహరింపబడి యుండును. ఇక్ష్వాకులకు తరువాత వచ్చిన బృహత్ఫలాయన రాజగు జయవర్మ కొండముడి తామ్రశాసనములోఁ గూడ నీ "మహాతలవర" శబ్దము గానవచ్చుచున్నది. "మహాతలవరేన మహాదండ నాయకేన ఖాపహానవ మేత్రన కటతి" అని శాసనమును జెక్కించినవాని బిరుదముగానున్నది. ఇందు "కూడూరహారే గామం పాంటూరం బమ్మదేయందదామ" — కూడూరాహారమందలి పాంటూరను గ్రామమును బ్రహ్మదేయముగా నిచ్చి నట్లున్నది. కూడూరు, పాంటూరు తెలుఁగు దేశము లోని పేళ్లగుటయే కాక, యిందలి

"కూడూ" రనునది యిప్పటి మచిలీపట్టణ సమీపమునందలి "గూడూరే" యని తలంపఁబడుచున్నది. ప్రాచీన శబ్దములోని పదాదికకారము తెనుఁగున తరువాతి కాలమున గకారముగా మారు చుండుటనుబట్టి యీ దేశభాషాసంప్రదాయమున కీ శబ్దములు నిద ర్శనమగుచున్న వనవచ్చును (cf. కడప-గడప. త. కాల్, కాట్టు-తె. గాలి; త. కిళి-క. గిళి; త. కిణ్ణి-తె. గిన్నె).

బృహత్పలాయనుల తరువాత వేంగిపురమునుండి యాంధ్ర దేశము నేలిన శాలంకాయన రాజులలో మొదటివాడగు దేవవర్మ ఏళూర శాసనముకూడ ప్రాకృతభాషలోనే యున్నది. ఈతడు క్రీ. శ. నాల్గవశతాబ్ది పూర్వభాగమున నున్నవాడని చారిత్రకుల యభిప్రాయము. ఈ శాసనమునందు ప్రాచీన వేంగిపురమునకు సమీపముననున్న "ఏలూరు" అను గ్రామము "ఏళూరు" అను పేరుతోఁ గనఁబడుచున్నది. ఈ శబ్దములోని "ళ"కారము తరువాత "ల"కారముగా మాఱియుండును. ఇది ప్రాచీన ద్రావిడ శబ్దమగు "ఆళ్" అనునది (=govern, rule) ఏళు-ఏలు అని తెలుఁగులో మాఱినది. ఈ శాసనమునందలి రూపములో నీ తెలుఁగు శబ్దముయొక్క ప్రాచీనరూపము పొడసూపుచున్న దనవచ్చును.

ఇంక నీ శాసనములలోఁ గానవచ్చు నడతూరు, కాందు రూరు, విరిపర మొదలగు నూళ్ల పేళ్లు తెలుగుదేశము నందలి వానివే. "ఊరు" అనునది సంస్కృత "పుర"

శబ్దభవమని చెప్పుదురుగాని, అది దేశ్యమనుటయే సమంజసము. దక్షిణదేశభాషలన్నిటిలో నిది "ఊరు, ఊర్" అను రూపములతోఁ గనఁబడుచున్నది. హేమచంద్రుఁడు దీనిని దేశి శబ్దముగానే పఠించినాడుగదా. శివస్కందవర్మ శాసనములోని ఆంధ్రపథీయగ్రామమగు "విరిపరు" అనునదే తరువాతికాలమున "విప్పఱ్ఱు" అను గ్రామము. ఇందలి "పఱ్ఱు" అనునది ఆంధ్రదేశమునందలి యనేక గ్రామనామముల తుదిని గనఁబడుచున్నది. 6-వ శతాబ్దమునాటి సింహవర్మ "ఒంగోడు" శాసనమున "పెఱుకంబఱ్ఱు" అను గ్రామమును, రెండవ అమ్మరాజు మయిలపూండి శాసనమున "మల్కపఱ్ఱు" గ్రామమును పేర్కొనఁబడినవి. ఇట్లే యనేకములు గలవు. ఇందొక్క విశేషము. ప్రాచీనములగు ప్రాకృత శాసనములలో నీ "పఱు" శబ్దము రేఫముతోడనే వ్రాయఁబడియున్నది. కాని తరువాతికాలపు సంస్కృత శాసనములలో నీ గ్రామనామము వ్రాయవలసి వచ్చినపుడు ఇప్పటి తెలుఁగు లిపిలోని శకటరేఫమును బోలిన వర్ణమే నడుమఁ జొనుపఁబడుచువచ్చినది. ఇందుకు నిదర్శనము పై శివస్కందవర్మ ప్రాకృత శాసనములోని 'విరిపర' అను దానిలో రేఫమే వ్రాయఁబడియుండగా, ఈ గ్రామనామమే క్రీ. శ. ౭-వ శతాబ్దమునాటి రెండవ పులికేశి కొప్పరపు తామ్రశాసనములో "విపఱ్ఱు" అని శకట రేఫముతో వ్రాయబడియుండుటయే. ఈ రెండు శాసనములలో గ్రహింపబడిన యీ గ్రామ మొక్కటియే. విరిపరు-విపఱ్ఱు అయి తరువాతి కాలమున

"విప్పఱ్ఱు" అయినట్లున్నది. ప్రాకృత శాసనములలో శకటరేఫము వ్రాయు నాచారము లేదు.

కొన్ని గ్రామములో నీ "పఱ్ఱు"-"వఱ్ఱు, మఱ్ఱు" రూపములను బొందుటయుఁగలదు. (గొడవఱ్ఱు. పెనుమఱ్ఱు, పామఱ్ఱు, పోతుమఱ్ఱు మొ.) దీని యౌపవిభక్తిక రూపము పఱ్ఱి, మఱ్ఱి యగును. ఈ గ్రామనామములే కొందరి గృహ నామములైనప్పుడు గొడవఱ్ఱి, పెనుమఱ్ఱి, పామఱ్ఱి అను వాని యౌపవిభక్తి రూపములే వాడుకలోనికి వచ్చినవి. ఈ "పఱ్ఱు" అనునదే "పట్టు" అను రూపమునుగూడ బొందినది. (చెంగల్పట్టు మొదలగు వానిలో గాననగును.) ఈశకట రేఫము సంస్కృత ప్రాకృతాద్యార్యభాషలలో లేక దక్షిణ దేశభాషా సహజమగు నొక ప్రత్యేక వర్ణము. ద్విత్వమును బొందినపుడు, ట్ర-వలె రేఫసహిత టకారము వలె నుచ్చరింపఁబడును. ప్రాచీన ద్రావిడభాషలోని యీ యుచ్చారణ పద్ధతి యిప్పటికిని తమిళభాషలో నిలిచియున్నది. తెలుఁగున నీ సంప్రదాయము కొన్ని ప్రాచీన రూపములలోఁ గనఁబడుచున్నను, ప్రస్తుతమది ద్విర్భావము నొందిన రేఫముగానే యుచ్చరింపఁ బడుచున్నది. పఱ్ఱు—పట్ర్రు పట్టు అయినట్లే, చిఱు-చిఱ్ఱు—చిట్ర్రు-చిట్టి; వఱు-వట్ర్రు-వట్టిపోవు—వఱు వట్లు; మిఱు, మిట్టి చూచు-మిఱుమిట్లు; మూఱు—మాట్ర్రు—మాట ఈ మొదలగు రూపము లేర్పడినవి. ఇట్ల నేకములగు తెలుఁగు శబ్దములలోని "ట" కారము ప్రాచీనరూపములలోని "ఱ" కారమునుండి యేర్పడినదే యైయుండును. ఇంక ననేకములగు ప్రాచీన శాసనములలో నీ శకట

రేఫము కనఁబడుచునే యున్నది.

ఈ శకటరేఫమువలెనే ద్రావిడభాషా సహజమై సంస్కృత ప్రాకృతములలోలేని మఱియొక వింత యక్షరము "ఱ" అనునది. ఇది ప్రాచీన సంస్కృత శాసనములలోని దేశ్యపదములలోఁ గన బడుచున్నది. ఇదియొక విలక్షణమైన యుచ్చారణము కలదగుటచే ద్రావిడభాషలలోనే యొకవింత యక్షరముగాఁ బరిగణింపబడుటయే కాక ఆయా భాషలలో భిన్నరూపములను బొందియున్నది. ప్రస్తుత కాలమున నిది తమిళ మళయాళములందు మాత్రమే వ్యవహార మందున్నను కన్నడభాషలో ౧౩-వ శతాబ్దివరకును, తెనుఁగున ౧౦-వ శతాబ్దివరకును వ్యవహారమున నుండెను. ఇటీవలి కాలమున నీవర్ణ మీభాషలలో శకారముగానో, డకారముగానో, రేఫముగానో మాఱుచువచ్చినది. క్రీ. శ. ౪-వ శతాబ్ది ప్రాంతమునందలి ఆనందమహర్షి వంశ సంభూతుడగు అత్తివర్మ గోరంట్ల తామ్ర శాసనమున కృష్ణబేణ్ణా దక్షిణ కూలమునందలి "తాన్టికొన్ట" గ్రామములోని అష్టశత పట్టికాక్షేత్రము కోటిశర్మ యను బ్రాహ్మ ణునకు దానము చేసినట్లు కలదు. ఇందలి "తాన్టికొన్ట" అను గ్రామము తరువాత "తాడికొండ" యయినట్లగపడుచున్నది. ఇందలి "తాన్టి" తెలుఁగునందలి "తాడిచెట్టు" అను శబ్దములోని తాడి శబ్దముయొక్క ప్రాచీన రూపము. ఇది సంస్కృత "తాళ" శబ్దభవమని చెప్పుదురుగాని, తమిళమున నతి ప్రాచీన కాలమునుండి యిప్పటివఱకు "ఱ" కారమును వింత

యక్షరముతోఁ గూడిన "తాఱి" శబ్దమే కనబడుచుండుట చేతను, తెలుఁగు దేశమునందలి ప్రాచీన సంస్కృత శాసనములలో గూడ గ్రామ నామములలో వచ్చిన యీ శబ్దము "తాన్టి" అని "ఱ" కార సహితముగా దేశీయమగు లిపిలోనే వ్రాయబడి యుండుటను బట్టియు నిది దక్షిణదేశ భాషా సహజమగు శబ్దమే యని దలంప నగును. ప్రాచీన ద్రావిడ భాషలోని యీ "ఴ" కారమే తెలుఁగు కన్నడములలో వరుసగా డకార ళకారములుగా మాఱినదనుట కనేక నిదర్శనములు గలవు. cf. త, కోఴి_తె, కోడి, కన్న, కోళి; త, చోఴ_తె, చోడ, కన్న. చోళ; త, పఴం_తె, పండు_కన్న, పళం; త. ఏఴు_తె, ఏడు, క, ఏళ్; త. నెఴల్_తె, నీడ, క. నీళల్; త, చుఴి_తె, సుడి, క. సుళి మొ.

"తాఱి" శబ్ద మా ప్రాచీన రూపముననే 7_వ శతాబ్దము నాటి పై జయసింహవల్లభుని తెలుఁగు శాసనమును "తాఱి తోంట" అను శబ్దమున గానవచ్చుచున్నది. ఆ "తాఱితోంట" యే యిటీవల "తాడితోఁట" యయినది. క్రీ. శ. ౬౬౦ నాటి మొదటి విక్రమాదిత్యుని తలమంచి శాసనమున कोऌ चुंकोन्त्र ग्रामस्योत्तरपार्श्वे అని "కొఱ్ చుం కొన్త" అను గ్రామము పేర్కొనఁ బడినది. "కొన్త" శబ్దము ప్రాచీన ద్రావిడ భాషలోని "కున్ఱు" శబ్ద భవము, త. కున్ఱు, తెలుఁగు కన్నడములలో (కొన్త) "కొండ" అను రూపమును బొందినది. కాని "కొఱ్చుంకొండ" ఇప్పు డే గ్రామముగా మాఱినదో తెలియదు. మొదటి విష్ణువర్ధనుని తిమ్మా పురము శాసనములో "पऌ कि विषये कुम्तुल्लर नामग्रामे" అని "పఱకి"

విషయ మొకటి పేర్కొనబడినది. విష్ణుకుండిన వంశీయుఁడగు రెండవ విక్రమేంద్రవర్మ చిక్కుళ్ల శాసనములో (క్రీ. శ. 700 "విజయతెందుళూర వాసకాత్.... రేగోన్ణం నామ గ్రామం దత్తం" అని 'తెందుళూరు', "రేగోన్ణం" అను ఊళ్ల పేర్కొనఁబడినవి. ఈ 'తెఁదుళూరు' ఇప్పటి యేలూరు ప్రాంతమందలి దెందులూరే కావచ్చును. దీనికి "డెందులూరు" పూర్వరూపము. పల్లవ విష్ణుగోపవర్మ చూరశాసనములో అగుబంఱు( = అగుంబఱ్ఱు?) మేటితాప, అను గ్రామముల పేళ్లను గలవు.

ద్రావిడ భాషలకు విలక్షణములగు నీ వింత యక్షరములే గాక, విష్ణుకుండిన వంశీయుడగు విక్రమేంద్రవర్మ చిక్కుళ్ల శాసనములో "విజయరాజ్య సంవత్సరంబుళ్" అను "బు" వర్ణాంత శబ్దముపై "ళ్" అను బహువచన ప్రత్యయము చేర్పఁబడిన రూపమొకటి కనబడుఁచున్నది. ఇది తమిళ కన్నడాది భాషలలోని 'గళ్' ప్రత్యయమునకు సంబంధించినది గాని సంస్కృత భాషా రూపముల నుండి యేర్పడినది కాదు. ఆ కాలమునకు ప్రాకృతములలో బహుత్వసూచకముగ 'లోగ్' వాడుకలోనికైనను రాలేదు. దీనిని బట్టి తమిళము కన్నడము తెలుఁగు నాయా దేశములం దింతకు పూర్వము చిరకాలము నుండియు నెలకొనియే యున్నవని తెలియుచున్నది. తమిళమున క్రీ. శ. ప్రారంభమునాటికే వాఙ్మయము - భాషాలక్షణము, ఛందస్సాహిత్యలక్షణము బయలుదేరుటకు బాహ్యావరోధములేమియు గలుగలేదు. కాని మధ్యభాగముననున్న తెలుఁగు కన్నడ దేశములు (అనగా దక్షిణాపథము, నాంధ్రపథమును)

ఆర్యజన సంఘము నుండి విడిపోయి వచ్చిన యాంధ్రుల ప్రజాపత్యమునకును, ఆధిపత్యమునకును లోనగుటయే గాక, ఆ యార్యాంధ్రులీ దేశమున ననగా కృష్ణా గోదావరీ మధ్య దేశమగు తెలుగు దేశమున స్థిర నివాస మేర్పరచుకొని యచ్చటి తెలుఁగు జనులతోఁ గలిసిపోయి, వారితో నేకీభావము నొందిన యచిర కాలముననే సామ్రాజ్య స్థాపకులు నగుటచే, నిచ్చటి తెలుఁగు వారు నాంధ్రులై ప్రఖ్యాతిగాంచినను వారి దేశ భాషా సాహిత్యములు మాత్రము వెనుకఁబడిపోవుట తటస్థించినది.

ఇట్లు దేశీయంబగు తెలుఁగుభాషయొక్కయు నందలి జనులగు తెలుఁగువారి యొక్కయు నామరూపములే అడుగంటి ఆర్యాంధ్రుల సామ్రాజ్య భానూదయముతో పాటు, ప్రాకృత భాషా సాహిత్య దీధితులే యీ దేశమున వ్యాప్తిగాంచ దొండంగినవి. ఆంధ్రభానుని బౌద్ధమత కాషాయకాంతులు ప్రసరింపదొడంగినంతనే అంతకు పూర్వము దేశీయ నభోభాగమున మినుకు మినుకు మనుచున్న దేశ భాషా నక్షత్రకాంతు లంతరించి, దేశీయుల కళాచాతుర్యము భాషా సాహిత్యరంగమునఁ బ్రసరింపక, శిల్ప కళా వైభవ రూపమున వ్యక్తము కాఁజొచ్చినది. క్రీస్తుశకారంభమునాటి మధ్య దేశపుస్థితి యిది. దక్షిణదేశ భాగమున విదేశీయ జన, భాషా మత ప్రాబల్యమంతగా లేకపోవుటచే నచ్చట దేశీయభాషా కవితా కళా ప్రాదుర్భావమున కంతరాయము కలుగ లేదు. మధ్య దేశమునకు మహాసామ్రాజ్యానుభవ సంపత్తి కలిగినను, స్వీయ భాషా

సాహిత్యకళాభిచ్యుతికూడ సంభవించినది. ప్రాకృతము దేశభాష నణగ ద్రొక్కి రాజభాషయై శాసనములలోని కెక్కె. దేశభాషా పరిణామమును క్రొత్తమార్గమును ద్రొక్కించినది. దేశమున నెల కొన్న బౌద్ధమతమునెడల దేశీయుల కాదరాభిమానములు మిక్కుట ములే యైయున్నను, వానిని వ్యక్తపరచుటకు స్వీయభాష నుపయో గించి కవితాకళను పెంపొందింపక దానికి రాజాశ్రయము పోషణము లేకుండుటచే శిల్పకళ మూలముగా దమ యాదరాభిమానములను వ్యక్తము చేసినారు. అమరావతీ నాగార్జునకొండ బౌద్ధ శిల్పములే ఆ కాలమునందలి యాంధ్రదేశీయుల కళా వైదగ్ధ్యము నిప్పటికిని దేశాంతరములందుగూడ చాటుచున్నవి. ఆంధ్ర సామ్రాజ్యము నశిం చిన వెనుకగూడ భాషా మత ప్రాబల్యమును బట్టి యీ పరిస్థితులే వెలసినను, తరువాత సంస్కృతభాషా సాహిత్యముల ప్రభావముచే దేశీయ సాహిత్యమున కవలంబనము లేకనే పోయినది. బౌద్ధ యుగము నందలి ప్రాకృత శాసనములలో వలెనే క్రీ. శ. 5-వ శతాబ్దినుండియు గానవచ్చెడి యాంధ్రదేశపు రాజుల సంస్కృత భాషా విరచిత శాసనములలోను గ్రామ నామములు - దేశీయంబగు తెలుగుభాషకు సంబంధించినవేయై, తక్కిన దక్షిణదేశ భాషాపదము లతో సజాతీయములుగనే కనబడుచున్నవి. ఈ శాసనములలో సంస్కృతా ద్యార్య భాషా సంప్రదాయములకు విలక్షణములగు ధ్వనులు రూపములు కలిగిన యీ శబ్దములను బట్టియే యీదేశీయ భాషా వ్యాప్తి వ్యక్తమగుచున్నది. క్రీ. శ. 7-వ శతా

బ్దిని చాళుక్య రాజుల యాదరణమును బడసినపిదప గాని దేశభాష యగు తెలుఁగు శాసనములలోని కెక్కఁగలిగిన గౌరవమును బొంద లేదు. కన్నడభాషలో నింతకుఁబూర్వమే, 5-వ శతాబ్దికే హాలిమిడి శాసనములవంటి శాసనములు గలవు. 9-వ శతాబ్దినాటికి గాని చాళుక్యుల శాసనములలోనికిఁ దెలుఁగున పద్యము లెక్కుట తట స్థించినదికాదు. అంతకుఁబూర్వమునను దేశి కవిత చాలవరకు పాటలరూపమున నుండి యుండును. ఇది కొంత సంస్కారమును బొందిననేగాని పద్యరూపమున శాసనములలోని కెక్కు నర్హత దానికి రాలేదు. ఈ శాసనములను రచించినది సామాన్యముగా చాళుక్యరాజుల యాస్థానమునందలి పండితులే యగుటచే వారే యీ సంస్కారమును జరుపవలసినవారై యుందురు. అట్టివారు మార్గ పక్కి నవలంబించుటలో నాశ్చర్యములేదు. అయినను చాళుక్య రాజులకు దేశి కవితయందుఁగల యాదరమే వీరిని సంస్కృత వృత్తావలంబనమునుండి మరల్చి పాటలరూపముననున్న దేశి రచ నలను, గొన్నిటిని సంస్కరించి పద్యరూపము నొందింపఁ బ్రోత్స హించియుండును. అట్టి సంస్కారఫలితమే మనకు క్రీ.శ.తొమ్మిదవ శతాబ్దిని పాండురంగని అద్దంకి శాసనములోఁ గానవచ్చెడి మొదటి శాసనపద్యమగు తరువోజ. ఇది ద్విపద రెండుపాదముల నొకపాద ముగాఁజేసి, యట్టి నాల్గుపాదములను ప్రాసబద్ధములుగాజేసి కూర్చిన పద్యము. దేశీయంబగు ద్విపదరచన నాలుగుపాదములుగల తరు వోజ వృత్తముగాఁ గూర్పబడుటచేతనే దీనికి మార్గకవితా వాసన

కొంత గలిగినదని స్పష్టమగుచున్నది. కాని కన్నడమునవలె సంస్కృత వృత్తములే తెలుఁగు శాసనములలోని కింక నెక్కకుండుట యొక విశేషమే.

తెలుఁగు శాసనములలోమాత్రము నన్నయకుఁ బూర్వమున, దేశీయ చ్ఛందమున రచింపఁబడినవేగాని సంస్కృత చ్ఛందోరీతిని రచింపఁబడిన వృత్తము లింతవరకు గానరాలేదు. 9-వ శతాబ్దిని "ద్విపద" వృత్తరూపమునొంది తరువోజయై శాసనమునకెక్కినదన్నచో నంతకుఁబూర్వము చిరకాలమునుండియు నీ ద్విపద దేశమున ప్రచారమందుండి యుండవలయునుగదా. దీనితోపాటు దేశీయ చ్ఛందో రీతిని మాత్రాగణబద్ధములై జాత్యుప జాతి వర్గములోఁ జేర్పబడిన సీసగీతములు చాళుక్యభీజముని శాసనములలోను మధ్యాక్కరలు యుద్ధమల్లుని బెజవాడ శాసనములోను నన్నయకుఁ బూర్వమునగల శాసనములలోఁ గానవచ్చుచున్నవి. ఇవియు ద్విపదవలెనే దేశమున పాటలరూపమున వ్యాప్తిలో నుండి యుండును. ఇవి సంస్కృత చ్ఛందమునుండి కల్పింపబడినవైననుకావు. తాళానుకూలములగు మాత్రాగణములతోఁ గూర్పబడినవే. ఇవి చిరకాలమునుండి దేశమున వ్యాప్తి గాంచి యుండినగాని, పండితుల దృష్టిలోనికెక్కి శాసనములలోనికెక్కుట తటస్థింపదు. ఇట్టి గణములతోనే గూడిన అక్కర, గీతికె, ద్విపద, రగళె మొదలగు పాటలు పద్యములు కన్నడభాషలోఁ గూడ నుండినట్లు 10-వ శతాబ్ది నాగవర్మ ఛందోంబుధినిబట్టి తెలియుచున్నదిగదా. వీనిని తమిళభాషా పద్యముల లక్షణముతోఁ

బోల్చి చూచినచో వీనికిఁ గల సన్నిహిత సంబంధము కూడ బోధ పడగలదు.

ద్విపదను తరువోజ వృత్తముగా మార్చుటలో మార్గ ఫక్కి ననుసరించిన సంస్కృత పండితుల సంస్కారమించుక కన బడుచునే యున్నదని యిదివరకే యూహించినాముగదా. ద్విపద యనునది-మూడింద్రగణములు ఒక సూర్యగణము అను 4 గణ ములతోఁగూడిన రెండుపాదములుగలది. అనగా నాలుగేసి మాత్రలుగల, నాలుగు గణములను జేర్చి, తుది నొకమాత్ర తగ్గిం చినచో, ద్విపదకొక పాదమగునన్నమాట. నాలుగు మాత్రల నాలుగు గణములు-అట్లే ఉంటే-మధుర గతి రగడ అగుచున్నది. అనఁగా దేశీయములగు పెక్కు రచనలు 4 గేసి, 3 దేసి గణము లతోఁ గూడిన పాదములు గలవిగానే కనఁబడును. పాదమునకు 4 గేసి గణములుగల ద్విపద రెండుపాదములు నొక పాదముగాఁ జేరి తరువోజ వృత్తమేర్పడఁగా ద్విపద- ఒక్కొక్క పాదముల లోవి మూడేసి ఇంద్రగణములను-ఒక సూర్యగణమును-ఒక్కచో జేర్చినచో అనగా 6 ఇంద్రగణముల తరువాత రెండు సూర్య గణ ములను జేర్చినచో నొక సీసపద్యపాదమగును. ద్విపద పాదము లనే యించుక మార్చి యొక్కపాదముగాఁ గూర్చి అట్టి నాలుగు పాదములనొకచోఁ గూర్చినచో సీసపద్యమగుచున్నదన్నమాట. ఇట్లవి నాలుగేసి గణములుగల పాదములతోఁగూడిన దేశీయ రచన వినుమడించుటచే గల్గినవి. గీత పాదమునకు రెండు సూర్యగణ ములు, రెండింద్రగణములు, నొక సూర్యగణము కలసి యైదు గణములు. దీనికి సీసమునకును ప్రాసనియమము కూడ లేక

పోవుటచే నివి యుపజాతులైనవి.

ఇఁక మధ్యాక్కరకు లాక్షణికులు చెప్పిన లక్షణమును బట్టియే మూడు గణములుగల పాదము నినుమడించుటచే నేర్పడినదని స్పష్టమగుచున్నది. ద్విపదలోని మూడింద్రగణములు నొక సూర్యగణమును జేర్చి రెట్టించిన తరువోజయైనట్లే రెండింద్రగణములను ఒక సూర్య గణమును జేర్చి దాని నినుమడించిన మధ్యాక్కర పాదమగుచున్నది. దీనినిబట్టి చూడగాఁ దొలుత మూడేసి నాలుగేసి గణములుగల పాదములతోఁ గూడిన పద్యములే యీ దేశికవిత్వమున నుండెడివని తోచుచున్నది. అట్టివాని రెండు పాదముల నొక పాదముగాఁజేసి, తరువాతివారు దేశి వృత్తముల గూర్చి యుందురు. తమిళమున మూడేసి గణములతోఁ గూడిన పాదములుగల పద్యము లుండనే యున్నవి. వానిని "చిందడి" అని ఆ భాషలోఁ జెప్పుదురు. "అగవల్" పాదమునకు నాలుగేసి గణము లుండును.

ఇట్టి తెలుగు దేశమందలి "దేశి" రచనలు- సంస్కృత పండితుల సంస్కారమునకుఁ గొంతలోనైనను వాని పూర్వస్వరూపమును గుర్తించుటకుఁ గొంత యవకాశము లభించుచుండుటచేతను, ఇట్టివి తమిళ కన్నడ భాషలయందలి దేశీయ రచనలతోఁ బోల్పఁదగియుండుట చేతను, ఇవియన్నియు మాత్రాగణ బద్ధములేయై, సంస్కృత వృత్తములవలె నక్షర గణబద్ధములు కాకుండుట చేతను, పరస్పర సన్నిహిత సంబంధము సామ్యము

గలవగుటయేగాక సజాతీయ సహజ సంప్రదాయ బద్ధములు గూడ కాకమానవని తలంపఁదగియున్నది. ఇట్టి దేశి రచనలతోఁ గూడిన యీ భాష క్రీస్తు శకారంభముననే యీ దక్షిణాపథమున వ్యాప్తి గాంచియున్నను, ఈ తెలుగుదేశ ముత్తరదేశీయులగు నార్యాంధ్రులకు వలసభూమియగుటచే నీదేశ మాంధ్రదేశమై భాష యాంధ్రమై, తెలుఁగుబాష పేరు కొంతకాలము మరచిపోబడినట్లే యీ "దేశి" రచనలును దేశమునఁ గొంతకాలమువరకు మరచిపోబడుట తటస్థించినది.

నన్నయకుఁ బూర్వమున నాతని భారతమువంటి యుద్గ్రంథములొకవేళ లేకుండినను, జనబాహుళ్యమున వ్యాప్తి గాంచియుండిన దేశిరచనలు లేకపోవు. నన్నయ భారత రచనముఁగావించిన పిదప నట్టివానినాదరించువా రెవ్వరు? అవి గ్రంథస్థములగు టెట్లు? కావున ననయయే ఆంధ్రభాషా వాఙ్మయములకు సృష్టికర్తయను భావములుగూడ ప్రబలుట తటస్థించినది. ఇటీవలి కాలమున నన్నయకుఁ బూర్వము నందలి చాళుక్య రాజుల శాసనములు ప్రకటింపబడునంత వరకుఁ దెనుఁగున దేశీయచ్ఛందమున రచింపఁబడిన కొన్ని పద్యములైనను గలవనిగాని, దేశి సారస్వత మనునదొకటి యుండియుండుననిగాని, యూహించుటకైన వీలులేకపోయినది. నన్నయయే యాదికవియైనాఁడు. అతఁడు తెనుఁగున రచించిన ఆంధ్రభారతమే ఆదిగ్రంథముగా బరిగణింపఁబడజొచ్చినది.



# V

# ఛందస్సాహితీ రీతులు

ఆంధ్రభాషా సారస్వతము నన్నయ భట్టారకుని భారత రచనతోడనే ప్రారంభించినట్లు సామాన్యముగాఁ దలంపబడుచున్నది గదా. అతనికిఁ బూర్వకాలమున రచింపబడిన గ్రంథమేదియు లభింపక పోవుటయే దీనికి ముఖ్య కారణ మైనదనుట నిశ్చయమే కాని, యట్టి యుద్గ్రంథ మీ భాషలో రచింపఁబడుటకుఁ బూర్వ మీ దేశములో నెట్టి సాహిత్యసంచలనము కలుగనిది భాష యెట్టి సంస్కారమును బొందనిది, దానిలో నెట్టి కవితాసంప్రదాయములును నిరూఢి గాంచనిది, యట్టి గ్రంథము రచింపబడుట సాధ్యము కాదుగదా. భాషాసంప్రదాయములు సాహిత్య సంప్రదాయములు నొక్కసారిగా నొక్కరిచే సృష్టింపఁబడునవి కావు. దేశ కాల స్థితిగతులను బట్టి యొక ప్రతిభావంతుఁడు భాషా కవితా సంప్రదాయములలోఁ గొన్ని మార్పులను బ్రవేశపెట్టవచ్చును. నూతన మార్గములను దీయవచ్చును. కాని భాషాసారస్వతముల నొక్కసారిగా సృష్టింపలేఁడు. కావున నన్నయ భట్టారకుఁ డాంధ్ర షలో నట్టి యుద్గ్రంథమును రచించినప్పటి కీ దేశమునఁగల భాషా సాహిత్య పరిస్థితు లెట్టివో కొంతవర కిదివరకే పరిశీలించి యున్నాము. ఇంకను తద్రచనకుఁ ద్రోవఁజూపిన ఛందస్సాహిత్యరీతుల పరిణామ మెట్టిదో, వాని నాతఁ డెట్లు గ్రహించి సమన్వయించుకొనెనో మనము పరిశీలించి తెలిసికొనవలసియున్నది.

నన్నయకుఁ బూర్వ మాంధ్రభాషా వాఙ్మయ ప్రపంచ మంధకారబంధురమే కదా. తరువాతి వాఙ్మయ జ్యోతి వెలుగునఁ గొంతవరకు తడవులాడవచ్చునేమో ! ఆంధ్రభాషా రచిత శాసన రూపములగు నుషఃకాంతుల జాడలు మఱికొంత దూరము వరకును మనకు మార్గదర్శులు కాఁగలవు. ఇంకను వెనుకకుఁ బోవలయునన్న చిమ్మచీకటిలో తడవులాటయే ఇచ్చట నితర సన్నిహిత భాషా వాఙ్మయ పరిణామ పద్ధతుల జాడలు తప్ప నితరాధారము లేదు.

బాగుగా పరిశీలించినచో నీ దక్షిణదేశమందు భాషాపరిణామ మనకువలెనే, తద్భాషా సాహిత్య పరిణామమునకును మూల బీజము లొక్కటే యనఁదగినట్లగపడుచున్నది. ఇవి భిన్నప్రదేశముల, భిన్నములగు పరిసర పరిస్థితులలోఁ బెంపొందిన వగుటచే భిన్నజాతి వృక్షములుగఁ గనబడుచుండెనేకాని వాస్తవముగ నట్టివి కావు. ఈ భాష కన్నిటికిని మూలములగు ప్రధాన బీజములును దక్షిణదేశీయమగు నొక్క ప్రాచీన భాషా వృక్షమునుండి యేర్పడినవే యని యెట్లు తలంపబడుచున్నదో, అట్లే యీ భాషాసాహిత్యముల కన్నిటికిని సమానములగు మూలబీజము లా ప్రాచీన భాషా సాహిత్యమునకు జెందినవే యని తలఁపనగును. నారుగాఁ బోసిన బీజము లొక జాతివేయైనను, అవి నాటబడిన ప్రదేశముల సారమునుబట్టియు నచ్చటి శీతోష్ణస్థితులు, చేయబడిన దోహదము, నీటి సౌకర్యములు, సంరక్షణ మొదలగువానిలోఁగల భేదమును బట్టియు

భిన్న రీతులవృద్ధి నొందినవై వేరువేరు రుచులు గల ఫలముల నిచ్చుచుండుననుట మన కనుభవసిద్ధమేకదా. ఒకటి ముందుగా ఫలించుట, మఱియొకటి యాలస్యముగాఁ గాపునకు వచ్చుట సంభవించుచుండును. ఫలములు రుచిలోనేకాక యాకారమున గూడ భిన్నములై యుండును. ఒక చెట్టును మఱియొకదానితో నంట(టు) గట్టుట తటస్థించినచో నాయంటు విజాతీయములు, రుచ్యతరములు నగు ఫలముల నిచ్చుచుండును. ఈ సామ్యము దక్షిణదేశ భాషా సాహిత్యములపట్ల నన్వయించినచో వాని సామ్య భేదములకుఁగల కారణములు వ్యక్తము కాకపోవు.

ఆంధ్రభాషాసాహితీ వృక్షమువలన మనము పడయఁ గలిగిన తొలిఫలము క్రీ. శ. ౧౧ - వ శతాబ్ది దగుటచే తమిళ కన్నడ భాషావృక్షములకంటె నిది మిగుల నాలస్యముగా ఫలించినదని చెప్పవలసియుండును. కాని ఈ యాలస్యమునకుఁ గారణము లేకపోలేదు. ఇది సంస్కృతభాషా సాహిత్య శాఖతో నంటగట్టబడిన పిదప నది మన కొసంగిన మహాస్వాదు ఫలము. అంతకుపూర్వ మీ వృక్ష మెట్లు పెరిగి యెట్టి ఫలముల నిచ్చుచువచ్చినదో మన కిప్పుడు తెలియుటలేదు. బహుశః సంస్కృత సాహితీశాఖతో నంటగట్టబడిన పిదప నీ వృక్షపు టితరశాఖల యేపు తగ్గిపోయి యవి నశించియుండును. లేదా రుచ్యతరములగు నీ నూతనశాఖా ఫలముల పంట యధికమగుటకుగా తొలి ప్రాని శాఖ లొకప్పుడు ఖండింపబడుటయుఁ దటస్థింపవచ్చును. కాని యొకప్పు డీప్రాత

మాను కొమ్మలను దొడిగి చిగిర్చి పూచి కాచి ఫలించినను ఫలింపవచ్చును. ఇందు నూతన శాఖాసారము కొంత చేరుటయు గలదు. ఎట్లయినను వాని స్వరూపలక్షణము లితర సన్నిహిత భాషాసాహితీ ఫలములతో బోల్చి చూచిననే కాని సుబోధములు కావు. వాని పరిణామక్రమమును దెలిసికొనలేము.

నన్నయకుఁ బూర్వమునగల యాంధ్రసారస్వత స్వరూప లక్షణములనుగూర్చి సూచింపఁగల సాధనములలో నన్నయాది కవుల గ్రంథములే యొక విధమగు సాధనము కావచ్చును. ఏల యనగా, కన్నడమున తొలి గ్రంథముగా గ్రహింపఁబడిన కవి రాజమార్గ మా భాషలోని గద్యపద్య కావ్యరచయితల నామములను గూర్చియు, పద్యకావ్యములలోని భేదములు, వాని లక్షణములను గూర్చియు బ్రశంసించుటచే నంతకుఁ జిరపూర్వమే భిన్నరీతులు గల కవితాశాఖలు కన్నడభాషలో వెలసియుండెనని తెల్లమగు చున్నది. తెనుఁగులో నన్నపార్యుని గ్రంథమున నట్టి విషయము లేమియు గానవచ్చుటలేదు. పైగా తరువాతి తెలుఁగు కవులలోఁ బెక్కండ్రు అతనిని ఆంధ్రభాషావాగనుశాసనుడు, అజ్ఞాసనకల్పుడు అను నిట్టి విశేషణములతోఁ బ్రశంసించియుండుటచే నీతఁడే యాంధ్రభాష ననుశాసించి అందు కవితను సృష్టించినాడను భావము ప్రబలుట కవకాశముగలిగినది. పౌరాణిక బ్రాహ్మణ మతాభిమాన ప్రోద్బలకములగు పురాణేతిహాసములను, నన్న పార్యుడు చూపినమార్గమునే యభిమానించి యనువదించిన తరువాత తెలుఁగు కవుల మూలముగా వ్యాప్తిగాంచిన భావమేకాని యిది

మతియొకటి కాదు. ఏలయనగా, నన్నయకుఁ దరువాత నొకటిరెండు శతాబ్దములలోఁగల శైవకవులెవ్వరు నీతని పేరైన నెత్తినవారుకారు. భిన్న మతాభినివేశముచేతనే శివకవులు భవికవుల పేళ్లెత్తకుండిరనియుఁ జెప్పవచ్చును. కాని మతాభినివేశముచేతగాని, మతప్రచారముకొరకుగాని వారవలంబించిన పద్ధతులు, వ్రాసిన వ్రాతలు నన్నయకుఁ బూర్వమునుండియు వచ్చుచుండిన ప్రాచీనాంధ్ర కవితారీతులను, సంప్రదాయలనే గొంతవరకైన సూచించుచున్నవనక తప్పదు. ఇట్టి రీతులు, సంప్రదాయములును ప్రధానముగా మనకు పాల్కురికి సోమనాథుని రచనలనుబట్టి కొన్ని తెలియవచ్చుచున్నవి. నన్నపార్యునితరువాత సుమారు రెండు శతాబ్దముల కాలములో నున్నవాఁడగుటచేతను, నన్నయాది శిష్టకవులవలంబించిన తత్సమభూయిష్ఠమగు పురాణ కవితామార్గమునుగాక సర్వసామాన్యమగు జానుతెనుఁగున దేశీయమగు ద్విపద కవితారచన ననుసరించినవాఁడగుటచేతను నాతనిచేఁ బేర్కొనబడిన కవితారీతులు, కావ్యభేదములు మొదలగునవి నన్నయ కవితాపద్ధతికంటె ప్రాచీనములును భిన్నములునగు పురాతనాంధ్రదేశ కవితారీతులే యని మనము తలంపవచ్చును. మత విషయమునఁ గలిగిన భేదమును బురస్కరించుకొనియే భాషావిషయమునను, కవితారీతుల విషయమునను గూడ నితఁడు భిన్నమార్గమును ద్రొక్కెననుటకు సందేహములేదు. శిష్టకవులచే నిరసింపబడినను ప్రాచీనకాలముననుండియు, జన సామాన్యమున కనువైయుండి వారిచే నాదరింపబడుచుండిన కవితామార్గములనే చేపట్టి, తన ప్రతిభాశక్తిచే వానికొక "సూత్నసంగతిదనరఁజేసి"

"సత్కృతు" లనే రచించి యాతఁడు నన్నయాదులను తలదన్ని దొరకొనెను. "తేట తెనుఁగున ద్విపదలనే" యాతఁడు రచించినను అవి తొమ్మిది రసములతోఁ దులుకాడునవి. ఇమ్మడి వర్ణనలతో నెసంగునవి, ద్విగుణములగు నలంకారములతో నసలారునవి, ద్విగుణార్థ భావములతో దీటుకొనునవి. ఇంతకు పూర్వము నన్న యాదులు రచించిన

"అరూఢ గద్యపద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబు గామి"

తాను గ్రహించిన "జాను తెనుఁగు విశేషము ప్రసన్నతకు" అని తలంచియే తేటతెనుఁగున ద్విపదలు రచింపఁ బూనుకొనెను. అనాగరక జనసామాన్యము పాటలుగాఁ బాడుకొను ద్విపదలలోనా నీవు "వరకవుల్ గొనియాడ వర్ణనకెక్క" గల కృతిని రచింపఁ దలఁచినదని శిష్టకవులీసడింతురేమో యని కాబోలు "ఆది ప్రాసని యతిఁ దప్పకుండగ ద్విపదలు రచింతు"నని ప్రతిజ్ఞ చేసియు, "ఒప్పదు ద్విపద కావ్యోక్తి నావలదు" అని తానే యాక్షేపించు కొని, ద్విపదకు కావ్యప్రౌఢిని తన నేర్పరితనముచేఁ గల్పింప దలఁచినట్లు వ్యక్తము చేసికొన్నాడు.

"అట్టులుగాక కావ్యప్రౌఢీపేర్మి
నెట్టన రచియింపనేర్చినఁ జాలు
నుపమింప గద్యపద్యోదాత్తకృతులు
ద్విపదయు సమమ భావింప"

"అటుగాన యభివిను తానందితోక్తి
బటుగద్యపద్యప్రబంధసామ్యముగ
గావ్యకళా ప్రౌఢి గల్పింతు ద్విపద
కావ్యంబు భావ్యంబుగాన.... ...

.... .... .... .... .... .... .... ....

జెనకక యింతొప్పఁజెప్పనే యనుచు
సన్నుతిచేయుచు సత్కృవు లలర
దిన్నని సూక్తుల ద్విపద రచింతు"

అని చెప్పినాడు. నన్నయాదు లవలంబించిన గద్యపద్యోదాత్తకృతులకు బదులు ద్విపదలు వారి సంస్కృత భూయిష్ఠ రచనకు బదులు జానుతెనుఁగు నవలంబింపదలచి నట్లు చెప్పకొనుటకు సోమనాథుఁ డిన్ని విధముల సమర్థించుకొనవలసినవాడైనాడు. దీనిని బట్టి నన్నయ గ్రహించిన చంపూ కావ్యపద్ధతిని, తత్సమ భాషా బహుళమగు రచననే యీతఁడు మనమందిడుకొని చెప్పియున్నాఁడనుటకు సందేహము లేదుగదా, కావున ప్రాచీనాంధ్రకవిత్వమున ద్విపదలకు, జానుతెనుఁగునకు విశేష ప్రాముఖ్యముండి యుండవలయును. సంస్కృత భూయిష్ఠము, లేదా తత్సమ బహుళము కాక. యందలి దీర్ఘసమాసములయర్థము జాణతనంబు మీర తేట తెనుఁగు మాటలలోఁ జెప్పబడినచో నదియే జానుతెనుఁగు, అది "తిన్నని సూక్తుల"తో గూడినది. "ఉరుతర గద్యపద్యోక్తులకంటె సరసమై పరుగు"నది; సర్వజన సామాన్యమైనది. నన్నెచోడ మహాకవి చెప్పినట్లు "సరళములైన భావములు జానుదెనుంగున నింపు

బెంపుతోఁ బిరిగొనును." కావుననే దేశిమార్గములను దేశీయములుగఁ జేసి రచించుటయే యిటీవలి "వరకవీశ్వరులు" సాధింపఁదగిన విషయ మన్నట్లుగా నాతఁడు కుమారసంభవమున హెచ్చరించినాఁడు. ఇట్టి జానుదెనుఁగుభాషలో, ద్విపదాది దేశీయ చ్ఛందస్సులలో రచింపఁ బడిన కృతులే నన్నయకుఁ బూర్వమున సర్వజన సామాన్యములైన దేశిరచనలై యుండునని మన మూహింపవచ్చును. తెలుఁగున నప్పటికింకను వృత్త రచన ప్రచారములోనికి రాలేదన్నమాట. నన్నపార్యుఁడే వీనిఁ దొలుత తెలుఁగుకవితలోఁ బ్రవేశపెట్టి యుండును. శాసనములే దేశీయ చ్ఛందస్సులలో రచింపఁబడి యుండుటనుబట్టి యా కాలపు దేశి కవితా రచనలు నట్లే యుండునని తలంపవచ్చును. అట్టి రచనలను గూర్చి యింకను తెలిసికొనుటకు సోమనాథుఁడే మన కాధారము.

పాల్కురికి సోమనాథుని మూలముననే మన కెఱుకపడిన ప్రథమ శైవకవి మల్లికార్జున పండితారాధ్యులు, ఈతఁడు సోమ నాథునికిఁ బూర్వుడు, నన్నయ కొక శతాబ్దము తరువాతివాడు. ఈతఁడు రచించిన శివతత్త్వసార మనుకృతి మనకిటీవలనే లభించినది. ఇది కేవలము కందపద్యమయము. జాతులలోఁ జేర్పఁబడిన యీ కందపద్యములు నన్నయాదులకృతులలో నచ్చటచ్చట గాన వచ్చినను, వారి కృతులు కందపద్య బహుళము లనియైనను జెప్పుటకు వీలు లేదు. తరువాతికాలమున గందపద్యములలోఁ జెప్పఁ బడిన శతకము లనేకము లాంధ్రమున వెలసినవి. వాని కీ శివ తత్త్వ సారము మార్గదర్శియని చెప్పవచ్చును. నన్నయకుఁ బూర్వ

మునుఁగల శాసనములలో సయితము కందపద్య రచన యింత వరకుఁ గానరాలేదు. కాని కన్నడభాషలో నిప్పటికి లభించిన తొలి రచనలలో కందపద్య బాహుళ్యమున్నట్లు గపడుచున్నది. ఆభాషలో తొలి గ్రంథము, తొలి లక్షణ గ్రంథము ననదగిన కవిరాజ మార్గము కందపద్య బహుళమైయున్నది. కొన్ని సంస్కృత వృత్తములును, కొద్ది గీతికలును గూడ లేకపోలేదు. అందు పేర్కొనఁబడిన ప్రాచీన కావ్య భేదములగు చెత్తాణె, బెదెండె అనునవి కందపద్యములతోఁ గూడినవిగానే కనబడుచున్నవి. ఒక కందపద్యము తరువాత నొక వృత్తమును రచించి అచ్చటచ్చట "జాతుల"ను పొదిగిన నది "బెదెండె" కావ్యమగుట.[1] చత్తాణ కావ్యమును కందపద్య బహుళముగాఁజేసి అందక్కడక్కడ సుందర వృత్తములను, అక్కర, చవుపది, గీతికె, తివది మొదలగు వానిని అందముగాఁ జేర్చవలయునట.[2] ఇట్లు ప్రాచీన కాలమున కన్నడ కావ్యములలో కందపద్యమునకుఁ గల ప్రాధాన్యము

---

1. "కందముమమళినవృత్తము,
మొందొందెడెగొందు జాతిజాణెనెయెబెడం
గొందివరీళమరెపేఱ
ల్సుందరరూపింబెదెండెగబ్బమదక్కుం."

2. "కందళ్గళవాగిరె
సుందరవృత్తంగళక్కరంచవుపదిమ
త్తంగ్గితకె తివదిగ
ళందంబుత్తెసెయె పేళ్గొడదు చత్తాణం."

—కవి రా. ౧.౩౪, ౩౫.

తరువాతి కాలమున తగ్గిపోయినట్లున్నది. పంపాది కవుల కావ్యములలో నవి నన్నయాది కవుల కావ్యములలోవలె నచ్చటచ్చట వాడబడినవే కాని, అందు కందపద్యములకుఁ బ్రాధాన్యము లేదు. దక్షిణదేశ భాషాచ్ఛంద స్సంప్రదాయములకు సరివచ్చు మాత్రాగణ చ్ఛందములోని ఆర్యాజాతి భేదమే యీ కందపద్యమగుటచేత ప్రాచీన దేశీయకవిత్వములో దీనికి బ్రాధాన్యము కలిగియుండ వచ్చును. ఆర్యా గీతియే ప్రాకృతమున "ఖందనీ" యను పేరు గలదై యుండినట్లును, ఆంధ్ర కన్నడములలోని కందము ప్రాకృతము మూలముగా నీ భాషలలో జేరినట్లును దలంపఁబడుచున్నది. కాని కన్నడాంధ్రములందలి కందపద్యములలో సంస్కృతమున నార్యజాతులలో లేని ద్వితీయాక్షర ప్రాసనియమమొకటి కలదు. మఱియు నీ కందాదిజాతులలో

"గురులఘువులలో నెయ్యది
మురసంహర ప్రథమపాదముఖమున నిలిచెఁ,
ధర నుపజాలు దక్కఁగ
బరగ నిలుచునవియె నాల్గు పదముల మొదలన్."

ఇదియేకాక తెలుఁగులో రెండు నాలుగు పాదములలో యతి నియమముకూడ గలదు. క్రీ. శ. ౯-వ శతాబ్ది నాటికే కన్నడ కందములు ప్రాకృతఖందనీ పద్యములకంటె విలక్షణములై కన బడుచున్నవి. ప్రాకృత ఖందనీల ప్రాచీనత యెట్టిదో తెలియదు గాని దక్షిణదేశభాషా సంప్రదాయసిద్ధమగు యతిప్రాస విలక్షణత యీ కందములకుండనేయున్నది.

తెలుఁగున శివతత్త్వసారమును రచించిన పండితారాధ్యుఁడే కన్నడమున "బసవగీత"లను గ్రంథమును రచించెను. ఇంక నీతఁడు "పంచగద్దెలు" "శంకరగీత భాస్వత్పదావళి" "ఆనందగీతంబు"లను పదంబుల చేతనేకాక యింకను బ్రాక్తననూతన భవ్యగీతములచేఁ గూడ ఈశ్వరుని బొగడెనని సోమన చెప్పుటచే వీనిలో గొన్ని తద్రచితములేయనియు, నిట్టి గద్యరచన, పదకవిత్వము నా కాలమున సామాన్యజన ప్రచారములో నుండెననియుఁ దలంపవచ్చును. కవిరాజమార్గమున విమలోదయ, నాగార్జున, సునీతి, జయబంధు, దుర్వినీతాదులు కన్నడమున బ్రాచీన గద్యకవితా రచయితలుగఁ జెప్పఁబడిరి. వారి గద్య రచనలకును నీ శైవ గద్యలకును సంబంధముండి యుండును. ఇట్లీ దేశీయ గద్య కవిత్వము గేయమై యాంధ్ర కన్నడదేశములలో నా కాలమున విశేషప్రచారములో నుండెననుటకు సందేహములేదు. పండితారాధ్యుఁడు వెలనాటిచోడుని బౌద్ధగురువుతో వాదించుటకుగా నా రాజసభకుబోవు సందర్భమున నాతని వెంటవచ్చు శిష్యులు, సద్భక్తసంకులము నాడుచు బాడిన పదములు మఱికొన్ని కలవు.

"పదములు, తుమ్మెదపదముల్, ప్రభాత
పదములు, శంకరపదముల్, నివాళి
పదములు, వాలేశుపదములు, గొబ్బి
పదములు, వెన్నెలపదములు, సంజ
వర్ణన మఱి గణవర్ణన పదములు
బాడుచు నాడుచు........"

శివరాత్రియందు శ్రీశైలమున మల్లికార్జును సేవించుటకై చేరిన భక్తగణములు రాత్రి జాగరణముచేయు సందర్భమున చదువు గ్రంథములు—

"శతకంబు శివతత్త్వ సారంబు, దీప
కళిక, మహానాటకము, నుదాహరణ
ములు, రుద్రమహిమయు, ముక్తకావళులు
గీతసూక్తములు, భృంగిస్తవంబులు, బు
రాతనమునిముఖ్య రచితాష్టకములు
అరుదొంద జదువుచు నంకించువారు."

మఱియు అరువత్తుమూఁడు చరితంబును ఏలలవెట్టుచు జదివిరట. ఇంకను సకల పురాతనచారుగీతములు ప్రకటించి పాడెడువారు కొందరు. దీనినిబట్టి శతకము, దీపకళిక, నాటకము, ఉదాహరణము, ముక్తకము, అష్టకము మొదలగు కావ్యరచనా భేదములు క్రీ. శ. ౧౨-వ శతాబ్దికిఁ బూర్వమే సుప్రసిద్ధములై యుండెనని తెలియవచ్చుచున్నది. కళికోదాహరణ ముక్తకాది రచనాభేదముల లక్షణములను లక్షణ గ్రంథములలో తరువాతి లాక్షణికులు కొందరు చెప్పినను, అట్టి రచనలు తరువాతి గద్యపద్యాది ప్రబంధ సంస్కృత భూయిష్ఠ రచనల ఘాటి కాగలేక తెలుఁగు కవితలో వెనుకబడిపోయినవి. శతక వాఙ్మయము తరువాతి కాలమున గూడ తెలుఁగునాట బాగుగనే వృద్ధి నొందినది. కాని యుదాహరణ గ్రంథములు మొత్తము పది పండ్రెండు కంటె విశేష

ముగా బయలుదేరలేదు. అందు సోమనాథుని బసవోదాహరణము, త్రిపురాంతకోదాహరణము, అప్పకవి కృష్ణోదాహరణము, తాళ్ళ పాకవారి వేంకటేశోదాహరణము ప్రసిద్ధములు. మహానాటకస్వరూప మెట్టిదో తెలియదు. దీపకళిక అనునది ప్రత్యేకరచనాభేదముగాఁ జెప్పఁబడినది. కాని ఇటీవల నిది "యుదాహరణ" గ్రంథములలో నొక రచన భేదముగా నుండెనేకాని, ప్రత్యేకరచనాభేదముగాఁ గాన వచ్చుటలేదు. అరుదగు దాసయ్య అఱువత్తుమూఁ డు చరితం బులును, బసవపురాణంబును ఏలలువెట్టుచు నింపుసొంపారు శైలిలో జదివినారట. ఏలలువెట్టుచుఁ జదువుట యనఁగా రెండేసి పాదములకో, మూఁడేసిపాదములకో నడుమ నే మహాదేవుని పేరో రాగవరుసతో నుచ్చరించుచు జదువుట కావచ్చును. ఏలపాట లనునవి తరువాతి యక్షగాన గ్రంథములలోఁ జేర్పబడియున్నవి. ప్రత్యేక రచనలుగాఁగూడ కలవు. సుగ్రీవ విజయములోని యేల యొకటి యిట్లున్నది :

"భానువంశ మూన బుట్టి
దానవకా మీని గొట్టి
పూని మఖము నిర్వహింపావా, ఓ రామచంద్ర
మౌనివరులు సమ్మతింపంగా,
రాతి నాతి జేసి పూరా
రాతిచేతి విల్లు విరిచి
ఖూతచేంద్రూలెల్ల మెచ్చాగా, ఓ రామచంద్ర
సీతనూ వివాహమాడావా."

ఇట్టి ఏలలలో నడుమనడుమవచ్చు "ఓ రామచంద్ర" అను సంబోధనలను బోలిన సంబోధనలతోఁగూర్చి బసవ పురాణాదులను జదివియుందురు. ఈ యేల లనునవి నాలుగేసి సూర్యగణములతోఁగూడిన నాలుగు పాదములు గలిగి నడుమ సంబోధనలతోఁగూడినవిగాఁ గనబడుచున్నవి. బసవగీతములేగాక సకల పురాతన చారుగీతములుగూడ పాడఁబడుచుండెనని చెప్పుటచే నవి పాటలలో భేదములే కాని గీతపద్యరచనలు కావని తోచుచున్నది. ఇట్టి వనేక విధములగు పాటలు, స్తోత్రములు, గీతములు మొదలగు రచనాభేదము లా కాలమున జనసామాన్యమున ప్రచారములో నుండెడి వనుట నిక్కము. ఇక నా శివరాత్రి జాగరమున వేడ్కలు, ప్రదర్శనములు వనేక రీతులుగ నున్నవి[1]. బహునాటకము లాడి

---

1. "ప్రమథపురాతనపటుచరిత్రములు
ప్రమమొంద బహునాటకము లాడువారు
భారతాదికథల జీరమరుగుల
నారంగ బొమ్మల నాడించువారు
ఆదట గంధర్వ యక్షవిద్యాధ
రాదులై పాడెడు నాడెడువారు
పురములు గాల్చినపోల్కి యాడుచును
సతికర్ధమిచ్చిన పోల్కియాడుచును
యతులు గొల్వగ నున్నయంద మాడుచును
గంధగజాసురు గడపుటాడుచును
జన్నంబు ద్రుంచినచాళి నాడుచును
వెన్నుండు గన్నిచ్చువేళ నాడుచును
గరళంబు దాల్చినకరణి యాడుచును."

రట. తోలుబొమ్మల నాడించుచు భారతాది కథలను ప్రదర్శించుట, వీధిభాగవతములనుబోలు ననేక విధములగు ప్రదర్శనములలో శివుని బహువిధ చరిత్రములను నాటకములుగాఁజేసి యాడుట మొదలగు వేడ్కలు జరిగినవి. దీనివలన నాటక రచనయు, ప్రదర్శనమును గూడ నా కాలమున జనసామాన్యమున బ్రబలముగనే యుండెనని తెలియుచున్నది. అది ఇటీవలి కాలమున బ్రదర్శింప బడుచుండెడి వీధి భాగవతములను బోలియుండునని సోమనాథుని వర్ణనలనుబట్టి మనమూహింపవచ్చును. ఆ వేషములు, చర్యలు, ఆటలు, పాటలు, గంతులు, చిందులు మొదలగువాని వర్ణనము[1] చూడ సోమనాథుని కాలము నుండియు, నంతకుఁ జిరపూర్వమునుండియు గూడ,

1. "భసితంబు పూతపై జరుగు బచ్చెనలు
నసలారు చిరుగద్దియలు నందియలును
గరమొప్పు తొంగళ్లు గల చల్లడములు
బొల్చు దంతావళుల్ పుష్పమాలికలు
దాల్చి యత్యద్భుతోత్సవలీల దనర
జనులు హర్షింప నా స్థానముల్ సొచ్చి
యనుకూల వివిధ వాద్యసమ్మేళనమున
నార్పుటంబిచ్చి యొయ్యన జవనికల
గర్భంబు వెడలి యక్కజము వ్రట్టిల్ల
విక్కుచును ద్రిభంగి నిలుచుచు నట్ల
చొక్కుచు సభ జూచి యొక్కింత నగుచు,
అలరి శిరఃకంప మాచరించుచును
తనుపాదఘట్టన దనరు నుద్ఘటన
లనునయించుచు నందియల్ గదల్చుచును

నిప్పటి వరకు నీవీథినాటక ప్రదర్శనము లోకరీతినే యున్నవాయని యాశ్చర్యము కలుగక మానదు. ఆంధ్రలోకమున నిట్టి నాటక ప్రదర్శనములు పండితపామర జనుల కాకాలము నుండియు నానందమును గూర్చుచున్నవి గనుకనే కాఁబోలును శిష్టకవులు ౧౯-వ శతాబ్దివరకు నాంధ్రమున నాటక రచనాభారమును వహింప లేదు. ప్రాచీనమగు నీరీతి నాటక రచనకు దక్షిణదేశమున నాయక రాజుల కాలమున రాజావలంబనము కలుగుటచేఁ గొంత సంస్కార మేర్పడి యక్షగాన రూపమునఁ బెక్కు గ్రంథములు వెలసి నిలుచుట తటస్థించినది. ఈ యక్షగానములందే యనేక రీతులగు దేశీయచ్ఛందోబద్ధములగు రచనా విశేషములు నిలిచియుండుటచే వాని స్వరూపములనైనను మన మిప్పుడు తెలిసికొనుట కవకాశము కలుగుచున్నది. ఇందలి దేశీయచ్ఛందో రచనాభేదము లనేకము లిప్పటికిని పామర జనులు,ముసలమ్మలును పాడుకొను పాటలలో నిలిచియుండుటచేనివి

---

జతులు పాడుచు దాళగతుల కాడుచును,
గంతులు వైచుచు——
నొడ్డోరంబుల నొఱపి తిరుగుచును
బురములు గాల్చినపోల్కి యాడుచును
సతి కర్ధమిచ్చిన చందమాడుచును
గరళంబు దాల్చినకరణి యాడుచును
వెండియు శివు బహువిధ చరిత్రముల
ఖండితగతి నాటకంబు లాడుచును."

ప్రాజ్నన్న పార్యయుగము నుండియు మనకు సంక్రమించిన దేశీ యాంధ్రకవితా వైభవమే యని గ్రహింపవలసి యున్నది. ఈ పదములు, పాటలు, గీతములు మొదలగునవే యాంధ్ర కవితా వైభవమునకు మూలధనము; ఆంధ్ర వాఙ్మయ మహాసౌధమునకు పునాదులు; ఆంధ్రభాషా సారస్వత మహావృక్షమునకు మహత్తర మూలములు, తల్లి వేళ్లు.

ఆంధ్ర కన్నడ సారస్వత వృక్షములింకను లేత పరువున నుండగనే సంస్కృత సాహితీ మహా వృక్షముతో నంటగట్టఁబడినవి. కావుననే యాయంట్లు శీఘ్రకాలముననే యతుకుకొని క్రొత్త వృక్షములై యతిరుచ్యములగు నూతన స్వాదుఫలముల నొసంగ మొదలిడినవి. ఈ ప్రయత్నము సుమారు క్రీస్తుశకారంభముననే జరిగియుండును. అప్పటికే తమిళ సారస్వత వృక్షము ముదురుబారి ఫలవంతమగుటచే నాంధ్ర కన్నడము లందువలె సరియైన సమ్మేళనము కుదురలేదు. అంటుకట్టుటలోను, దోహద క్రియలోను గూడ కొంత భేదమేర్పడి పోయినది; ఆయా దేశములం దప్పటి సాంఘిక, రాజకీయ పరిస్థితులే దీనికి ముఖ్య కారణము. కావుననే తమిళ సంస్కృతభాషా వృక్షముల యంటు సరిగా నంటుకొనకుండుట, నూతన వృక్ష ఫలముల కొక వింతరుచి కలిగినను మొదటి తమిళభాషా సారస్వత ఫలములపొంకము వాసన, రుచియు పోకుండుట తటస్థించినది. కన్నడాంధ్రములలో నీ క్రొత్త అంట్లు చక్కగనేయేర్పడినవిగాని, అవినాటఁబడిన క్షేత్రములందు కలిగిన దోహద భేదముచేగాబోలు నొకదానికంటె మఱియొకటి యతిశీఘ్రకాలముననే

ఫలవంతమగుట తటస్థించినది. క్రీస్తు శకము నాల్గవ శతాబ్దమువరకు సామాన్యముగా హిందూదేశమందంతటను బౌద్ధమత ప్రాబల్యము కలిగినది. అందు దక్షిణాపథమున, ముఖ్యముగా నాంధ్రకన్నడ దేశములందు పాలకులు బౌద్ధమతాభిమానులే యగుటచే నా కాలమున ప్రాకృతమే రాజకీయ భాషగా నేర్పడుటయుఁ దటస్థించినది. ఆ కారణముచే జనసామాన్య వ్యవహారములలో నున్న తెలుఁగు కన్నడభాషల కప్పుడు గలిగిన సన్నిహిత ప్రాకృతభాషా సాహిత్య సంపర్కమువలనఁ దత్పదజాలము, సాహితీరీతులు కొంతవరకీ భాషలలో సంక్రమించినవి. సంస్కృత ప్రాకృతభాషాపండితులు దేశభాషా సాహితీరీతులను గనిపట్టి వానిని సంస్కృత ప్రాకృత భాషా సాహితీ రీతులతో సమన్వయించి దేశ భాషలకు లక్షణము నేర్పరుపఁ దొడంగిరి. సంస్కృత భాషా సాహిత్యము లప్పటికే లక్షణ సహితములై యుండుటచేఁ దల్లక్షణ దృష్టితో నేర్పరుపఁబడిన దేశబాషా సాహిత్య లక్షణములు నా దృష్టికి ప్రతిబింబములే యగుటలో నాశ్చర్యము లేదు. ఆంధ్ర కన్నడ భాషలలో వెలసి యున్న దేశికవిత యప్పటి పండిత కవులకు సంస్కృత సాహిత్యము ముందు విశేషముగా నచ్చకపోవుటచే వారు దీనియెడల ననాదరభావము కలవారైనను, సంస్కృత భాషా రూపములను, సాహిత్యరీతులను, ఛందోరీతులను దేశభాషలలోనికి దింపి వీనికొక విధముగ గౌరవమును గలిగింపఁజూచిరి. వీరి యీ యుద్యమము కారణముగా నప్పటి నుండియే యీ భాషలలోఁదత్సమ పదజాలము

విశేషముగా జేర మొదలు పెట్టినది. సంస్కృతపద భూయిష్ఠమగు నీ భాష శిష్టజనసంఘమునందు మాత్రమే వ్యాప్తిలోనికివచ్చి జన సామాన్యములోని కంతగా దిగియుండలేదు. కావుననే యంతకుఁ బూర్వము జనసామాన్యమునందు వ్యాప్తిలోనున్న తెలుఁగు కన్నడ భాషలకును, శిష్టజనసంఘమునందలి యీ సంస్కృత భూయిష్ఠమగు తెలుఁగు కన్నడ భాషలకునుగల యంతరము విశేషము కాఁజొచ్చినవి. రాజాస్థానములయందలి సంస్కృత ప్రాకృతాది భాషా పండితులయిన శిష్టకవులు తత్సమ భూయిష్ఠమగు నీ శిష్టభాషలో రచించిన గ్రంథములకే రాజావలంబనము కలుగుటచే నీ శిష్టభాషకే ప్రామాణ్య మేర్పడుస్థితి కలిగినది. ఈ శిష్టకవులకు సామాన్య జనుల భాషయందుగాని, ఆ భాషలో రచింపఁబడిన కవితయందు గాని, యాదరము లేకపోవుటచే నవి వీరి యీసడింపులకు మాత్రమే గురియగుచువచ్చినవి. ఈ స్థితి కన్నడభాషలో ౮, ౯ శతాబ్దముల నాటికే కలిగినదని కవిరాజమార్గము వలననే తెలియవచ్చుచున్నది. ఆంధ్ర కన్నడ భాషా సాహిత్యములలో నీ కవిరాజమార్గమే మనకు లభించిన మొదటి గ్రంథమగుటచే, తద్భాషాసాహిత్య చరిత్రాన్వేషణ సందర్భమున నిది మిగులఁ దోడ్పడఁగలదనుటకు సందేహము లేదు. కన్నడములోని యప్పటి తత్సమభాషారచనను ప్రోత్సహించుచు నంతకుఁబూర్వము, లేదా అతని కాలముననుగూడ సామాన్యజన వ్యవహారములో నుండిన పటు గన్నడములోని కావ్య రచనమును గూర్చి యీతఁ డేమి చెప్పియున్నాఁడో చూడుడు :

"ఆరిదాదంకన్నడదొళ్
తిరికొాఱెగొాండఱియె పేళ్వేనెంబుదిదాగ్గఌం
పరమాచార్యరవోల్స
ట్తిరలఱియర్ కన్నడక్కెనాడవరోజర్."

(కన్నడభాషా స్వరూపమును నేను బాగుగా చెప్పగలుగుదు ననుట మిక్కిలి అసాధ్యము. అది పరమాచార్యులకే బాగుగా తెలియదు. కన్నడదేశీయులగు జనులే ఆ విషయమున సమర్థులు.)

"దోసమిని తెందుబగెదు
ద్భాసిసితఱిసందు కన్నడంగళొళెందుం
వాసుగియు మఱియలారదె
బేసఱుగుం దేశిబేఱె బేఱప్పుదఱిం."

దేశి వేరువేరు విధముగా నుండుటచేత కన్నడభాషలోని దోష మింత యని విచారించి నిశ్చయముగాఁ జెప్పుటకు వాసుకికిఁ గూడ సాధ్యముకాదు. వేసటకూడ కలుగునట. కావున దానికి, అనఁగా నీ కన్నడ దేశీయభాషకు లక్షణము చెప్పుట సాధ్యము కాదు అని తెల్పినాఁడు. 7-వ శతాబ్దినాటి తెలుఁగుభాషయు నట్లే యుండెడిదని యప్పటి శాసనములనుబట్టి తెలియుచునేయున్నది గదా. అయినను అప్పటికి నిలిచియున్న కావ్యములను ఆ కావ్యముల లక్షణమును సతతముగా - అవశ్యాదరణీయములుగా నెంచి శాస్త్రమును, లేదా లక్షణమును బాగుగా నెఱుఁగనివారు ఆ

పఱగన్నడమును పాడుచేసి చెప్పెదరు. అది అందముకాదని వారికే తెలియును.[1] ఆ ప్రాతకన్నడము పురాణ కావ్య ప్రయోగమున నా కాలమునందు సొగసుగానున్నను (ఇప్పటి) వారి దృష్టికి జర ద్వధూవిషయ సురతరసరసికతను బోలి విరసం కరమగును[2] అని యిట్లు ప్రాచీన కన్నడభాషలోని కవితారచనాప్రయత్నమును నిర సించి కవిరాజమార్గ కర్త సమసంస్కృతమును కన్నడభాషలో మిశ్రమముచేసి చెప్పుటనుగూర్చి ప్రశంసింపఁ దొడగినాడు. అనఁగా ప్రాచీన కన్నడభాషను త్రోసిపుచ్చి సంస్కృత భూయిష్ఠ మగు తత్సమభాష నెటు కల్పించుకొనవలెనో ఎట్లు వాడుకొన వలెనో చెప్పినాఁడన్నమాట. ఈ దేశభాషలలో సంస్కృత శబ్దముల నెట్లు చేర్చుకొనవలెననునదే యా కాలపు శిష్టకవులను, లక్షణకర్తలనుగూడ బాధించిన ప్రధాన విషయము. కొందరు సంస్కృతా వ్యయములను, విభక్త్యంతములగు శబ్దములనుగూడ దేశభాషాశబ్దములతోఁ జేర్చి ప్రయోగించి వానికి నమన్వయము కల్పించి మణిప్రవాళ శైలిని రచింపఁ దొడగి యుందురు. కాని ఇది శిష్టకవులలోఁ గొందరకు రుచించినట్లులేదు. కావుననే యిది

1. నెలసిద కావ్యం కావ్య
క్కెలక్షణం సతతమెంనె పలుగన్నడముం
పొలఁగె డిపి నుడిపరాగమ
బలహీ ర్ దేసియల్ల దెందరిదిర్దుం ౧-౪౮

2. దొరకొండిరె సొగ యిసుగుం
పురాణకావ్యప్రయోగదోళ్ తత్కాలం
విరసంకరమవు దేపిగె
జరద్వధూవిషయ సురత రసరపికతవోల్. (౫౦)

"యాగమ కోవిదనిగదితమార్గము" కాదని కవిరాజమార్గకర్త దీని నాక్షేపించినాడు.[1] అహరహః, ఉచ్చైః, నీచైః, మహుర్ముహుః ఇతస్తతః, అంతః, బహిః మొదలగు సంస్కృతావ్యయములను కన్నడమునఁ బ్రయోగింపఁగూడదు. అట్లు చేసినచో గరడెయు మద్దెళయు కలిపి వాయించినప్పుడు కలుగు జర్ఝరధ్వనివలె పరుష తరమై యుండునట. "బహిరంతరుపవనంగళొ శహరహ మాపర భృతంగ ళులివర వంగళ్" అని చెప్పగూడదు. "బహిరుద్యానాంతర దొళ్ సహసోదితమత్త కోకిలోచ్చైర్ధ్వానం" అని సంస్కృత సమాసములుగాఁ జేసియే చెప్పవలయును. అరసకుమారం. ఆయత తరకడెగణ్ణం—ఈ రీతి అరిసమాసములుకూడ పనికిరావు. "నరపతి తనయం, ఆయతతరళాపాంగం" అనియే చెప్పవలయును.

ఇట్టి సంస్కారమే తరువాతి కాలమున నన్నపార్యుఁ డాంధ్రభాషకుఁజేసి యాంధ్రభాషావాగను శాసనుఁడైనాడు. ఇందా తనికిని నృపతుంగాది కన్నడ లాక్షణికులు, కవులునే మార్గదర్శకులై యుండురనుటకు సందేహములేదు. తరువాతి కేతనాది లాక్షణికులుగూడ తత్సమభాష యెట్లు కల్పింపవలెనో యను విషయమును దెలుపుటలోనే చాల శ్రద్ధవహించినారు. వృక్షేణ, దక్షోయే

1. సమసంస్కృతంగళోళ్ త
్తమఁదిరే కన్నడమనఱిదు పేర్గెం) బుది దా
గమకోవిదనిగదితమా
ర్గమిదం బెరసల్కె మాఱదీ సక్కదదొళ్.

త్యాది సంస్కృత విభక్తులు, పచతీత్యాది క్రియలు. అపి చ, తు, హీత్యాది అవ్యయాదులు తెలుఁగునఁ జొనిపి చెప్పఁగూడదని కేతన ప్రత్యేకముగా నిషేధించినాఁడు.[1] కావున నా కాలమున సంస్కృతమును తెలుఁగుచేయుట యెటులా యను విషయమే లాక్షణికులకును బాధించినట్లగపడుచున్నది. ఈ లక్షణము సంస్కృత పండితులకొరకే చేసిరా యనునట్లీయాంధ్ర కన్నడ భాషాలక్షణములను గొందరు సంస్కృత భాషలోనే రచింపఁదొడంగిరి. ఇట్లీ దేశభాషలు తత్సమ భూయిష్ఠములైనకొలది పటిగన్నడము, దేశి తెనుఁగు అనునవి, వానిలో రచింపఁబడిన కవితతోపాటు వెనుకఁబడిపోయినవి. ఇది భాషావిషయము.

ఇక కవితాసామగ్రియగు కథాంశములు గుణ దోషాలంకారాదులన్నియు సంస్కృతాలంకారికుల రచనల యను

---

"వృక్షేణదక్షాయ పక్షిభిః పుత్త్రిస్య
యను విభక్తులు దెనుంగునకుఁ జొరవు
అస్తిప్రయాతిగాయంతిభుంక్తే సంతి
నయతిస్మరతి యను క్రియలు సొరవు
గత్వాహపిత్వాప్రకాశ్య సంత్యజ్య నాఁ
దనరుత్వాంతల్య బంతములు సొరవు
గంతుంపురీంరిపుంహంతుంసుతంపాతు
మనుతుమున్నంతంబులరయఁ జొరవు
అపిచతుహివైనవా ననులనఁగఁ బెక్కు
లవ్యయంబులు చొరవెందు నాంధ్రకవిత
బెఱపదంబులతోడను దొరలినిల్పు
నని తెనుంగులు గావింతు నభిమతముగ" ఆం. భా. భూ.

కరణములే. ఆ కాలమున దండిమహాదుల ననుసరించి గుణదోషా లంకార ప్రకరణములను రచించిన కవిరాజ మార్గమే దీనికి నిద ర్శనము. తెలుఁగున విన్నకోట పెద్దనాదులు నట్లేచేసిరి, సంస్కృత మున ప్రతాపరుద్రీయమునకు బదులుగాఁ దెలుఁగున సరసభూపాలీ యము వెలసినది. అందలి ధ్వనిభేదములకు, రీతి గుణాలంకారాదు లకు మూల గ్రంథములనుబట్టి యాయా లక్షణకర్తలుదాహరణము లను స్వయముగ కల్పించిరేకాని, తెలుఁగు కవుల రచనలలో నుండి యుదాహరించి వాఙ్మయముతో లక్షణ సమన్వయము చేసి చూపు టకు వారు యత్నింపలేదు. సంస్కృత పదములను, సమాసము లను దెనుఁగునఁజేర్చుట యెట్లో యను విషయమున వైయాకర ణులు తాపత్రయము పడినట్లే, సంస్కృతచ్ఛందోలంకార పద్ధతిని తెనుఁగులోనికిఁ దెచ్చుటయే వీరు తమ ధర్మమని తలచి దానిని నెరవేర్చిరి. ఈ లక్షణమును బట్టి ముందెవ్వఁడైనను వ్రాయునేమో యని కాబోలు, కన్నడమున కవిరాజమార్గకర్త కన్నడ ఛందస్సును గూర్చి వ్రాయలేదు. తెలుఁగున కవిత్రయమువలెనే కన్నడమున రత్నత్రయమును, భారతాది సుప్రసిద్ధ గ్రంథములను రచించిన తరువాతగాని—ఛందోలక్షణమును గూర్చిన గ్రంథము బయలువెడల లేదు. క్రీ.శ. ౧౦—వ శతాబ్ద్యంతమున "ఛందోంబుధి"యను ఛందో లక్షణ గ్రంథమును రచించిన మొదటి నాగవర్మ రత్నత్రయము నకు దరువాతివాఁడే. మరియు నీ కన్నడ కవులందరునుగూడ నన్న యకుఁ బూర్వులే. నాగవర్మ ఛందోంబుధి వ్రాయుటకుఁ జిర

పూర్వమే, అనఁగా మూఁడువందల సంవత్సరములకు బూర్వమే కన్నడభాషలో సంస్కృత వృత్తరచన ప్రారంభమైనది. క్రీ. శ. ౭౦౦ నాటి శ్రావణ బెళగోళ శాసనములలో సంస్కృత వృత్తములలో రచింపఁబడిన చక్కని కన్నడ పద్యములు గలవు. అంతకుఁ బూర్వపు శాసనములు వచనముననే యున్నట్లగపడుచున్నవి. తెనుఁగునందును ఇప్పటికి లభించిన ౭, ౮ శతాబ్దులనాటి శాసనములన్నియు వచన రచనములతోఁ గూడినవే. శాసనములలో పద్య రచన ౯-వ శతాబ్దినుండియే గానవచ్చుచున్నది. అయితే ౮-వ శతాబ్ది నుండియు కన్నడ శాసనములు సంస్కృతవృత్త బహుళములై యుండగా, తెనుఁగు శాసనములలోని పద్యములు-నన్నయ కాలమువరకును, అతని కాలమునఁగూడ - దేశీయ ఛందోరచనలేయై యుండెనుగాని సంస్కృవృత్త రచన లింత వరకు గనబడలేదు. ప్రాచీన కన్నడ శాసనములలో దేశీయ ఛందోరచన లత్యల్పముగా నున్నవి. దీనినిబట్టి సంస్కృత భాషాచ్ఛందోలంకార లక్షణ ప్రభావమాకాలమున,అనఁగా (నన్నయకు ౪ శతాబ్దములకు బూర్వము) చాళుక్య ప్రభువుల కాలమున నాంధ్రభాషా కవితలపై - కన్నడ భాషా కవితలపైవలె-నంత ప్రబలమై యుండలేదని తోఁచుచున్నది, దీనికిఁ దగిన కారణము లేకపోలేదు. కన్నడ వాఙ్మయము నందలి తొలియుగము జైనయుగము. ఈ యుగమునందలి ప్రసిద్ధకవులు, కవిరాజ మార్గకర్త, పంప, పొన్న మొదలగువారిచే ప్రాచీన కవులుగా నెన్నఁబడిన సమంతభద్ర, పూజ్యపాద, కవిపరమేష్ఠి, విమలో

దయ, నాగార్జున, జయబంధు, దుర్వినీతాదులు, జైనులు, జైన మతాభిమానులు నైనను గొప్ప సంస్కృత పండితులు. అందు వ్యాకరణాది గ్రంథములనుగూడ రచించినవారును కొందరు గలరు. వీరందరును క్రీ. శ. ౫, ౬, శతాబ్దములవారుగాఁ దలంపఁబడు చున్నారు. కావున నప్పటినుండియుఁ గన్నడభాషలో బండితకవులు కవితారచనను ప్రారంభించియుండినయెడల ౭, ౮ శతాబ్దములనాటికి శాసనములలోఁగూడ సంస్కృత వృత్తములలో రచింపఁ బడిన కన్నడ పద్యము లగపడుటలో నాశ్చర్యమేమున్నది? క్రీ. శ. ౮-వ శతాబ్దినాటి శ్రావణ బెళగొళ శాసనపద్యములలో నొకటి (Ep. car, II, 88) : మహాస్రగ్ధర—

"సురచాపంబోలె విద్యు
ల్లతెగళతెఱవోల్ మంజువోల్ తోఱిబేగం
పిరిగుం శ్రీరూపలీలా
ధనవిభవమహారాశిగళ్ నిల్లవాగ్గళం
పరమార్థం మెచ్చెనా నీ
ధరణియొళ్ ఇరవా నెందు సన్న్యాసనంగె
య్దురు సత్వన్ నందిసేన
ప్రపరమునివరన్ దేవలోకక్కె సన్దాన్.

ఇందలి "శ్రీరూప .... రాశిగళ్", "నంది..........వరణ" ఇత్యాది దీర్ఘసమాసములు కన్నడముపై సంస్కృతభాషా ప్రాభవమును దెలుపుచునేయున్నవిగదా. ఇట్లే మత్తేభము, శార్దూలము, వసంతతిలకాది వృత్తములనేకములు శాసనములలోనికేయెక్కినవి.

కాని యీ వృత్తముల కన్నిటికి నేదోవిధముగా నొక దేశీయతా ముద్రవేయనిది వీరు కన్నడమునను గ్రహింపలేదు. వీనికిదేశీయత ద్వితీయాక్షర ప్రాస నియమమువలనఁ గలిగింపబడినది. ఇది దేశీయమగు అక్కర, చౌపది, త్రిపది మొదలగు పద్యములందు వలెనే సంస్కృతమునుండి గ్రహింపఁబడిన వృత్తము లందును బాటింపఁబడినది. ఇంతేకాక సంస్కృత మందలి విశ్రమరూపమగు యతి నియమమిం దుల్లంఘింప బడినది. ఈయతి విలంఘన మను నది కన్నడ కవితా విశేష లక్షణములలో నొకటిగా కేశిరాజు శబ్ద మణి దర్పణమున మఱికొన్నిటితోఁ జేర్చి యిట్లు చెప్పినాఁడు:

"గమక సమాసదిం అకుళక్షళదిం
    శృతిసహ్యాసంధియిం
సముచితమాకి బర్పసతిసప్తమయిం
    సమసంస్కృతోక్తియిం
వమహపభేదదిం యతిహితావ్యయ
    సంస్కృత లింగడిం పదో
త్తమ శిథిలత్వదిం యతివలంఘనదిం
    దరిదత్తెకన్నడం."

సంస్కృతము నందలి యార్యాజాతి భేదమగు ఆర్యాగీతి ప్రాకృతమున "ఖందసీ" అను పేర బరగినదై, కన్నడాంధ్రము లలో "కంద" పద్యమైనది. ఈ రెండు భాషలలోనుగూడ నీ దక్షిణ దేశ భాషాసంప్రదాయసిద్ధమగు ప్రాసనియమ మీ కందపద్యమునఁ గూడఁబాటింపబడినది. ఇట్లుసంస్కృత ప్రాకృతవృత్తములలోనికిఁ

గూడ నెగ(బాకిన యీ (ప్రాసనియమము కన్నడాంధ్ర భాషా సామాన్యములగు అక్కర, చౌపది, రగడ, ఉత్సాహ, షట్పది, తరువోజ మొదలగు దేశీయపద్యము లన్నిటిలోను సహజముగా నున్నదే. కన్నడాంధ్ర లక్షణ కర్తలు పై దేశీయ పద్యములకు జాతులని పేరు పెట్టియున్నారు. కన్నడమున "గీతికె" అనుదానికిఁ గూడ నీ (ప్రాసనియమ ముండుటచే నది జాతులలోనే చేరును. తెనుఁగునందలి "గీతము"నకుఁ (బాసనియమము లేదుకాని వడి నియమము మాత్రము కలదు. ఇంతేకాక పద్యలక్షణమందే యీ రెంటికిని భేదమేర్పడినది. తెనుఁగున సీసమనునది (ప్రాస నియమములేని మఱియొక దేశీయ పద్యభేదము. ఈ గీతమును, సీసమును జేర్చి యుపజాతులను నొక తెగ కల్పించినారు తెలుఁగు లాక్షణికులు. వీని భేదము నప్పకవి యిట్లు వివరించినాఁడు :

"జాతులు కందాదిక ముప
జాతులు గీతాదికములు సరసిజనయనా"
"గురులఘువులలో నెయ్యది
మురసంహార (ప్రథమపాదముఖమున నిలిచెఁ,
ధర నుపజాతులు దక్కఁగ
బరగ నిలుచు నదియె నాల్గుపదముల మొదలఁ.
ధరణిఁ జాతుల కాదివర్ణ మొకడే
తప్పంగరా దెల్లడఁ
హరి తజ్జాతిగణంబులైన సరి యి
ట్లైన గావచ్చు మం

దరఘారి యుపజాతులం బ్రథమవ
ర్ణంబుఁ యథేచ్ఛంబుగా
సారిదిం జెప్పఁగవచ్చుఁ బ్రాసములు ని
ల్చు న్వళ్ళకై యొక్కచోఁ"

ఇట్లు తెలుఁగు కవితలోని పద్యరచనలో సంస్కృతమందు గాని, కన్నడమందుగాని లేని వడి నియమమొక ప్రత్యేక విశేషముగాఁ గనఁబడుచున్నది. కన్నడ కవులు సంస్కృత వృత్తముల లోని విచ్ఛేదరూపయతినే యుల్లంఘించి యుండఁగా, తెలుఁగు కవులు కన్నడాంధ్రములకు సమానమై దేశీయ సంప్రదాయసిద్ధమగు ప్రాసమునే కాక యతిస్థానమున వర్ణసామ్యరూపమగు వడిని గూడఁ బ్రవేశపెట్టినారు. ఇది కన్నడాంధ్రములకు సమానములేయగు అక్కరాది దేశీయచ్ఛందోరచనలలోగూడ కన్నడమున బాటింపఁబడక తెలుఁగులో బాటింపఁబడుచుండుటనుబట్టి యతిచిర కాలము క్రిందటనే కన్నడాంధ్రములలోని దేశీయకవితారచన భిన్న మార్గములనుబట్టి సాగుచున్నదని తలంపఁదగియున్నది. ఈ వడి, ప్రాసనియమములు రెండునుగూడ సంస్కృత ప్రాకృత కవితా సంప్రదాయసిద్ధములు గావు గనుక, నవి ప్రాచీన దేశీయ సంప్రదాయసిద్ధములని తలంపవలయును. ఈభాషలలోని ప్రాచీన శాసన యుగమునకుఁ బూర్వస్థితి యంధకారమయమే కావున, వీనికి సన్నిహితమగు తమిళభాషా వాఙ్మయమందలి కవితా సంప్రదాయములనుబట్టి పరిశీలించినచో నొక మార్గ మేర్పడవచ్చునని తోచుచున్నది. తమిళ భాషావాఙ్మయము తక్కిన దక్షిణదేశభాషలలోని

దానికంటె నతి ప్రాచీనమైనదని యిదివరకే తెలుపఁబడినది. అందు సంఘ వాఙ్మయ మనునది క్రీస్తుశకారంభముననే మిగుల నుచ్ఛ స్థితిలో నున్నదనుటకు సందేహములేదు. ఈ వాఙ్మయమును బట్టియు, నా కాలపు ప్రధానలక్షణ గ్రంథమగు "తొల్కాప్పియ" మును బట్టియుఁదత్కవితా సంప్రదాయములను మనము గ్రహింప వచ్చును. వాని మూలమున నాంధ్రకన్నడ కవితా సంప్రదాయముల యందలి విశేష లక్షణములు కొంతవరకు సమన్వయముకాకపోవు.

ప్రస్తుతము కన్నడాంధ్రములందు విశేష లక్షణములుగాఁ గనఁబడుచున్న యా ప్రాసవళ్ళనునవి తమిళమునందలి 'తొడై' అనుదానికి సంబంధించియున్నవి. 'తొడై' అనఁగా మైత్రి-అక్షర మైత్రి. ఇది యైదువిధములుగానున్నది. మోనై తొడై, ఎదుగై తొడై అనునవే ఆంధ్ర కన్నడములందు యతి ప్రాసరూపములుగాఁ బరిణమించినవని చెప్పవచ్చును. వీనిలో నొక్కొక్కదానిలో నెనిమిదేసి రీతులు గలవు.[1] అందు - పొఱిప్పుమోనై - అనునదొక

1. అడిమోనై —పాదములోని అన్ని శీర్ల మొదటి అక్షరములు మైత్రి కలిగియుండుట.
2. ఇణై మోనై —ప్రతిపాదములోని మొదటి రెండు శీర్ల మొదటిఅక్షరములు మైత్రికలిగియుండుట.
3. పొఱిప్పుమోనై —1-3. 2-4 శీర్ల మొదటి అక్షరమునకు మైత్రి.
4. ఒరూఉ మోనై —1, 4 శీర్ల మొదటి అక్షరముల మైత్రి.
5. కూళై మోనై — మొదటిది తప్ప అన్ని శీర్ల మొదటిఅక్షరములమైత్రి.
6. మేల్ కదువాయ్ మోనై —రెండవది తప్ప అన్నిటికి.
7. కీల్క్కదువాయ్ మోనై—తుది శర్ వెనుకటిది తప్ప తక్కిన వారికి మైత్రి.
8. ముఱ్ఱుమోనై —అన్ని శీర్ల మొదటి అక్షరము మైత్రి.

పద్యములోని యొక్కొక్క పాదములోని మొదటిగణముయొక్క తొలి యక్షరము, మూడవగణముయొక్క మొదటి యక్షరముతో మైత్రిగలదై యుండుట. రెండవగణ నాల్గవగణముల తొలి యక్ష రములుకూడ మైత్రికలిగియుండవలెను. ఇది సామాన్యముగా పాద మునకు నాలుగు గణములు గల పద్యములను గూర్చి చెప్పినట్లే కనఁబడుచున్నది. కావున మన దేశీయ పద్యములలోఁ బ్రధానము లగు ద్విపద, తరువోజ, సీసము, రగడ మొదలగు వానినుండి మన ముదాహరించుట కవకాశము కలుగవచ్చును.

ద్వి. సురపతి—త్రితయంబు—సూర్యుఁ డొక్కండు
విరమంబు—రెంటిపై-వెలయునొ—క్కటికి.

ద్విరదగతిరగడ—కరమొప్పు పంచలఘు—గణచతుష్టయముచే
విరమంబు రెంటిపై—ద్విరదగతి పేరిచే.

సీ. విజయసా—రథిగాని—వినుతింప—గా నొల్ల
గిరినాయకునిగాని—కీర్తిసేయ....

పై వానిలో మొదటి గణము మూడవ గణముల మొదటి యక్షరముల మైత్రి కలదుగాని, రెండవగణము నాల్గవగణముల మొదటి యక్షరములమైత్రి పాటింపబడలేదు. కాని యీ పద్యము లిటీవలి కాలమునాటివి. ప్రాఙ్నన్న పార్య యుగములో నట్టివే యుండియుండవచ్చును. ఇప్పటికిని దేశీయములగు పాటలలోను, పద్యములలోను రెండవ విధమగు మైత్రి పాటింపబడినవి పరిశీ లించిన లభింపవచ్చును.

ఒరూఉమోనై :— ఒక పద్యములోని నాల్గు పాదముల లోను ఒక్కొక్క పాదమునందలి మొదటి గణము యొక్కయు, నాల్గవగణము యొక్కయు మొదటి యక్షరములకు మైత్రి యుండ వలెను. తెనుఁగునందలి యాటవెలది, తేటగీతి మొదలగు పద్యము లలో నిట్టి నియమము పాటింపఁబడుచున్నది.

ఆ—వె. మూఁడు నగణహగణ-ములు నలనామ
కములు హగణపంచ-కంబు గూర్చ
నాటవెలదియడుఁగు-లంబునిధులపళ్ల
ప్రాలువళ్లు జెంది-వఱలెసేని.

గీ. నగణ మొక్కండు మఱి నల-నామకములు
రెండు నగణంబులును దుద-రెండునాలు
గడుగులును దేటగీతికి-నబ్ధినిరతి
వలయు వళ్లైన ప్రాలైన వరుస నిలుప.

"పువ్వు పేరే జాజి-పువ్వు
పురము పేరే అయోధ్య-పురము
దేవి పేరే సీతా-దేవి"

ఈ రెండురీతులమోనై తప్ప తమిళమునందలి తక్కిన ఆరు రీతుల మోనైలును తెలుఁగు శిష్టకవితలోని పద్యములలో గాన రావు. వానికి ప్రాచీన దేశీయ కవితలో నుదాహరణములు దొరకిన దొరకవచ్చును. తమిళ కవితలోఁగూడ నివి నియతములు గావు, ఐచ్ఛికములే.

కూత్తై మోనై :— తుదిగణమునతప్ప ఒక పద్య పాదము లోని అన్ని గణముల మొదటి అక్షరములును మైత్రి గలిగియుండ వలయును.

గుడుగుఁడు గుంచం గుండే రాగం
పాముల పట్టం పడగా రాగం.
చమ్మచక్క చారడేసి మొగ్గ
అట్లు పొయ్యంగ ఆరగించంగ.

మూట్రుమోనై :— అన్ని గణములలోని మొదటి యక్షర ములును మైత్రి గలిగి యుండవలయును.

ఆంధ్ర కన్నడముల లోని ప్రాసమును తమిళమున "ఎదుగై", లేదా "ఎదుగై త్తొడై" అని అందురు. పద్యము నందలి ప్రతిపాదములోని రెండవయక్షరము మైత్రికలిగియుండుట. ఇదియు నా భాషలో నెనిమిది రీతులు కలిగియున్నది. వీనిలోఁ గొన్నిటికి మాత్రమే తెనుఁగులో నుదాహరణములు దొరుకుచున్నవి.

అడియెదుగై :— అనఁగా నొక పద్యము అన్ని పాదముల లోని మొదటిగణము రెండవయక్షరములు పరస్పరము మైత్రి కలిగి యుండుట. ఇదియే యాంధ్ర కన్నడములలోని జాతులను పద్యము లన్నిటిలోనే కాక సంస్కృత ప్రాకృతముల నుండి గ్రహింపఁ బడిన పద్యము లన్నిటిలోను గూడఁ బాటింపబడుచుండినది. తెలుఁ గున నుపజాతిగణములోఁజేర్పబడిన గీతసీస పద్యములలోమాత్రము లేదు. కాని వీనిలో యతికి బదులుగా దీనిని వాడుట కలదు.

కావున నాలుగు పాదములలోను ప్రాసయతి వేసిన యెడల నా పద్యముకూడ "అడియెదుగ్గై" కలదగును. కన్నడమున గీతికలలో నీ ప్రాసనియమము కలదు. తెలుఁగునందలి సర్వతః ప్రాససీసమున నీ "అడియెదుగ్గై" పాటింపబడినదని చెప్పవచ్చును.

ఇణై యెదుగ్గై:— అన్ని పాదములలోని మొదటి రెండు గణములలోని రెండవయక్షరములు మైత్రి గలిగియుండవలయును. వృత్త ప్రాససీసము లేదా అక్కిలి ప్రాససీసము అనునది దీని కుదాహరణము కావచ్చును.

శిక్షించె నెవ్వాఁడు చేటుకై సభలోనఁ
జెడుమాట లాడిన చేదివిభుని
రక్షించె నెవ్వాఁడు ద్రౌణిబాణముచేతఁ
జెదియకుండఁగఁ బరిక్షన్నృపాలు
భక్షించె నెవ్వాఁడు పర్వతాకృతిచేత
నాభీరు లర్పించు నారగింపు
వీక్షించె నెవ్వాఁడు వేడ్కతో సేవకుల్
బ్రతుకునట్లుగఁ గృపాపాంగదృష్టి....

పొఱిప్పెదుగ్గై:— అన్ని పాదములలోను గణములలో నొకటి విడిచి యొకదాని రెండవ యక్షరములు మైత్రిగలిగి యుండ వలయును.

సర్వతః ప్రాససీసము దీనికుదాహరణము కాఁగలదు.

వేదండవరదుండు వేధోండగాంగుండు
కాదేనశయనుండు యాదవేంద్రుఁ

డాదిత్యవంద్యుండు నాదాససులభుండు
వేదాంతవేద్యుండు కాదనీలుఁ
డాదితేయుఁడు బిందు నాదకళాతీతుఁ
డాదిత్యకులజుఁడు బాధితారి
మేదినీశ్రీశుండు భూధరగాత్రుండు
శ్రీదమిత్రసఖుండు ద్వాదశాత్ముఁడు.

ఒరూఢవెదుగై :— అన్ని పాదములలోని ఒకటవ నాల్గవ గణములలోని రెండవయక్షరములు మైత్రి కలిగి యుండవలయును.

అర్ధచంద్రికలు : అక్షర హరివిక-చాంబురుహాక్షు-
యక్షపసఖనుత-యదుకులదక్షు-
రక్షకసురవిదు-రద్విపరక్షు-
రాక్షసవిదళన-ప్రరుచిరవక్షు-.

ముత్రెదుగై :— అన్ని పాదములలోని అన్ని గణముల రెండవ యక్షరములు మైత్రి కలిగియుండవలెను.

మధురగతిరగడ : కరధృతకరుహుని-గరిహితకరణుని
గరుహసఖరుచిని-గరుడఖగధరుని
ఖరఘనకరవిని-ఖరతరకరగుని
గరళముఖరిపుని-గరధరకరతుని.

(అప్పకవీయము, ౫-౧౨౨)

హాటిప్పియెప్పు అనునది ఇయెప్పుత్తొడై అనుదానియెనిమిది భేదములలో నొకటి. ఇందు ఒకటి విడిచి యొకటిగా గణ

ముల తుదినుండు అక్షరములు మైత్రి గలిగియుండవలెను. దీని కప్పకవి గుచ్ఛబంధమున కుదాహరణముగా నిచ్చిన మాణవక వృత్త ముదాహరణము కాఁగలదు.

గాదిలితో మాలదిగా-గా దిలకించెం బదిగా
గాదిబకృష్ణుండడిగా-గాడిడవా చాలిదిగా.

ఇంకను వీనిలో భేదములు కలవుగాని వాని కుదాహరణ ములు తెనుఁగు కవితలో లభించుట దుర్లభముగా నున్నది. ఇంత వరకు తెనుఁగు కన్నడములలో నక్షరసామ్యరూపముగనున్న యతి ప్రాస లనునవి యేదో యలంకారముకొరకై మధ్యకవులు కొందరు తెచ్చి పెట్టుకొన్నవి కాక క్రీస్తుశకమునకుమున్నే తమిళ వాఙ్మయ మునఁ బరిపాటిగా నిలిచియున్న ప్రాచీన ద్రావిడ కవితా సంప్ర దాయసిద్ధమైన "తొడై" అనుదాని రెండురీతులతో సంబంధించినవే యని తెలుసుకొనగలుగుచున్నాము.

తొడై అనుదానిలో మఱియొక భేదము కలదు. ఇది ఇయైప్పుతొడై. ఇది పాదములలోని తుదిగణములయొక్క-గాని, అక్షరములయొక్క-గాని, మైత్రితో సంబంధించినది. దీనికుదాహర ణముగా నొక కళిక.

"మఱియు బ్రహ్మమాయ గెల్చి-మసలుమంత్రవాదిచేత
నెఱిగి సాంభకునకు వరము-లిచ్చి మెఱయుమోదిచేత"

లాలిపాట-"లాలి శంకరసదా లాలితకుమారా
లాలి పటుతాండవోల్లాస ఘనధీరా"

"భూదేవికూతుర్ని కోయిలారో
జనకునికూతుర్ని కోయిలారో
దశరథుకోడల్ని కోయిలారో
శాంతకు మరదల్ని కోయిలారో"

"వద్దన గూడదమ్మా - వినవమ్మ
ఎఱ్ఱావుపాలుసుమ్మా,
ఎఱ్ఱగా గాచిరమ్మ - మాయమ్మ
జుఱ్ఱవే ముద్దుగుమ్మా
సుదతి భుజియించలేకా - నిజప్రసవ
వేదనకు నిలువలేకా
నొప్పులని చెప్పలేకా - చెప్పకను
చెలుల కనుగప్పలేకా,"

దీనిలో ననేక భేదములు కలవు : అడియియైప్పత్తొడై - ప్రతిపాదములోని మొదటిగణము తుదియక్షరముల మైత్రి.

"గుమ్మడేడే గోపిదేవీ
గుమ్మడేడే కన్నతల్లి
గుమ్మడిని పొడచూపగదవే
అమ్మగోపెమ్మా"

"తొడై"లో మఱియొక భేదము అళపెడైత్తొడై, పద్యములలోని గణములకొరకు కొన్ని అక్షరములను పొడిగించుట, ఒక పదము ఆదియందుగాని, మధ్యనుగాని, అంతమందుగాని ఒక దీర్ఘమ్మునకు హ్రస్వాచ్చును చేర్చవచ్చును. హ్రస్వాక్షరముల తరువాత

పదమధ్యమందుగాని, పదాంత మందుగాని అనునాసికాక్షరములను, అంతస్థములకు ద్విత్వము కల్పించుట, వీనిని కొన్ని పాటలలో గుర్తింపవచ్చునేమో :

"శ్రీరామభూపాలు-డూ (ఉ)-పట్టాభి
షేకుడె యుండగానూ (ఉ)"
"గుడుగుడుగుంచం-గుండేరాగం
పాములపట్టం పడగారాగం
.... .... .... .... .... .... ...."
"నీ(-ఇ)గుఱ్ఱం నీళ్లకుపోతే
నా(-అ) గుఱ్ఱం పాలకు పోతే
"కొండామీదా కొక్కిరాజూ
గుండూవిరిగి పా(=ప)డే
దానీ(=ని)కేమీ మం(మ్) దూ"

ఇట్టీ యతి ప్రాసాదినియమ విశేషములవలెనే తెలుఁగు కవితకు విశేష లక్షణములుగాఁ గనఁబడుచున్న సీసగీతాదులును, ఇంక నిరతములగు ఛందోరచనలును తమిళమునందలి నేర్ నిరై శీర్ల అను గణములతోఁ గూడిన ఛందోరచనతోఁ బోల్చి పరిశీలించిన, నివి యన్నియు ప్రాకృత భవములు గాక ప్రాచీన ద్రావిడ కవితా సంప్రదాయ సిద్ధములే యని యేర్పడవచ్చునని తోచక మానదు.

ఈ దక్షిణదేశీయ చ్ఛందమును సంస్కృతమునప్రాకృతములందలి మాత్రాచ్ఛందములతో సమన్వయించి లక్షణకర్తలు విశేష ప్రయత్నముచేసి, యక్షరగణములనేకాక సూర్యేంద్ర చంద్రగణము

లని, బ్రహ్మ విష్ణు రుద్రగణములని భిన్నరూపముల మాత్రాగణ విభాగమునుగూడ జేసి చూపిరికాని, యివి శిష్టకవితలోని రచనలకు సరిపోయినను ప్రాచీన కవితలోని దేశీయ రచనలకును, తమిళము నందలి ప్రాచీనకవితలో నిలిచియున్న రచనలకు, సరిపోకుండుటచే వాస్తవమగు దక్షిణదేశీయ చ్ఛందస్సంప్రదాయ మింతకంటె విపులము, భిన్నమునై యుండవలెనని తోచుచున్నది. కావున తెలుఁగు కవితయందలి సీస, గీత, ద్విపద, రగడాదులయొక్కయు, శిష్ట కవులచే నిరసింపబడి యడుగంటిన పామరజన కవితా రచనల యొక్కయు లక్షణ సమన్వయమునకుగాను తమిళ కవితా సంప్ర దాయజ్ఞాన మావశ్యకమగుచున్నది. మార్గకవితా రచనాభేదములను దేశీయములుగా జేయుటఁ కందలి వృత్త రచనలందను, జాతుల రచనయందును తెలుఁగుకవులు ప్రవేశపెట్టిన వడిప్రాసలు, దక్షిణ దేశమం దంతకు చిరపూర్వమే దేశీయ కవితాసంప్రదాయసిద్ధములై యుండెనని తమిళ కవిత యందలి తుడై భేదములగు మోనై యెదుగై అనునవి ఎట్లు వ్యక్తము చేయుచున్నవో, అట్లే ప్రాచీన కాలమునుండియు దేశమున వ్యాప్తిజెందియుండియు శిష్టకవుల గద్య పద్యాది సంస్కృత భూయిష్ఠరచనాఘాటి కాగలేక వెనుకపడిపోయిన దేశీయరచనలలోని పెక్కు రీతులను తమిళచ్ఛందో రీతులతోఁ బోల్చిచూచిన నవియు లక్షణసమన్వితములే యగునని తోచకపోదు. ముందు కన్నడాంధ్రముల గల యిట్టి దేశీయ రచనలను గుర్తించి, పిదప వానికి తమిళ రచనలతోఁగల సామ్యము నారయుదము.

నన్నయకుఁబూర్వమునందలి తెలుఁగుశాసనములలో నిప్ప టికి లభించినంతవరకు దేశీయములగు అక్కర, సీసము, తరువోజ మొదలగు ఛందోరచనలే కనఁబడుచున్నవిగదా. సోమనాథుని మూలముగా మనకుఁ దెలియవచ్చిన దేశీయ రచనలు - గద్యలు, ఉదాహరణములు, రగడలు, ఏలలు మొదలైనవి. కన్నడసాహిత్య మున పంపాదు లవలంబించిన చంపూమార్గమునే చేపట్టిన తెలుఁగు కవులు నన్నయాదులిట్టి దేశీయ రచనల పొంతఁబోకుండుటచే గాఁబోలు తరువాతి సన్నిహిత లాక్షణికులుగూడ వీనినిగూర్చి తెలుపలేదు. ఉదాహరణమునుగూర్చి విపులముగా దెలిపినవాఁడు అప్పకవి. అతఁడు దీనిని చాటు ప్రబంధములలోఁ జేర్చినాఁడు.

"నాల్గుదెగల యుదాహరణములు ముక్త
కాదిపంచాదశయును సంఖ్యాన్వితములు
గద్యరగడద్విపదదండకములు మంజ
రులును సంఖ్యారహితచాటువులు నృసింహ."

(అప్పకవి. I-౨౯)

మఱియు నీయుదాహరణ మనునది సద్దళి, బద్దళి, విద్దళి, ఉత్ఫుల్లకము నని నాలుగు తెరగులుగానుండుననియు, నందు

"సంబుద్ధి యెడలించి సప్తవిభక్తులు
పలికిన భక్తి సద్దళి యనంగ
సంబుద్ధితోఁగూడ సప్తవిభక్తులు
పలుక నొప్పారు బద్దళి యనంగ

సంబుద్ధితోడ విషమవిభక్తులతోడఁ
బలికిన కృతియు విద్ధళి యనంగ
గళిక లుత్కళికలు గమకింపఁ బలికిన
కావ్యంబు నుత్ఫుల్లకంబు సనఁగ
నవనిఁ జాటు ప్రబంధంబులందు మిగుల
నాటుకొని యెప్పుచుండు నీ నాల్గు దెగలుఁ
గానఁబడు నుదాహరణముల్ గానలోల"

అని చెప్పుటచే, నితరపద్యశూన్యమై కళికోత్కళికలతో మాత్రమే గూడినది యుత్ఫుల్లకరూపమగు నుదాహరణమైయుండు నని తోచుచున్నది. ఈతనికిఁ బూర్వుఁడు ౧౫-వ శతాబ్దివాఁడు నగు ననంతామాత్యుఁడీయుదాహరణ లక్షణమును దెలిపియున్నాడు గాని తరువాతి యప్పకవి చెప్పిన నాలుగు భేదములనుగూర్చి తెలుప లేదు. వీరికిఁ బూర్వులగు విన్నకోట పెద్దనగాని, కవిజనాశ్రయ కారుడు గాని వీనినిగూర్చి తెలుపనేలేదు. ఇట్లే దేశీయ రచనా విశేషములలోఁ బ్రధానము లనఁదగిన రగడభేదములను గూర్చి పెద్దన చెప్పియున్నను, అతనికిఁ బూర్వుడగు కవి జనాశ్రయ కారుఁడు తెలిపియుండలేదు. అప్పకవి వీనిని వైతాళీయములతో ముడివెట్టి, వానిలో ననేకభేదములు గలవనియు, నందు నవవిధ రగడలనుమాత్రమే తెలిపెదననియుఁ జెప్పగా, పెద్దన తొమ్మి దింటినిమాత్రమే చెప్పి యూరకున్నాడు. ఇట్లు వెనుకకుఁబోయిన కొలదిని దేశీయరచనలనుగూర్చిన ప్రస్తావము సన్నగిలుచువచ్చిన దనిమాత్రము తెలియుచున్నది. ఇందుకు నన్నయాది శిష్టకవులు

వీనిని గ్రహింపకుండుటయే కారణము కావచ్చును. కవిత్రయము వారును, ఆ తరువాతి ప్రసిద్ధశిష్టకవులునుగూడ రగడ, ద్విపద, కళిక మొదలగువానిని గ్రహింపలేదుగదా. కావుననే సామాన్య జనులలో మతప్రచారమున కనువైయుండు నని సోమనాథు డీ దేశీయ రచనలను గ్రహించియుండును.

సోమనాథుఁడు రచించినవి రెం డుదాహరణ గ్రంథములు గనబడుచున్నవి. అం దొకటి తెలుఁగున రచింపఁబడిన "బసవో దాహరణము." మరియొకటి సంస్కృత భాషలో రచింపఁబడినదై నను ఆంధ్రోదాహరణ లక్షణమునే యనుసరించుచున్నదనుట వ్యక్తమే. ఇంతకుఁ బ్రాచీన మనఁదగిన సంస్కృతోదాహరణ గ్రంథమేదియు గానరాదు. దీని లక్షణమునుగూర్చి ప్రాచీనాలం కారిక గ్రంథములలోను దెలుపఁబడినట్లగపడదు. విద్యానాథుఁడు మాత్రము ప్రతాప రుద్రీయమున నుదాహరణ లక్షణమును దెలిపి యున్నాఁడు. కాని యిది యతనికిఁ గొంత పూర్వుఁడో, సమ కాలికుడో యనదగిన సోమనాథుడు రచించిన సంస్కృతోదాహరణ మునుబట్టియే కల్పించియుండు ననవచ్చును. లేదా యాతని లక్షణ మునకు సరియగు మఱికొన్ని కాలగతి నంతరించిన వనవలె. అతని లక్షణమిది :

"యేనకేనాపి తాళేన గద్య పద్యసమన్వితం
జయేత్యుపక్రమం మాలిన్యాది ప్రాసవిచిత్రితం
త దురాహరణం నామ విభక్త్యష్టాంగ సంయుతం"

ఈ లక్షణమునకును, సోమనాథుని రచనాభాగమునకును యత్కించిద్భేద మగపడినను అందలి విభక్తియుతములగు పద్యములనుబట్టియు, కళికోత్కళికాది రచననుబట్టియుఁ జూడగా, నిది దేశభాషలలోని జాతీయకవితా రచనలకు, వీనితో సన్నిహిత సంబంధములేని సంస్కృతాలంకారికులు లక్షణ మేర్పరచు సందర్భమునఁ గలిగెడి భేదమేకాని విశేషము కాదని తోచుచున్నది. ఏలయనగా నేదోయొక తాళమునకు సరిపోవు గద్యములతోడను, పద్యములతోడను గూడినదై, ప్రాసవిచిత్రితమై, అష్ట విభక్తి యుతమై యుండవలయుననుట సమానమే. దేశీయ రచనలగు కళికోత్కళి కలుగద్యలుగా గ్రహింపఁబడెననుటలో నాశ్చర్యము లేదు. సోమనాథుని పంచప్రకార గద్య వాస్తవముగా నుత్కళికా రూపమేయైనను, వచనమువలె వ్రాయబడుచుండుటనుబట్టి గద్యగానే గ్రహింపబడుచుండి యుండును. కోరుమిల్లి శాసనమునను అట్లే యున్నదిగదా. ఇంతేగాక "గద్యమనుదాని నుత్కళికాప్రాయముగా" గ్రహింపవలయుననియు విద్యానాథునికిఁ బూర్వుఁడగు వామనుఁడు తన కావ్యాలంకార సూత్రవృత్తిలోఁ దెలిపియున్నాఁడు.

"గద్యం వృత్తగంధిచూర్ణ ముత్కలికాప్రాయంచ"
"పద్యభాగవ ద్వృత్తగంధి"
"అనావిద్ధలలితపదం చూర్ణం"
"విపరీత ముత్కలికాప్రాయం"

(కా. సూ. వృ. ౧-౩-౨౩)

గద్యము పద్యభాగమువలె వృత్తగంధియై యుండుట యనఁగా నేమో సంస్కృత కవితారచనలనుబట్టి తెలిసికొనుట సాధ్యమగునో కాదో! కాని దేశీయములగు స్త్రీల పాటలు మొదలగువానిలోని 'కంచార్థము' లనఁబడునవి వీని క్రిందఁ జేరవచ్చును. ఇవి ముందు కందాదిపద్యముల ధోరణి కలిగి తరువాత పాటగా మారుచుండుట కలదు. ఈ క్రింది పాటలోని పద్య ముత్వల మాలగా నున్నది.

"శ్రీమధురాధరీ వినవె-శేషగిరీశుఁడ నీదుకేళికా
ధామమునందు నింతవడి—దర్పకలీలల నుండి యంతటన్
వేమరు వేటలాడఁ జని—వేగమె వచ్చితి తల్పుతీయవే
భామా సద్గుణా గుణాభామా లావణ్యాచతురా సీమా!
అలమేలు మంగానామా"

ఇట్టి దేశీయరచనలనుబట్టి యీ విభాగము చేయఁబడినదా యను సందేహము కలుగకమానదు. ఇంతేకాక కన్నడమున గద్య పద్యసమిశ్రితమగుదానిని గద్యయని యందురను ప్రతీతిని కవిరాజ మార్గకర్త తెలిపియున్నాఁడు. పైని వృత్తగంధులని చెప్పఁబడిన గద్యలట్టి దేశీయరచనలేయేమో. వామనుని లక్షణమునుబట్టి గద్య మనావిద్ధ లలితపదమగు చూర్ణము-చూర్ణిక—ఉత్కళికా ప్రాయము

1. "మిగెకన్నడ కబ్బంగళొ
ళగణితగుణ గద్యపద్య సమ్మిశ్రితమం
నిగదిసువర్గద్యకథా
ప్రగీతియుం తచ్చిరంతనాచార్యర్కళ్"

కూడ నగుచున్నది. దేశీయ రచనలలోని యీ యుత్కళికలు గద్యములుగా వ్రాయఁబడియుండుటనుబట్టి దేశీయచ్ఛందో రీతుల నంతగాఁ బాటింపని సంస్కృత లాక్షణికులు వీనిని గద్యలనియే తలంచి యుందురు. ఈ గద్యములు చూర్ణికలునుగూడ గేయములే.

కన్నడమునందలి బెదెండె కావ్యమువలెనే తెనుగున వృత్తములతోపాటు దేశీయ రచనలతోఁగూడిన ప్రాచీన కావ్యము, లేదా చాటు ప్రబంధము 'ఉదాహరణ'మనునది కలదనియేకాక, ఇందుఁ జేర్పఁబడిన యుత్కళికలు 'రగడ' భేదములే యను విషయముఁగూడ మనము ముఖ్యముగా గుర్తింపవలసియున్నది.

"పతిపేరు దొరలంగఁ బద్యమొక్కటి చెప్పి
రగడభేదములు మార్గములుగాఁగ[1]
కళికలు నెనిమిది దళములు గావించి
దానిలో సగము నుత్కళికఁజేసి"

అని అప్పకవియే చెప్పియున్నాఁడుగదా. ఈ కళికోత్కళికలు రగడభేధము లగుటచేతను, ఇవి కన్నడాంధ్ర దేశీయ రచనలలోఁ బ్రాచీనములు, ప్రధానములు నగుట చేతను ఈ రగడల స్వరూపలక్షణములను తెలిసికొనుట యావశ్యకమే. ఆంధ్ర లాక్షణికులకంటె కన్నడ లాక్షణికుఁడగు నాగవర్మ ప్రాచీనుఁడు, నన్నయకుఁ బూర్వుఁడు నగుటచే నాతని మతమును ముందు

1. "రగడభేదములు మార్గములుగాగనుజేసి" యని చివర మూడక్షరముల జేర్చినచో నీ సీసపద్యముకూడ రగడభేదమే యగుచున్నది.

గ్రహింతము. గణ నియమవిపర్యాస ముండినను, సమములైన మాత్రలు గలిగి తాళబద్ధమై యుండునది రఘటాబంధమగు[1] నని రగడలక్షణముగాఁ జెప్పినాఁడు నాగవర్మ. అనఁగా నొక్కొక పాదములో మూఁడో, నాలుగో, ఐదో మాత్రలు గల గణములే యుండుననుట. ఇవి తాళ ప్రధానము లగుటచే పాటల కనుకూలమై యుండును. కన్నడమున నాగవర్మ మూఁడువిధములగు రగడ లనే–మందానిల, లలిత, ఉత్సవ అనువానినే–చెప్పియున్నాఁడు. అనంతా మాత్యుఁడు, అప్పకవి నవవిధములను జెప్పినారు. ఈ తొమ్మిదిరగడలు నందుఁజేరు మాత్రాగణముల భేదమును బట్టి యనేకరీతులు గలవైనను అవియన్నియుఁ జాలవరకు 3, 4, 5, 7 మాత్రలుగల నాలుగేసి గణములతోఁ గూడిన పాదములు గల వని మాత్రము చెప్పవచ్చును. దక్షిణదేశీయ సంప్రదాయసిద్ధమగు గణములలో నాయా మాత్రలు గల వనేక విధములు గలవిగా నుండును గావున నీ రగడభేదములు ననేకవిధములై యుండుననుటకు సందేహములేదు. కావుననే యప్పకవి వీనిని వైతాళీయములతో ముడివెట్టి "వైతాళీయంబులగు రగడ లనేకవిధములుగ నుండు నందు నవవిధ రగడలనుమాత్రము వివరించెద"నన్నాఁడు. మరియు

---

1. గణనియమ విపర్యాసదొ
ళెణెవడె దొళ్పెసెయె మాత్రె సమనాగి గుణా
గ్రగణియ మతదిం దె తాళద
గణనెగొడం బట్టెడదువె రఘటాబంధం. (ఛందోం, ౩-౨-౨-౨)

నివి ద్విపద దండకములతోపాటు సంఖ్యా నియమరహితములగు చాటువులు కావున నాలుగు పాదములే యుండవలయు నను నియమము వీనికి లేదు. కాని తక్కిన పద్యములందువలెనే ప్రాసనియమము, ఆద్యంత ప్రాస నియమముకూడ గలదు.

"ఆద్యంత ప్రాసంబులు
హృద్యంబుగ రెంట రెంట నిడి పాదము లు
ద్యద్యతులఁ గూర్పఁదగు నన
వద్యంబగు రగడలందు వారిజనాభా", (అనం. ఛం.)

కన్నడమందలి "మందానిలము" నాలుగుమాత్రల గణములతోఁ గూడినదగుటచేఁ దెనుఁగున మధురగతి రగడకు సరిపోవుచున్నది.

మందానిలము :

"ఆవే కెయొళతి సంభ్రమ మెసెదిరె
పూవలి పురవీ ధిగళొళ్ నెఱెదిరె...."
"శ్రీకరు ణేశా శ్రుతితతి దేశా
శోకని షుద్దా శోభిత హర్షా"

మధురగతి:—

"నాలుగు మాత్రలు నాటిన గణములు,
నాలుగు రెంటికి నలి విరమణములు." (అప్పకవి)

కన్నడ లలిత :—

5 మాత్రలుగల గణములు నాలుగేసి గల పాదములతోఁ గూడిన దగుటచే తెలుఁగు ద్విరదగతికి సరియగును.

ద్విరద:—

"కర మొప్పు పంచలఘు గణ చతుష్టయముచే
విరమంబు రెంటిపై ద్విరగతి పేరిచే."

లలిత:—

"అల్లి మా మరదల్లి మల్లికాల తెయల్లి
యెశెయసుగె మరదల్లి జళరుహాకరదల్లి...."

కన్నడ ఉత్సవ:—

ఆరు మాత్రలు గల గణములు నాలుగేసి యొక పాదమున గలది.

"ప్రేమవాస సద్గుణైక ధామసూర్య కోసభాస
కోమలాంగ సంతతాభి రామనిర్మలాంతరంగ"

ఇది తురగవల్గమునకు సరియగును. ఇందు తుది గణమున నొక్కమాత్ర తొలఁగించి యొక్క గురువునే నిల్పినచో నిది యుత్సాహ వృత్తమగుచున్నది.

"ఈహమీర సూర్యగణము లేడు గాంతమైన నుత్సాహ
వృత్త మనగఁజెల్లు"

అని అప్పకవి లక్షణము. కొద్ది మార్పులతోఁగూడి నయిట్టి రచన లప్పటికే గల వనుటకు నిదర్శనముగా నాగవర్మయే మరి యొక 'యుత్సాహ'కు లక్షణమును దేశీయ జాతుల క్రిందఁ జెప్పి యున్నాడు.

సోమనాథుని యుదాహరణమందలి కలికాదు లీ రగడ భేద ములే యనుట కీ క్రింది యుదాహరణములు చాలును.

కళిక :—

"వెండియుఁ ద్రిభువన వినుతిసమేతుఁడు
మండిత సద్గుణ మహిమోపేతుఁడు"
(నాలుగుమాత్రలు నాటిన గణములతో గూడినది.)
"వెండియును భక్తాభివృద్ధిఁ బెంచినవాని
బంధమాయాచారపథముఁ ద్రుంచినవాని"
(ఐదేసి మాత్రల నాలుగు గణములతోఁ గూడినది)

ఉత్కళిక :-

"భువనోపకారా భవమోదవీరా
భక్తిసంయోగా ముక్తిసంభోగా."

ఛందోంబుధికారుఁడు వృత్తజాతి విభాగమును గూర్చి చెప్పుచు, సంస్కృత ప్రాకృత పైశాచిక మను మూడున్నర భాషలనుండి పుట్టిన ద్రావిడాంధ్ర కర్ణాటాదిషట్పంచాశత్ సర్వ విషయ భాషాజాతులలో సమ మర్ధసమం విషమమను మూడు తెరగుల వృత్తములున్నవనియు, 26 ఛందములలో బుట్టినవిగాక జాతులనఁబడునవి కొన్ని కలవనియుఁజెప్పినాఁడు. ఈ జాతులలో దేశీయజాతులు మఱికొన్ని కలవు. "అవఱి పొఱగెపుట్టువ మావా వృత్త, దండక రఘట, మాత్రార్య, త్రిపది, చతుష్పది, షట్పది, అష్టపది, శంఖా (సంఖ్యా?) వృత్త, తాళవృత్త ఆదిజాతిగళ్ ఉంటు. అవావు వెందొడె—

మదనవతి, అక్కరం, చౌ
పది, గీతికె, యేళె, తివది, యుత్సాహం, ష

ట్పది, యక్కరికె, కరంచె
ల్వాదవిద ఛందోవతంస మబ్జదళాక్షీ"

ఇట్లు అక్కర, చౌపది, గీతికె, ఏళె, ఉత్సాహ, షట్పది మొదలగునవి దేశీయములగు-అనగా దేశీయములగు బ్రహ్మ విష్ణు రుద్రరూప మాత్రాగణ బద్ధములని కాఁబోలు నాతని భావము-జాతులలోఁ జేర్పబడినవి. వీనిలోఁ బెక్కు తెలుఁగునను గలవు. కావున నివి నన్నయకుఁ బూర్వమే ద్రవిడాంధ్ర కర్ణాట భాషలలోని దేశీయ రచనలలో విశేష ప్రచారమున నుండెననుటకు సందేహము లేదు గదా. నన్నయకుఁ బూర్వ మిట్టి రచనలతోఁగూడిన తెలుఁగు కవిత విశేషముగా నుండియుండును. మొదటఁదెలుపఁబడిన జాతులకును, వీనికిని భేదమేమి? రగడలను మాత్రాగణబద్ధములేయని చెప్పుచు, సామాన్య జాతులలోఁ జేర్చి అక్కర, చౌపది, గీతికె, షట్పది మొదలగువానిని దేశీయజాతులలోఁజేర్ప గారణమేమి యను ప్రశ్న బయలు దేరక మానదు. ఇదియే ఆర్యానార్య చ్ఛందోరీతులకుఁ గలిగిన సంఘర్షణములోని ముఖ్యఘట్టమని చెప్పవలసి యున్నది. జాతుల విషయములలోఁ గన్నడ దేశీయములకును, దెనుఁగు దేశీయములకును గల భేదమును గూడ నిచ్చటనే మనము గుర్తింపవలసి యున్నది. ఏలయనఁగా జాతులు మాత్రా సంఖ్యాబద్ధగణములతోఁ గూడినవి. అవి సంస్కృతమునను గలవు. ప్రాకృతమునను గలవు. ప్రాకృతము నందలి వానిలోఁ దత్తద్దేశీయములు కూడఁ జేరి యుండవచ్చును. కన్నడాంధ్ర భాషల లోని ఛందో రచన

లకు సంస్కృతభాషాపండితులే లక్షణ మేర్పరుపవలసి వచ్చినది. ఆ సందర్భమున వారి దృష్టిలో బ్రధానములు సంస్కృత ప్రాకృతములే గనుకను, తద్రీతులే వారి కెక్కువగాఁబరిచితములు గావునను వృత్తాదులను గురించి ముందు చెప్పి, మాత్రారచనలను గూర్చి తరువాత చెప్పినారు. ఈ మాత్రారచనలలో సంస్కృత ప్రాకృతములలోనివి కొన్నియు, దేశీయములు కొన్నియుఁగలవు. దేశీయములలో మాత్రాగణబద్ధములగు కొన్నిటిని మాత్రా సంఖ్యా బద్ధములుగాఁగూడ గ్రహించుట కవకాశము కలదుగదా. సర్వలఘు సీసమునందలి యొక పాదమును 4 మాత్రల 7 గణములు, తుదిని 2 లఘువులు, లేదా 1 గురువు కల దానినిగాఁ జెప్పవచ్చును. "ఈహమీర సూర్యగణములేడు గాంతమైన నుత్సాహ వృత్త మనఁగఁ జెల్లు." దీనిని మూఁడు మాత్రల గణము లేడు, నొక గురువు కలదని చెప్పవచ్చును గదా. ఇట్లు మాత్రాగణబద్ధములగు దేశీయ పద్యములకు మాత్రాసంఖ్యా నియమము గల యార్యాపద ములవలెనే లాక్షణికులు లక్షణము కల్పించుట కవకాశమున్నది కాని, అట్లు వీనికి లక్షణము కల్పింపఁబడినచో వీని దేశీయత మాత్రము రూపుమాయుచున్నదనక తప్పదు. వారి లక్షణ మును సంకుచితత్వమును జెందక మానదు. దేశీయత నాశన మగుట యనఁగా నేమో చెప్పవలసియున్నది. ఒక దేశీయ రచనకు దేశీయ మాత్రాగణపద్ధతిని లక్షణ మేర్పడినచో నారింద్రగణములు. రెండు సూర్యగణములు సీస పదమగు నని చెప్పినపుడా యింద్రగణములలో నల, భ లను నాలుగు

మాత్రలుగల గణములైనను రావచ్చును. లేదా నగ, సల, ర. తలను నైదేసి మాత్రలుగల గణములైనను రావచ్చును. మరియు నీరెండును గలిసియైనను రావచ్చును. కాని నాలుగుమాత్రల గణములేయని చెప్పినచో సీసభేదములనేకములలో నొకదానిని మాత్రము గ్రహించి లక్షణము చెప్పినట్లగును. ఇట్లే రగడల విషయమునఁగూడను. ఆంధ్ర కన్నడ భాషాలాక్షణికులు గ్రహించిన రగడలన్నియు పాదమునకు నాలుగైదు గణములతోఁగూడినవి. లేదా వీనిని రెట్టించి యొక్కపాదముగాఁ జేసినవి. నాలుగుమాత్రలు నాటిన గణములు 'నాలుగు' అని అప్పకవి చెప్పగా, దానినే "అనిగగనల, భ, స, లను నాల్గింటిఁగృతి" అని గణపద్ధతిని అనంతుఁ డన్నాఁడు. మధురగతి రగడను రెట్టించి రెండు పాదములను జతచేసిన విజయమంగళ మగునుగదా. క్రౌంచ పదముకూడ నాలుగు మాత్రల నాలుగు గణములను రెట్టించుటచే నేర్పడినదే యని చెప్పవచ్చును. ఈ గణముల యమరిక నాలుగు పాదములలో నొక్కరీతినే యున్నచో నది వృత్తముగా భాసించును. ద్విరగతిని రెట్టించిన విజయ భద్రము ఇట్లు 5 మాత్రలగణములు నాలుగిటిని రెట్టింపఁగా వచ్చిన వానిలోని భేదములే లయవిభాతి, లయగ్రాహిత్యాది మాలా వృత్తములు. వీనిలో పాటలోని సౌకర్యముకొరకొక మాత్రయో, గణమో తగ్గింపబడి యుండును. మొత్తము మీద నివియన్నియు తొలుత నాలుగు గణములతో గూడిన పాదములు గలవియే. మాత్రా సంఖ్యా నియమమునకో, అక్షరగణ నియమమునకో లొంగినంతవరకు లొంగఁదీసికొని

లాక్షణికులు వీనికి లక్షణ మేర్పరచినారు. ఇంకను అందని వానిని వదలివేసినారు. కొన్నిటిని తాళశబ్దములని గ్రహించియున్నారు. అట్టి వనేకములు సామాన్యజనుల పాటలలో నుండును. దేశీయ గణ లక్షణమునుబట్టి చూచినచో నా పాటలకును లక్షణ మేర్పడకపోదు. మచ్చున కొకటి—

"లాలిబం గరుబొమ్మ, లాలి మా యమ్మా
లాలిము ద్దులగుమ్మ లాలిసీ తమ్మా—లా(అ)లీ.
జోజోచి దానంద జోజోము కుందా
జోజోకృ పాపాంగ జోసుందరాంగా—జో(ఓ)జో"

ఇవి కించద్భేదముతో 5 మాత్రల నాలుగు గణములతోఁ గూడినవే. 7 మాత్రలుగల నాలుగేసి గణముల పాదములు గల వృషభగతిరగడభేదమే గుమ్మడిపాట యగుఁనని యిదివరకే సూచింపఁబడినది. 'గుమ్మడేడే గోపిదేవి గుమ్మడేడే కన్నతల్లీ ...'

మన సీసపద్యముకూడ వాస్తవముగా నాలుగేసి గణములు గల పాదములను రెట్టించుటచేత నేర్పడినదే. ద్విపదకు మూఁడింద్రగణములు, నొక సూర్యగణము కలిసి నాలుగు గణములేకదా పాదమునకు. కావున ద్విపద రెండు పాదములును గలిసి సీసమున నొక పాదము కావచ్చును. ఆరింద్ర గణముల నొక చోటను, రెండు సూర్యగణములను తుదిని జేర్చినచో సీసపద్యపాదమైనది. అనఁగా ద్విపదనే యించుక మార్పుతోఁ జదివినచో సీసపద్య పాదమే యగుననుట.

"ఆరూఢగద్యపద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠరచన"

దీనిలో రెండవ పాదమునందలి రెండుమూడు గణములను నలములుగాఁ జేసినచో సీసమగును.

"ఆరూఢగద్యప ద్యాదిప్రబంధపూ
రితసమకృతబహు శ్లేష్టరచన."

"నల"ముకూడ నింద్రగణమే కావున నా మార్పువలని బాధలేదు. అయితే దీనిని 'రగడ'లతోఁ బోల్చుట కొక చిక్కు మాత్రము కలిగినది. మొదటి నాలుగు గణములును ఐదేసిమాత్రల గణము లైనవి. తరువాతి రెండును నాలుగేసి మాత్రల గణములు, తుదిరెండు మూఁడుమాత్రల గణములైనవి. రగడలలో పాదము లన్నియు నొక విధమైన మాత్రాసంఖ్యా నియమముతోఁగూడియుండ నక్కరలేదన్నచో, నిదియు నొక రగడభేదము కావచ్చును. సంస్కృత లాక్షణికులు గ్రహించిన మాత్రా సంఖ్యానియమమును దెచ్చిపెట్టుకొనుటవలన నీ చిక్కుగలుగుచున్నట్లగపడుచున్నది గాని, దేశీయగణములు పాదమునకు నాలుగేసి యుండవలయు నన్నచో నా చిక్కు తొలగఁగలదుగదా. 4 మాత్రల గణములైనను, 5 మాత్రల గణములైనను దేశీయగణసంకేతమునుబట్టి ఒక కోటిలోనే చేరవచ్చును. అవి యింద్రగణములే యగును. మరి రెండింటినికూడ–మగణమును, సగమును–జేర్చుకొనిన కన్నడ విష్ణు గణములగును. కావున సీసములలోఁగాని, రగడలలోఁగాని,

ద్విపదలలోఁ గాని, గీతములలోఁ గాని, మాలికా వృత్తములలోఁ గాని వచ్చు నాలుగైదు మాత్రల గణము లే విధముగా వచ్చినను అవి ఇంద్రగణములలోఁ జేరునుగదా. కన్నడవిష్ణుగములలో 6 మాత్రల గణములుకూడఁ జేరును. ఈ కారణముచే నీ పద్యము లన్నియు నొక్క కూటమునకే చేరినవని చెప్పవచ్చునుగదా. అనఁగా 4, 5, 6 మాత్రలు గల నాలుగేసి గణములు పాదము నకుఁ గల పద్యములని కాని, ఆ పాదమును రెట్టించి యొక పాదముగాఁ గల్పించిన పద్యములని కాని చెప్పవచ్చును. అప్పుడి వన్నియు నొక విధమగు రగడభేదములే యని చెప్పఁదగి యుండునేమో !

అయితే ఇందు మఱియొక చిక్కున్నది. ద్విపద, సీసము, గీతము మొదలగు కొన్నిటిలో నడుమ సూర్యగణములు - అనఁగా మూడుమాత్రల గణములు కూడ వచ్చుచున్నవే-ఇవి 4, 5, 6 మాత్రలుగల ఇంద్ర, విష్ణుగణములలోఁ జేరవయ్యేను. లక్షణ సమన్వయ మెట్లగునని అడుగవచ్చును. వాస్తవమే. ఆ విషయము తెలిసికొనుట కవకాశము లేకయే ప్రాచీన లాక్షణికులు ఇట్టి చిక్కులు వడి ఇన్ని విభాగములను చేసినారు. దేశీయగణము లని పేరుపెట్టి వానిలో ఇంద్ర - విష్ణుగణములను కూటములో 4, 5, 6 మాత్రలు గల గణముల నెట్లు సమకూర్చుటకు నొప్పు కొనియున్నామో అట్లే మూఁడు మాత్రలు గల గణములనుగూడ మఱియొక పేరుపెట్టిగాని. పెట్టకగాని 4, 5, 6 మాత్రల ఇంద్ర-విష్ణు గణములతోపాటు పద్యపాదములోఁ జేరవచ్చునని, అట్లు

చేరుట దేశీయ రచనల లక్షణమని మన మేర్పాటు చేసికొనినచో నీ చిక్కు వదలి పోవునుగదా. అయితే ఇట్లు చేయుచుఁబోయినచో నియమాభావము కలుగునే యను నాక్షేపణ కలుగవచ్చును. కాని మనము క్రొత్తగాఁ జేయఁదలచిన నాక్షేపణీయమగునేమో కాని, అట్టి దానినే ఒక నియమముగాఁ బాటించిన లాక్షణిక పద్ధతి యొకటి సిద్ధమై యున్నచో నీ యాక్షేపణ పాటింపదగినది కాకపోవును. ఇట్టి పద్ధతి దక్షిణ దేశీయచ్ఛందస్సంప్రదాయ సిద్ధము. అది తమిళ చ్ఛందోలక్షణ పద్ధతిలో నిలిచియున్నది. అచ్చట అగవల్పా అను రచనలో 4, 5, 6 మాత్రల గణములతో పాటు ౪ మాత్రల గణములు గూడ నీ నాలుగు గణముల పాదములో నిలువవచ్చును. ఇట్లు దక్షిణదేశ భాషా ఛందస్సంప్రదాయములకు సన్నిహిత సంబంధ మున్నదను దృష్టితో చూడక, ఆర్యభాషా ఛందస్సంప్రదాయ దృష్టితో నీ దేశ భాషా రచనలను జూచి, వానికి లక్షణమేర్పఱచుటచే నీ దక్షిణ దేశీయ భాషా రచన లొకదానితో మఱియొక దానికి సంబంధములేని పద్ధతులతోఁ గూడినవిగాఁ గనఁబడుట తటస్థించినది. ఇంతేకాక కాలగతి నా యా సంప్రదాయములలోఁ గొంత మార్పును గలిగినదనుటకు సందేహము లేదు.

నాగవర్మ ఛందోంబుధిని సంపాదించి ప్రకటించిన కిట్టెల్ పండితుడు నాగవర్మ చెప్పిన రఘటా భేదములను దెలిపి, అర్వాచీనుఁడగు కవి జిహ్వాసంబంధ కారు ననుసరించి కాఁబో

లును, మఱి కొన్నిటిని రఘటాభేదముల క్రిందఁ జేర్చినాఁడు. అందు సీసము ఆటగీతె, చౌపది, త్రిపుడెతాళము, ఏకతాళము, అష్టపది, లయిగ్రాహి అనునవి కలవు. ఇవి ఛందోంబుధిలో కానరావు. కాని కర్ణాట విషయజాతులని నాగవర్మ అక్కర, త్రిపది, చౌపది, ఛందోవసంత, ఏళె, గీతికె, ఉత్సాహ, షట్పది అనువాని లక్షణముఁ దెలిపినాఁడు. ఇవి దేశీయములగు బ్రహ్మ విష్ణు రుద్ర సంజ్ఞితములగు మాత్రాగణములతోఁ గూడినవి. వీనిలోఁ గొన్ని తెలుఁగు శిష్టకవితలోఁగాని,సామాన్యజనరచనలలోఁగాని యున్నవే. అక్కరలు కన్నడాంధ్రములను సా˘ాన్యములు. కాని లక్షణము నను, పేళ్ళలోను కొంత భేదము లెకపోలేదు. ఉత్సాహ లక్షణము కన్నడాంధ్రములకు సమానమే. నాగవర్మ యొక శరషట్పదిని మాత్రమే చెప్పినట్లగపడును. తరువాతివా రారుతెఁగల షట్పదులని జెప్పిరి. తెలుఁగులోని శిష్టకవితలోని కివి యెక్కలేదు. కాని పాటలలో నీ రచనలు గానవచ్చును. నాగవర్మ చెప్పిన షట్పది యిది. ఇందు 6 విష్ణుగణములు, 1 రుద్రగణము, మూడు పాదములు గల సగము పద్యమగును.

శరషట్పది—"మందర ధరగణ
మొందిర కడయోళ్
కుందదె నెలసుగె మదనహరం
ఇందుని భావనె
ముందణ తెఅని
యందమె యాగలె షట్పదికేళ్."

దీనికి 4 మాత్రల గణము లేదు. ఒక గురువు అనియు లక్షణము చెప్పవచ్చును. ఈ షట్పదులు ఝంపె తాళబద్ధములని కూడఁ జెప్పఁబడినది.

నాలుగు మాత్రలు గల షట్పదులను గొన్నిటిని తెనుఁగున స్త్రీల తలుపులదగ్గర పాటలలో మనము గుర్తింపవచ్చును.

"శ్రీతరు ణిరొనే శ్రీరఘురాముడ
జేరిక వాటము_దీ_వే
జేరిక వాటము_దీ_వే
ఖ్యాతిగ శ్రీరఘు రాముడవై తే
కోతుల జేరగ దో_యీా ఘన
సేతువు గూర్పగ దో (ఓ) యీా."

తెలుగుషట్పదికి అప్పకవి లక్షణమిది :

"ప్రాసము లుమ్మమ్మారు వాసవు లార్గురు
పై సుధా దీధితి తోనిర్యతీ
భాసిల్ల గాఁబాద మీసూటి తోనాల్గు
జేసిన కృతులందు షట్పదాఖ్య."

ఇందలి మొదటిపాదము చివరి చంద్రగణమును తగణము గురువుగాఁ జేసినచో నే డింద్రగణములు, ఒక గురువు అని చెప్ప వచ్చును. కన్నడ పద్యమునఁ గూడ నేడవ రుద్ర గణమును విష్ణు గణము గురువుగాఁ జేయ వచ్చును. ఇట్లు కన్నడాంధ్ర

పద్యముల లక్షణము సరిపోవును. కాని కిట్టెల్ చేసినట్లు మాత్రా సంఖ్యలను నిర్ణయించినచో - అనగా 4 మాత్రల గణములని, 5 మాత్రల గణములని చెప్పినచోఁ దెలుఁగు పద్యము కుదురదు. ఇందు కొన్ని 5 మాత్రలవి, కొన్ని 4 మాత్రలవి కూడ నున్నవి. కాని పాటకు సరిపోవునట్లు హ్రస్వదీర్ఘముల నించుక మార్చి సరి పెట్టుకొనుట కవకాశము లేకపోదు. దేశీయగణ నిర్మాణ పద్ధతిని బట్టి యీ చిక్కు రాకమానదు. 5 మాత్రల గణములు గల షట్పదిని కన్నడమున కుసుమ షట్పది అని యందురు. ఇది తెలుఁగున నప్పకవి చెప్పినదానికి సమానము కావచ్చును.

"కుసుమ షట్పదియమొద
లెసెవపద యుగ్మక్కె
దశమాత్రె గళమేల ణొందొందఱూ"

ఇట్లు నాలుగైదుమాత్రల గణములను నాలుగేసి చేర్చినచో నివి మధురగతి ద్విరదగతి రగడల పాదములగు చుండుట లేదా? కావున నీ షట్పదులును రగడభేదములే యనుటకు సందేహ మేల? కాని భేద మెచ్చట నున్నదనఁగా రెండవ నాల్గవ పాదములలోని తుది గణము కొంచెము హ్రస్వమైనది. అనఁగా నాలుగైదుమాత్రల నింద్ర గణమునకు బదులుగా 2 మాత్రలు గల గురువైనవి. ఇది పాటకొరకు చేసిన మార్పే. ఈ మార్పు లేనిచో నివి ఆయా రగడల రెండు పాదములగును. ఇట్టి పాట లనేకములు గలవు

వినాయక చవితినాడు పిల్లలు పాడుకొను మంగళహారతి యొకటి.

"శ్రీశంభు తనయునకు
సిద్ధగణ నాధునకు
వాసికల దేవతా - వందితున-కూ
ఓబొజ్జ కనకయ్య
నీ బంటు నేనయ్య
ఉండ్రాళ్ల మీదికీ-దండుబం-పూ,
జయమంగ ళంనిత్య
శుభమంగ ళం—

శుక్రవారము పాట

"ఈశ్వరా పుత్రునకు
గాజావ తారునకు
పార్వతీ తనయునకు—భక్తితో-నూ"

ఇచ్చట నొక విశేషమేమనగా, నిందలి తుది గురువును హ్రస్వముచేసి యుంచుక మార్చిన నిది యొక సీస పద్య పాదమే యగును.

"శ్రీశంభుతనయునకు సిద్ధగణనాధునకు
వాసిగల దేవతా వందితునకు
ఈశ్వరపుత్రునకు గాజావతారునకు
పార్వతీతనయునకు భక్తితోడ"

షట్పదులలోఁ దుదిది చంద్రగణముగా గ్రహింపఁబడినది. అదియే రెండు సూర్యగణములుగా గ్రహింపఁబడినపు డా రింద్రగణములు, రెండు సూర్యగణములై సీసపద్యపాదమైనది. షట్పదులలోఁ దుది గణము పూర్తిగా 4, 5 మాత్రలు గలిగి యుండినచో నదియే రగడ యగు చున్నది. కావున నీ రగడలనే పాటల కనుకూలముగా తుదిపాదము నించుక మార్చినచో నెన్ని విధములుగా మారునో చెప్పుట కవకాశము లేదుగదా. ఇక బ్రహ్మ విష్ణు (సూర్యేంద్ర) గణముల కలయికతోఁ గూర్చి చెప్పిన నింక నెన్ని విధములగునో విచారింపుఁడు. మఱియొకపాట—

"చెంగావి చీరెలా
కొంగూలు జీరాడ
రంగైన నవమోహనాంగి యెక్కడికే
చంద్రూని శిరమూన
ధరియించు కొన్నట్టి
జగములే లెడుజగ (గా) ధీశుసన్నిధికే
మంగాళం మంగాళం"

మేలుకొలుపు పాటలు అయిదేసి మాత్రల గణములతోఁ గూడినవే.

"కేశవా యనినిన్ను వాసీగ భక్తూలు
వర్ణింపుచున్నారు మేలుకో
వాసావ వందీత వసుదేవ నందాన
వైకుంఠపురవాస మేలుకో తెల్లవారవచ్చేనూ

తెల్లవా రావచ్చె తెలియాక నాసామి
మళ్లీప రున్నావు లే-రా
వేణునా దముపీని వేగప గ్గిడివ స్తి
వేళాకో ళామేల-లే-రా

ఈ క్రిందివానిలోని తుదిగణమున నొక మాత్ర తక్కువగాఁ గనఁబడినను రాగమున సరిపోవును.

లాలిపాట—

"లాలిబం గరుబొమ్మ లాలిమా యమ్మా
లాలిము ద్దులగుమ్మ లాలిసీ తమ్మా-లా(ఆ)లీ
జోజోచి-దానంద-జోజోము-కుందా
జోజోకృపాపాంగ జోసుందరాంగా-జో(ఓ)జో."

అప్పగింత పాట—

"ఘనమైనతొడవులను కట్నాలనిచ్చి
వేచనేజనకుఁడూ వైదేహి నంపా....
నెయికాచనేరదూ నెలమిమీ వదినా,
నేర్పుతోపను లెల్లనేరుపా వమ్మా,
బుద్ధు లెరు గదు మంకు బుద్ధులేగాని
బుద్ధులొచ్చినదాక దిద్దుకోవమ్మా
ఆబాలయెరుగదు అదిబాలసుమ్మీ
మీబాలలలొనొక్క బాలగా జూడూ"

భోగషట్పది—

"భోగషట్ప దంగళొలగె
బేగ మొదలపాదయుగ్మ
కాగళక్కు మర్కమాత్రె లెక్కసంఖ్యయో"

సూర్యగణములు తొలి రెండు పాదములలోను నాలుగేసి. మూడవపాదమున నారుగణములు, నొకగురువు. మొదటి రెండు పాదములు హయప్రచారరగడ పాదములతో సమానములే.

"ఋతువిరామ మినులు నల్వ
రతుక నొక్క యంఘ్రిచెల్వ"

రగడలోని మూఁడు నాలుగు పాదములను గలిపి యొక పాదముగాఁజేసి, అందు నాలవ పాదములోని నాలవ గణమును లోపింపఁజేసి మూడవగణము నేక గురువుగాఁ జేసిన భోగ షట్పది మూడవపాద మగుచున్నది. నాలుగేసి గణములు గల హయ ప్రచారపాదము నినుమడించిన తురగవల్గన పాదమగునుగదా. ఈ ఎనిమిది గణముల పాదములోఁ దుది నొక మాత్రను తొలగించి యా గణము నొక్క గురువు కల దానినిగాఁజేసిన ఏడు సూర్యగణ ములు, ఒక గురువుగల—ఉత్సాహ వృత్తమునకొక పాద మగుచు న్నది. అనఁగా హయప్రచార రగడ రెండు పాదములను జేర్చి తుది గణములో నొక మాత్రను తీసివేసిన ఉత్సాహ పాదము, హయప్రచారము నాలుగవ పాదములో తుదిగణము, దానివెనుకటి

దానిలో నొక మాత్రను దీసివేసినచో భోగషట్పది అగునన్న మాట. మన ముసలమ్మలు పాడుకొను తులసిపాట యీ భోగ షట్పదియే.

“తులసి యింట నుంచువార్ని
తులసిపూజ చేయువార్ని
తులసియందు భక్తియుంచి మెలగువారి-నీ-
తులసిజూచి మ్రొక్కు-వార్ని
తులసి యనుభవించువార్ని
తెలిసినీవు వారిదిక్కు—తొంగిచూడ-కూ
సువ్విపాటకూడ నీ షట్పదీరూపమే.
“సువ్వి సువ్వి రామచంద్ర
సువ్వి సువ్వి కీర్తి సాంద్ర
సువ్వి-సీ-తమ్మమాకు, శుభమె-లి-మ్మా”

ఇందలి విశేష మేమనఁగా - ఏకాక్షరగణములు కూడ నున్నవి.

“మోదమును పెండ్లి పీట
మీద శ్రీరామ సరస
ఆదిలక్ష్మియైన సీతమ్మ నునిచి-రీ.
వాటమైన కుందనంపు
మేటికుందె యందులిచ్చి
గాటమైనపసిడి రో-కళ్లు బట్టు-కా-

రాజనములు ఇప్పపువ్వు
రాజనములు మంచిపునుగు
మేలుకొండ రాజనములు, మేలు వంకె-లూ-
కుందియందు నాడ నునిచి
కొట్నమూలు దంచి రపుడు
కుంద రదన లెల్ల నవ్వు కొనుచు జెలగు-చూ."

మంగళహారతి——

"రామచంద్రాయజనక రాజజామ నోహరాయ
మామకా భీష్టదాయ మహిత మంగ—ళం

భామినిషట్పది——

"భామినీయష ట్పదియ మొదలొళ
గామహాపా దద్వయంగళు
నేమిసలుమనుమాత్రెమేలణ పాదమొందొం—దో"

మూడునాలుగు (3+4) మాత్రలు గల రెండు గణములు చేరి ఒక పాదమగును. మూడవపాదములో నట్టివే మూడు గణములు తుది నొక గురువు నుండును. ఇది హరిణగతి రగడభేదమే కావచ్చును.

"భాను యుతనల భసగ గంబుల
లోన నిరుదో లునన గంబుల"

ఇది గుమ్మడిపాటకు సరిపోవును.

"గుమ్మ డేడే గోపి దేవీ
గుమ్మ డేడే కన్న తల్లీ

గుమ్మడినిపొడ సూపగదవే-అమ్మగోపె-మ్మా
అమ్మా-గుమ్మ-డేడే.
ప్రుచ్చుతనమున వేదములుగొని
తెచ్చివెరచుచు జలధిలోపల
జొచ్చియున్నా వానివెంబడి జొచ్చిజలనిధిలో
మత్స్యమై సోమకుని ద్రుంచితి
మగుడ చదువులు బ్రహ్మకిచ్చితి
అక్షణంబున గుమ్మడనియెడి మాటనే నెఱుగా
అమ్మా గుమ్మడేడే"

కన్నడమునఁ గర్ణాటజాతులలోఁ జేర్చి నాగవర్మ ఒక 'ఏళె' అనుదానికి లక్షణము చెప్పినాఁడు. దాని కారు రుద్రగణములు, ఒక అజగణము నుండవలెనని యున్నది. కాని దాని నడకకూడ తెలుగు 'ఏల' పాటలతోఁ సరిపోవునట్లగపడదు. దేశభేదములను బట్టి పాటలోఁ గలిగిన మార్పు మూలమున లక్షణమునఁగూడ కొంత భేద మేర్పడవచ్చును. కాని "ఏల" యనునది నాగవర్మ నాటికే దేశీయ రచనా భేదముగాఁ బ్రచారములో నున్నదనుట నిశ్చయముగదా. సోమనాథుఁడు బసవపురాణము నేలలుపెట్టి పాడినట్లు చెప్పియున్నాఁడు. కావున నిడియు సోమనకుఁ బూర్వముననే కాక, నన్నయకుఁబూర్వము నాగవర్మనాటికే కన్నడదేశము నందువలెనే తెలుఁగుదేశమందును బ్రచారములో నున్నదని యెంచనగును.

ఈ "యేల" యనునదికూడ పైని చెప్పిన హయ ప్రచార రగడకు సంబంధించినదై నాలుగేసి సూర్యగణములు గల పాద

ములతోఁ గూడి భోగషట్పది రకములోఁ జేరఁ గలదని తోచు చున్నది. ఇవి యిటీవలి యక్షగానములలో మాత్రమే గానవచ్చు చున్నవి.

కంసాలి రుద్రయరచితమగు "సుగ్రీవవిజయ"మను యక్ష గానములోనిది. "ఏల"—

"భాను వంశా మూన బుట్టి
దానా వాకా మీని గొట్టి
పూని మఖము నిర్వహింపా_వా_ఓరామచంద్ర
మౌనివరులు సన్నుతింపా_గా
రాతినాతి జేసి పూరా
రాతిచేతి విల్లువిఱిచి
భూతలేంద్రు లెల్ల మెచ్చా_గా_ఓ_రామచంద్ర
సీతనూ వివాహమాడా_వా."

ఇంకను నిటీవలి సారంగధర యక్షగానములో నిది-

"పావురంబు ఎగర వేయూ_డీ_ఓ_బాలులారా
పావురంబు ఏగరవేసీ పిలిచితేను మళ్లి వచ్చు (ను)
ఒకుగెల్పు రెండుచూడ-వలెనుగాక యిపుడుమీరు
పావురంబు నెగరవేయు_డీ_ఓ_బాలులారా."

(సారంగధర- వీథినాటకము.)

పాటలో గొన్ని 2 గురువులు గల గణములుగాఁగనఁ బడుచున్నవి. కన్నడ గణవిభాగ పద్ధతిని బ్రహ్మగణములలో

గగముకూడఁ జేరును గావున నా విభాగమునుబట్టి యది దక్షిణ దేశీయ పద్ధతియే యనుటచే సమర్థనీయమే యగును. తమిళ పద్ధతి యింకను విపులమని ముందు చూడఁగలము.

ముద్రితమైయున్న ఛందోంబుధిలో గానరాకున్నను కిట్టెల్ సంపాదించిన గ్రంథములో రగడ భేదములుగా గ్రహించినవానిలో అష్టపది, ఏకతాళ, త్రిపుట అనునవిగూడఁ గలవు. నాలుగుమాత్రల చరణములు పాదమునకు రెండేసి చొప్పున నెనిమిది పాదములు గూర్చి, ఎనిమిదవ పాదమున మఱి రెండు గణము లధికముగా జేర్చినచో నష్టపది యగును. ఎనిమిది పాదములకును ప్రాసము కలదు. ఇందలి రెండేసి పాదములు నాలుగు మాత్రల నాలుగు గణములు గల మధురగతి రగడ యగును గావున దీనిని రగడభేదమే యనవచ్చును. ఇదియు నేకతాళ జాతిలోఁ జేరినదే యనియు, వృత్తము కాదనియు, తాళబద్ధములగు జాతులలోనిదనియుఁ దెలియుచున్నది. త్రిపుట తాళమున కిచ్చిన యుదాహరణమును బట్టి

$(\overbrace{3+4}+\overbrace{3+4}+\overbrace{3+4}+\overbrace{3+2})$ మూఁడేడు మాత్రల గణములు, నొకటి అయిదు మాత్రల గణముతోఁ గూడినదని చెప్పవచ్చును.

"మగ నెసనిం తళియె నెయ్రిపె నెంతొ పేళెయ్ శంకరా."

కావున నిది తెలుఁగు నందలి వృషభగతిరగడ కావచ్చును. తుది పాదమునందలి రెండు మాత్రల పాటకొఱకు లోపించి యుండును.

24)

ఈ త్రిపుట ఏకతాళాదులు రగడభేదములేయని, లేదా కొన్ని మాత్రలను తొలఁగించి చదివినచో నా యా రగడ లీ యీ తాళములకు సరిపోవునని యప్పకవి చెప్పియేయున్నాఁడు. ఇంతే కాక యీ తాళాదులతోఁగూడిన రగడ భేదములగు పాటలు, చంద్రికలు, అర్ధచంద్రికలు మొదలగునవి యక్షగాన ప్రబంధములలో తరుచు ప్రయోగింపఁబడుననికూడఁ జెప్పినాఁడు.

"తుద నేడు లఘువులు తొలగించి చదివిన
త్రిపుటకు వృషభగతిపదయుగము.
లలి గడపల నొక్క లఘువుమానిన జంపె
యను ద్విరద గతి సమపదయుగము.
గురుతు రూపకమునకుఁ దురగవల్గనా
హ్వాయ మేకతాళి యామధురగతికి
(హరికి నిర్వదినాలు గటతాళమున మాత్ర
లోలి విశ్రాంతిపద్మాలుగింటఁ
దెలియ నర్ధంబు నర్ధచంద్రికలు వీన
యక్షగానప్రబంధంబు లతుకవచ్చు
రగడభేదంబు లివి యంద్రు రసగవీంద్రు
లవిత నిజసేవకస్తోమ యబ్ధిధామ."

రగడలను పాట కనుకూలముగాను, ఆయా తాళములకు సరిపోవునట్లుగాను తుదను కొన్ని మాత్రలను తగ్గించి పాడురీతులు యక్షగానఫక్కిలోఁ బ్రచురమై యుండును. సోమనాథుఁడు తన కాలమున ననేక విధములగు నాటకములాడువారినిగూర్చి చెప్పనే

కాని యక్షగానముల విషయమున నా యా వేషములు వేసికొని పాడుటకే ప్రాధాన్యమిచ్చినట్లున్నది. అప్పటి కవి యింకను గాన రీతులే కాని ప్రదర్శనార్థ్యములు కాలేదేమో!

రంగాజమ్మ రచించిన "మన్నారు దాసవిలాస నాటకరాజం" అను యక్షగానమున దరువులు, తాళములును గలవు.

వృషభగతికి త్రిపుటతాళము–అనగా 7 అక్షరములు, 3 దెబ్బలు $(3+2+2)$. ఇదియే ఛందోంబుధిలోని "త్రిపుడెతాళ".

"శ్రీమనోహరు నంబుజోదరు
చిత్తజాతగు రుందలంచె"

మధురగతికి ఏకతాళము, 4 మాత్రలు, 1 దెబ్బ.

"చందన చరిత్ర నీలక ళేబర
పీతవసన వనమాలీ"

కిట్టెల్ చెప్పిన కన్నడ అష్టపదియు నాలుగక్షరముల రెండేసి గణములతోఁగూడిన యేకతాళము గలదగుచున్నది.

జంపెతాళము, ద్విరదగతికి, 5 అక్షరములు లేదా మాత్రలు, 2 దెబ్బలు.

"నీవాడ నేగాన నిఖిలలో కనిదాన"

"శ్రీయువతి నిజయువతి
జేసియెం తయు మించి" (అనంత. ఛం)

రూపకతాళము, తురగవల్గనము. 6 అక్షరములు, 2 దెబ్బలు.

"వరవీణా మృదుపాణీ వనరుహలోచనరాణీ"
"శ్రీ సతీశు బరమపురుషు
జిత్తమున దలంచువారు" (అనం. ఛం.)

రంగాజమ్మ రచితమగు మన్నారుదాసవిలాస నాటకమను యక్షగానమున రూపక తాళమున కుదాహరణమొకటి కలదు.

"చందనాచల కందరోదర మందమారుత బృందసోదర
నంద్యకోవిద నంద్యసద్రస తుందిలోదిత కందళోజ్జ్వల."

ఇక తెలుగు కవితలో నన్నయకుఁ బూర్వమునను, తరువాతనుగూడ సమానమైన ప్రాధాన్యమును వహించినవి సీస, గీతములు. ఇవియే యాంధ్రచ్ఛందోరచనలలో ప్రాచీనములు. కన్నడముతోఁ బోల్చినపుడు ఆంధ్రకవితకు విలక్షణములునై కనఁబడుచున్నవి. త్రిపది, చౌపది, షట్పది మొదలగువానికి ప్రాచీనకాలమున శిష్టకవితలోఁ బ్రచారమున్నట్లగపడదు. రగడలనుగూర్చి ప్రాచీనులగు తెలుఁగు లాక్షణికులు స్మరింపలేదు. ఇప్పటికి లభించిన తెలుగు లక్షణ గ్రంథములలో మొదటిదగు కవిజనాశ్రయము తత్ప్రతికాకారుబు చెప్పినట్లుగా కొంతవరకుఁ బ్రాచీన కర్ణాట గ్రంథమర్యాద ననుసరించి - ఛందోంబుధియందువలెనే—తొలుత వృత్తాధికారమున సమవిషమ మాలావృత్తాదులను, పిదప జాత్యధికారమున—

"జాతులు మాత్రాసమక
ఖ్యాతగణప్రతతిఁ జెప్ప గందములయ్యెన్
గీతులు మొదలగునవి యుప
జాతులు భూతలవినూత్న జాతయశస్కా."

అని, పిదప ప్రత్యేకముగా తెలుఁగుజాతులనుగూర్చి-

"వెలయంగఁ దెనుఁగుబాసకు
దలమయ్యెడు సీసములను దర్వోజలు గీ
తులు నక్కరలను ద్విపదలు
పొనుపొందగ రేచఁ దిష్టమున నొనరించున్"

అని చెప్పెనేకాని రగడభేదములనుగాని, షట్పది, ఏలె మొదలగువానినిగాని చెప్పలేదు. తరువాత విన్నకోట పెద్దనార్యుఁడు అక్కర సీసభేదములను, షట్పది చౌపది ద్విపద మంజరులనే తెలుఁగుదేశ జాతులలోఁ జేర్చి చెప్పెను. రగడను చాటుప్రబంధ భేదముగా స్మరించినాఁడు. కాని అనంతామాత్యునివరకు రగడ భేదములు, కళికోత్కళికలు, చాటు ప్రబంధములలోని యుదాహరణ లును తెలుఁగున ఛందోగ్రంథములలోని కెక్కనేలేదు. అప్పకవి కాలమువరకు యక్షగానముల ప్రశంసగాని, త్రిపుటాది తాళ ప్రశంసగాని కనఁబడదు. ప్రాచీన లాక్షణికు లంతగా రగడ, షట్పదాదులకు లక్షణము వ్రాయకపోవుటకుఁ గారణము ప్రాచీన శిష్టకవులు వానివి గ్రహింపకుండుటయే. నన్నయాదు లగు ప్రాచీన కవులు రగడలను, ద్విపదలను వాడలేదు. నన్నయ వాడిన అక్కర పద్యములు తిక్కన కక్కర

లేకపోయినవి. ద్విపదలో కావ్యము రచించుటకు సోమనాథుఁడు తన ప్రయత్నము నెంతగానో సమర్థించుకొనవలసి వచ్చినది. కావుననే "ఆరూఢ గద్యపద్యాది ప్రబంధ"ముల ముందట తెలుఁగు దేశీయరచనలన్నియు నడుగంటిపోవుట తటస్థించినది. ప్రబంధముల కాలములో రగడలు కొంచె మాదరింపఁబడినవి. తరువాతి నాయక రాజుల పుణ్యమా యని యక్షగాన ప్రబంధములు మరల తలయెత్తుటచే నందలి దేశీయ రచనలనుబట్టి ప్రాచీన దేశీయచ్ఛందో మార్గములను గొన్నిటిని గుర్తింప మన కవకాశమేర్పడుచున్నది.

ఇక కన్నడ లక్షణ సహాయముచను తెలుఁగు శాసనములను బట్టియు మనము నన్నయకుఁ బూర్వకాలిక రచనలుగా గుర్తించిన వానిలో ద్విపద, గీత, సీసములనుగూర్చి పరిశీలింపవలసియున్నది. ద్విపద గీతముల లక్షణములలో కన్నడాంధ్రములలోని వానికి సామ్యము కుదరలేదు. పాదమునకు నాలుగేసి గణములుగల దేశీయ రచనలలో ద్విపద ప్రధానమైనది. నాలుగు గణములను రెట్టించిన సీసపాద మేర్పడును కావున నిదియు నా జాతిలోనే చేర వచ్చును. మూఁడింద్రగణములు, నొక సూర్యగణము గలిగిన ద్విపద నొక పాదముగనే చేసి చదివిన సీసపాదము కాఁగలదని యిదివరకే తెలిసికొనియున్నాముగదా. ఇక నీ రెంటికిని గల భేద మెక్కడ నున్నదనఁగా, ద్విపద రెండు పాదములకును ప్రాసనియమము కలదు. సీసపాదమున కానియమము లేదు. ఈ ప్రాస నియమము మూలముననే ద్విపద తెలుఁగునందలి ఛందో విశేషము

లలో నొకటగు నుపజాతి గణములలోఁ జేరుట కవకాశము లేక పోయినది. కన్నడఛందోఫక్కికిని. తెలుఁగు ఛందోఫక్కికిని దేశీయ రచనల విషయమునఁగూడఁ గలిగిన భేదమే యిది. కన్నడమున వృత్తములలోఁగాని, జాతులలోఁగాని, జాతీయ గణబద్ధములగు దేశీయజాతులలోఁగాని ప్రాసములేని పద్యమే లేదు. తెలుఁగునందట్టి ప్రాసనియమములేని పద్యము లొక ప్రత్యేకగణముగా నేర్పడినవి. అవే ఉపజాతులనునవి. "జాతులు కందాదులు నుప జాతులు గీతాదులు." ఈ యుపజాతుల మూలముననే తెలుఁగు ఛందస్సు ప్రాచీన దక్షిణదేశీయచ్ఛందస్సంప్రదాయమును కన్నడముకంటెను విశేషముగా నిలుపుకొనియున్నదని చెప్పవలసియున్నది. సీసగీతములకుఁ బ్రాస లేకపోవుట యేల అను ప్రశ్నకుఁ బ్రాచీన దక్షిణ దేశీయ సంప్రదాయములలో నొకదానిని నిలుపుకొనుటయే కారణమనియుఁ జెప్పవచ్చునేమో. ఆ సంప్రదాయ మేమనఁగా, వీనిలో దేశీయ గణములగు సూర్యేంద్ర గణములు యథేచ్ఛగాఁ జేరవచ్చుననుటయే. ఏడింద్రగణములు, రెండు సూర్యగణములు ననఁగా, నేడింద్ర గణములలోను లఘ్వాదులైనను సరే, గుర్వాదులైనను సరే ఏవైనను యథేచ్ఛముగా పాదాదిని రావచ్చుననుట. కారణ మేమన, ప్రాసనియమము లేదు గనుక. ద్విపదకును మూఁడింద్రగణములు, నొక సూర్యగణమునేగదా. కాని ద్విపద పాదము తొలిగణము మొదటిపాదములో గుర్వాదియైనచో రెండవ పాదమునను గుర్వాదియే కావలయును. అనఁగా ప్రథమ పాదాదిని

నల, నగ, సలలో నేదియైన నున్నపుడు రెండవపాదమున మొదట భ, ర, తలు రాఁగూడదు. కావుననే—

"గురులఘువులలో నెయ్యది
మురసంహార ప్రథమపాద ముఖమున నిలిచెన్
ధర నుపజాతులు దక్కఁగఁ
బరగ నిలుచు నవియె నాల్గుపదములు మొదలన్"

అను నియమము. గీతికలకుఁగూడ కన్నడమున ప్రాస నియమము కలదు. కన్నడమున ప్రాసనియమము లేని పద్యము లేదు గనుక నీ యుపజాతి భేద మా భాషలో లేకపోయినది. ప్రాచీన ద్రావిడ సంప్రదాయమునుబట్టి అట్టి పద్యములను తమిళముతోపాటు ఆంధ్రము నిలుపుకొనియున్నది. తమిళమునందలి వెన్‌బా పద్యములలో ప్రాస (యదుగై) నియమమున్నను, అగవల్పా పద్యములలో నట్టినియమము లేదు. తెలుఁగున గొన్నిటిలో లేకుండుట కిదియే కారణము కావచ్చును.

ఇంతవరకుఁ బరిశీలింపఁబడిన యాంధ్ర కన్నడ దేశీయ చ్ఛందోరచనలన్నియుఁ జాలవఱకు నాలుగు గణములు గల పాదములతోఁ గూడినవి. లేదా నాలుగేసి గణములు గల రెండు దళములుగాఁ గలిగిన యొక పాదముతోఁ గూడినవై యున్నవి.

ఇవియన్నియు (అక్కరలుతక్క) పాదములకు నాలుగేసి చొప్పున సూర్యేంద్ర గణములతోఁ గూడియున్నవి గావున,

నివి తమిళమున పాదమునకు నాలుగేసి శీర్లుగల "అగవల్పా" రచనలను బోలినవని చెప్పవచ్చును. ఇట్టిదానిని "విలై మండిల ఆశిరియప్పా" అందురు.

ఇక పాదమున కైదేసి గణములు గల పద్యములు చాల తక్కువగా నున్నవి. తేటగీతము, ఆటవెలఁది యనునవి తెలుఁగునఁ గలవు. అక్కరభేదములలో నొకటగు మధురాక్కరకుఁ గూడ నైదే గణములు. కాని దీనిలో నైదవ గణముగా చంద్ర గణము వచ్చును. గీతములో సూర్యగణము, ఆటవెలఁదిలో నింద్రగణముగాని, సూర్యగణముగాని వచ్చును. అక్కరలలో పాదమునకు ఆరు ఏడు గణములు వచ్చునవికూడ కలవు. నాలుగు గణములుగల అంతరాక్కరలో నొక సూర్యగణము, రెండింద్ర గణములు, ఒక చంద్రగణము వచ్చును గావున, నీ చంద్రగణము రెండు సూర్యగణములుగా మార్పఁదగినదైనచో - అనగా "రల" మో "నల" మో యైనచో నా పద్యము ఒక సూర్యగణము, రెండింద్రగణములు గల తేటగీత మగును. ఇవి యెట్లు వచ్చినను మొత్తముపై నీ యైదు గణములు గల పద్యములు వెనుకటివాని వలె తమిళమునందలి ఆశిరియప్పా - లేక అగవల్పా అను దానితో సంబంధించినవి గాక 'కలిప్పా' రచనలతో సంబంధించి యున్న వనవలసియున్నది. కలిప్పా భేదమగు "కట్టళై కలిత్తురై" అను దానిలో నైదేసి గణముల నాలుగు పాదము లుండును. దీనిలో మొదటి నాలుగు గణములను "ఈరశై చ్చీర్లు" - అనగా రెండు దేశీయచ్ఛందోక్షరములను ప్రస్తరించగా వచ్చిన గణములుండ

వలెను. ఈ ఛందోక్షరములనగా నేర్ నిరై అను సంకేతము గలవి. ఈ నేర్ నిరై లు రెంటిని ప్రస్తరింపఁగా వచ్చిన గణములలోఁ గొన్నిమాత్రమే సూర్యేంద్రగణములు, కన్నడ బ్రహ్మవిష్ణు గణములు నగుచున్నవి. మూఁడు అక్షరములను బ్రస్తరింపఁగా వచ్చినవి. "కాయ్చ్చీర్లు." వీనిలో మన ఇంద్రగణములలోని "త, సల"లు, నవ నలల నగగ నగల మొదలగు చంద్రగణములు చేరినవి. వీనినిగూర్చి తరువాతఁ దెలిసికొందము. ప్రస్తుతము తమిళమునందలి "కట్టళై కలిత్తురై" అను పద్యములో పాదమునకు 4 రెండక్షరముల గణములు- అనగా సూర్యేంద్రగణములలోనివి, తుదిగణము 'విళంగాయ్చ్చీర్'లలో నొకటి - అనఁగా బైనిచెప్పిన చంద్రగణములలో నొకటియై యుండవలెను. కావున నొక సూర్యగణము, రెండు ఇంద్రగణములు, తుద నొకటి చంద్రగణమును జేర్పగా నేర్పడు తెలుఁగు మధురాక్కర కళిప్పా భేదమగు తమిళపద్యముతో సమానము గావచ్చును.

ఇఁక తేటగీతకూడ నైదు గణములతోఁ గూడినదే. కాని యందు అక్కరలోవలె చంద్రగణములురావు. కావున నిది "కళిప్పా" భేదములకు సంబంధించినదై యుండదు. పాదమునకు మా, విళ, కాయ్చ్చీర్లు— అనగా సూర్యేంద్ర చంద్రగణములలో నేవైనను నాలుగు చొప్పున వచ్చు వెణ్బా పద్యరచనలలోఁ జేరినదై యుండును. ఇందు పై కళిప్పాలోవలె చంద్రగణము వచ్చితీరవలయునను నిర్బంధము లేదు. కాని ఒక సూర్యగణము, రెండింద్రగణములు. ఒక చంద్రగణము అను నాలుగు గణములతోఁ గూడిన వెణ్బా పాదము తుది చంద్రగణమును రెండు సూర్యగణ

ములుగా గ్రహించినచో నొక సూర్యగణము, 2 ఇంద్రగణములు, 2 సూర్యగణములును గలిసి యైదు గణములుగల గీతపద్యపాదము కాఁగలదు. ఇట్లు 5 గణములుగల మన గీతపద్యమునకు సరిపెట్టు కొనఁగలిగిన నాలుగు పాదముల వెణ్బాపద్యమును "ఇన్నిశై వెణ్బా" అని యందురు. ఈ వెణ్బాభేదములలోఁ గొన్నిటికి "యదుగై"- అనఁగా ప్రాసకూడ కలదు. ఈ "ఇన్నిశై వెణ్బా" పద్యములో ప్రాసలేకయు నుండవచ్చును. దీనినిబట్టి - అనఁగా ప్రాసవిషయమున తమిళమునఁ గల యైచ్ఛికత్వమునుబట్టి ప్రాస విషయమున నెక్కుడు పట్టుదలఁ జూపిన కన్నడభాషలోఁ బ్రాసతోఁగూడిన గీతములును, తెలుఁగున ప్రాసలేని గీతరచన మును సంక్రమించి నిలిచిపోయినవా యని యూహించుట కవకాశ మేర్పడుచున్నది. వాస్తవముగాఁ బ్రాసవళ్లు రెండును తమిళమున ఎదుగై, మోనై అను రూపముల నిలిచియున్న ప్రాచీన దక్షిణ దేశీయ సాహిత్య సంప్రదాయసిద్ధములేకాని సంస్కృత సాహిత్యము నుండి వచ్చినవికావని నిశ్చయింపవలసియున్నది.

సంస్కృత ప్రాకృతములందును, ఇతర దేశీయభాష లందును లేకున్నను, ఈ ప్రావళ్ళునవి తమిళముతోపాటు తెలుఁగు సాహిత్యమునకు ప్రత్యేక లక్షణము లైనవనుట యొక గొప్ప విశేషము. ఇట్టి యీ విశేషలక్షణమునుగూర్చి 15 - వ శతాబ్ది ప్రాంతము వాఁడగు కొరవి గోపరాజు "సింహాసనద్వాత్రింశిక" యను గ్రంథమునఁ బ్రశంసించి యున్నాఁడు. విక్రమార్కుని దివ్యపీఠం బెక్కఁబోవుచున్న

భోజునకుఁ బాంచాలిక చెప్పిన కథ. అతని పురోహితుని కుమారుఁ డవివేకియై తండ్రిచేఁ దిట్లుతిని దేశాంతరమునకేగి విద్యల నేర్చి వచ్చి రాజుతోఁ బల్కెను—

"....సంస్కృతాదిభాషలు నేర్చి
కవిత యెఱిఁగి యెల్ల కడలఁ దిరిగి
తెలిసినాఁడ నిచటఁ గల లక్షణముకంటె
నూతనంబు లేదు భూతలేంద్ర.

వ. అట్టి విధం బయ్యెను నంధ్రమండలంబునం గోణ దేశంబునం దెలుఁగుఁ గవితకుఁబ్రాలు వళ్లనను నియమంబులు చూచినాఁడ నవి యెయ్యెడం దఱచు గాకుంట నపూర్వం బవధరింపుము.

పుణ్యస్త్రీకి గుణంబు మంగళగుణం
బున్నొమ్మలై యొప్పుగా
బుణ్యస్త్రీకి సువర్ణ మౌక్తిక సుధా
పవ్యక్తిభూషాకృతుల్
గణ్యంబౌగతి సంస్కృతంబునకు వా
గ్భావంబు శబ్దంబు లా
వణ్యాకారము తోఁ దెనుంగునకుఁ బ్రా
ల్వళ్లుం గడున్వన్నియల్
పలుదెఱంగులైన పలుకులు గలిగియుఁ
బ్రాలు వళ్లులేని బేలుగవిత
వన్నెలెల్ల గూర్చి వ్రాయుచోఁ గాటుక
వన్నెలేని ప్రతిమ వ్రాఁతఁబోలు.

తప్పక వళ్లను బ్రాలును
ముప్పిరిగొనఁదగిన శబ్దములు మెఱుఁగెక్కం
జెప్పిన కవితాచాతురి
యొప్పము వెట్టిన పసిండియొఱపున మెఱయున్."

కావుననే యాంధ్రకవిత కట్టి వన్నియు కలిగినది గాఁబోలును !

ఇట్లు కన్నడాంధ్ర దేశీయజాత్యుపజాతి రచనావిశేషములకు తమిళ చ్ఛందోరచనలతోఁ గల సన్నిహిత సంబంధము సువ్యక్త మగుచునే యున్నది. ఇఁక నీదక్షిణదేశీయచ్ఛంద స్సంప్రదాయము నకు మూలమగు గణప్రస్తారపద్ధతి తమిళమున నిలిచియున్నట్లగ పడుటచేఁ నా తమిళగణప్రస్తారపద్ధతిని తక్కినవానితోఁబోల్చి బరిశీలించి తెలిసికొనుట మన కావశ్యకమే యగును.

సంస్కృతప్రాకృతచ్ఛందోరచనలలోని యక్షరగణ వృత్త మాత్రావృత్తాదుల లక్షణమును బరిశీలించి, దేశీయ జాతులకు మాత్రాగణ ప్రస్తారము మూలముగా లక్షణమేర్పరచిన మన లాక్షణికుల పద్ధతికి దేశీయరచన లన్నియు లొంగకపోవుట, తమిళ చ్ఛందోఫక్కి దీనిని బోలియే యున్నను ఇంతకంటె విపుల మైనదిగాఁ గనఁబడుచుండుట, ఈ మొదలగువానికిఁ గారణమేమి యని విచారించినచో, నందలి గురులఘు సంకేతములలోనే కొంత భేదమేర్పడి యున్నట్లు గోచరింపకపోదు. కావున తమిళచ్ఛందో ఫక్కికి మూలములగు గురులఘు సంకేతములను, వాని ప్రస్తారము

మూలమున దేశీయరచనాపక్కిలోఁ గలిగిన భేదములును దెలిసి కొనవలయును.

"హ్రస్వంలఘు. సంయోగే గురు. దీర్ఘంచ" అనునవి గురు లఘు విభాగమునుగూర్చి పాణినిసూత్రములు. ఈ సంకేతమే సంస్కృత ప్రాకృతచ్ఛందములలోను, వానినిబట్టి తెలుఁగు కన్నడ ఛందములలోను అనుసరింపఁబడుచున్నది. కాని తమిళము నందలి ఛందోక్షర సంకేతము దీనికి యత్కించిద్భిన్నమైయున్నను దీని నంతర్భూతము చేసికొనుచునే యున్నది. అచ్చట గురు లఘువులకు బదులుగా "నేర్, నిరై" లనునవి కలవు. "నేర్" అనునది ఒక లఘువు కావచ్చును; ఒక గురువును కావచ్చును. లఘువుపై నొక హల్లు (అనఁగా నర్ధమాత్ర), గురువుపై నొక హల్లు నిలిచినను, ఇవియు "నేర్"లే యగును. అనఁగా "నేర్" అనునదే నాలుగువిధములు గలదై గురులఘువు లనువానిని రెండింటిని దనలో నంతర్భూతము చేసికొన్నదన్న మాట.

ఈ నాలుగువిధములగు నేర్ అనుదానికి బూర్వమున నొక లఘువు నిలిచినచో నది "నిరై" అగును. ఇట్లు "నేర్" అనునది నాలుగు విధములై నదిగను, "నిరై" నాలుగువిధములైనదిగను అగుచున్నవి. ఇఁక రెండేసి మూడేసి గురువులను జేర్చి ప్రస్తారము చేసినట్లే, రెండు నేర్లనుగాని, ఒక నేర్, ఒక నిరైనుగాని, రెండు నిరైలనుగాని ఒక నిరై తరువాత నొక నేర్నుగాని చేర్చినచో రెండు శీర్ల (అనగా అక్షరముల) గణములేర్పడును. ఒక నేర్ అనునదికూడ ఒక గణము కావచ్చును. నిరైకూడ అట్లే

కావచ్చును. ఇక పైఁ జెప్పినదానినిబట్టి "నేర్" అను గణములు— క, కన్, కా, కాన్ అనునవేవైన కావచ్చునుగదా. 'నిరై' గణములో కక, కకన్, కకా, కకాన్ అనునవి యుండవచ్చును. వీనిని "ఓరశై చ్చీర్" ఏకాక్షర గణములని అందురు. రెండేసి అక్షరములు గల శీర్లను "ఉరిచ్చీర్" అనియు, "ఆశిరియ ఉరిచ్చీర్" అనియు అందురు. నేర్ అనునది క, కన్, కా, కాన్ అనువానిలో నేదైనగావచ్చును గనుక రెండు నేర్‌లతోఁగూడిన గణములలో కక, కకన్, కకా, కకాన్, కాక, కాకన్, కాకా, కాకాన్, కన్‌క, కన్‌కన్, కన్‌కా, కన్‌కాన్, కాన్‌క, కాన్‌కన్, కాన్‌కా, కాన్‌కాన్— ఇన్నిరీతుల గణము లేర్పడవచ్చును. కాని సంస్కృత చ్ఛందస్సంకేతము ననుసరించి చూచినప్పుడు "నేర్" అనుదానిలోఁ జేరిన నాలుగింటిలో మొదటిది లఘువు, తక్కిన మూడును గురువులే యగును గావున నేర్ అనఁగా గురువుగాని, లఘువు కాని కావచ్చునని మనము సరిపెట్టుకోవలసియున్నది. అప్పుడు రెండు "నేర్"లతోఁ గూడిన గణములు రెండు గురువులుగాని, రెండు లఘువులుగాని, ఒక గురువు లఘువుగాని, ఒక లఘువు గురువుగాని చేరిన గణములగును. తమిళమునందలి 16 రీతులైన గణములు సంస్కృత పక్కిననుసరించి నాలుగైనవన్నమాట. వీనిలో రెండు గురువుల గణము "గగ"ము బ్రహ్మగణముగ కన్నడ ఛందమునను, గలము, లేదా హగణమనునది కన్నడమున బ్రహ్మగణముగను, తెలుఁగున సూర్యగణముగను నీ రెండు భాషలలోను

గూడ గ్రహింపఁబడినవి. లలము, లగము అనునవి యీ భాష లలో గ్రహింపఁబడలేదు. ఈ నాలుగింటిని తమిళమున 'తేమా' గణము లందురు. ఇవియు రెండక్షరముల గణముతోఁ గూడిన పద్యము లన్నిటియందును రావచ్చునుగదా. రెండు అక్షరముల గణములింకను మూఁడువిధముల నుండవచ్చును. నిరై + నేర్. నిరై + నిరై, నేర్ + నిరై, నేర్ అనుదానికి ముందొక హ్రస్వము చేర్చిన "నిరై" అగునుగదా. కావున నిరై అనునదియు నాలుగు విధములైనది. ఈ నాలుగువిధములైన నిరైల తరువాత నాలుగు విధములైన నేర్ లను చేర్చినచో మరల 16 విధములగు గణము లేర్పడును గాని నేర్ అనునది ఒక గురువు కావచ్చును, ఒక లఘువు కావచ్చును. కావున నిరై అనునది లఘువు గురువు గురువు లఘువు కావచ్చును, ఈ రెంటిని చేర్పగా—

| నిరై + నేర్ | |
|---|---|
| I U + U | యగణము |
| I U + I | జగణము |
| I I + U | సగణము |
| I I + I | నగణము |

మూడక్షరములు గల య, జ, స, న గణములగు చున్నవి. ఇందు సగణము కన్నడమునందలి బ్రహ్మగణములలోఁ జేరినది. నగణము కన్నడమున బ్రహ్మగణముల లోను, తెలుగునందలి సూర్యగణములలోనుగూడఁ జేరినది. ఇట్లు రెండు నేర్ల యొక్కయు, నిరై నేర్ల యొక్కయు కూడిక

వలన నేర్పడిన గణములలోఁ గొన్నిమాత్రమే కన్నడ బ్రహ్మ గణములును, తెలుఁగు సూర్యగణములు నైనవి. తక్కినవి వీనిలోఁ జేరనేలేదు. రెండు నేర్‌ల వలనఁ గలిగినవానికి "తేమా" అని, నిరై + నేర్‌ల వలనఁ గలిగినవానికి "పుళిమా" అని తమిళ మున వ్యవహారము.

ఇక రెండు నిరైల కూడికవలనను, నేర్ + నిరై ల కూడికవలనను ఏర్పడినవానికి "కరువిళమ్", "కూవిళం" అని వరుసగా పేర్లు, నిరై అనఁగా లఘువుముందర లఘువు చేర్చినది. గురువుముందర లఘువు చేర్చినదిగదా.

కావున । ।। + । = నలము

।। + । ◡ = నగము

। ◡ + ।। = జలము

। ◡ + ◡ = జగము

నేర్ + నిరై — ◡ + ।। = భగణము

◡ + । ◡ = రగణము

। + । ◡

। + ।।

వీనిలో నింద్రగణములుగాఁ దెనుఁగున వ్యవహరింపఁ బడుచున్న నల, నగ, భ, ర అను నాలుగును వచ్చినవి. ఇవే కన్నడబ్రహ్మగణములుకూడను. ఇక తెనుఁగున నింద్రగణము లలోఁ జేరిన "సల", "త" అనునవి తెలుఁగు గణవిభాగములో నింద్రగణములలోనే చేర్పఁబడినను, తమిళమున మూఁడేసి అక్షర ములను ప్రస్తరింపఁగా వచ్చెడు గణములలోఁ జేరినవి.

మూఁడు నేర్‌లయొక్కగాని, నిరై, నేర్‌లయొక్కగాని కూడికచే నేర్పడిన గణములలో వచ్చును. మూఁడు నేర్‌లు - అనఁగా మూఁడు గురువుల మగణము, కన్నడమునందలి విష్ణుగణ మగుచున్నది. నేర్ లఘువుకూడఁ గావచ్చును గావున మూఁడు నేర్‌లు- అనఁగా రెండు గురువులు, ఒక లఘువు చేర్చినచో తగణ మగును. ఇది కన్నడ విష్ణుగణము, తెలుఁగు ఇంద్రగణము నగును. ఒక నిరై, రెండు నేర్లను జేర్చినచో- అనఁగా రెండు లఘువులు రెండు గురువులు (ı ı ‿ ‿), రెండు లఘువులు ఒక గురువు ఒక లఘువు (ıı‿ı) చేర్చినచో సగము-సలము అగును. మొదటిది కన్నడ విష్ణుగణమును, రెండవది కన్నడవిష్ణుగణము- తెలుఁగు ఇంద్రగణము నగును. ఇట్లే ఇంకను మూఁడేసి అక్షరములను ప్రస్తరించినచో నిరై + నిరై నేర్ (ıı ıı ‿) కన్నడ రుద్రగణములు తెలుఁగు చంద్ర గణములలోఁ గొన్నియు, నాలుగేసి యక్షరములను బ్రస్తరింపఁగా మఱికొన్ని చంద్రరుద్ర గణములును వచ్చును. ఈ తెలుఁగు కన్నడ గణములలోఁ జేరని గణము లనేకము లింకను ఈ ప్రస్తారమువలన తమిళమునం దేర్పడుచున్నవి. కన్నడమునందు గ్రహింపఁబడిన బ్రహ్మ, విష్ణు, రుద్ర గణములలోఁ గొన్ని దెనుఁగున నినేంద్ర చంద్ర గణములలోఁ జేరనియట్లే తమిళమునందలి ౨, ౩, ౪ అక్షరముల- లేదా నేర్ నిరైల ప్రస్తారమువలనఁ గలిగిన గణములలో ననేకములు కన్నడ గణవర్గములలోఁగూడ జేరియుండలేదు. కాని ఒక్క విషయము మాత్రము ప్రధానముగా గమనింపఁదగి యున్నది. గురులఘు స్వరూపమగు ఛందోక్షరముల విషయము

ననేకాక, తత్ప్రస్తారము, గణవర్గీకరణము విషయములఁగూడ సంస్కృత చ్ఛందోరీతికిని, దక్షిణదేశ భాషలలోని ఛందోరీతికిని భేదమగపడుచుండుటచే. నీరెండును మూలమున భిన్నములనియు౯ నిటీవలికాలమున వీనికి లక్షణ మేర్పఱచిన సంస్కృత పండితు లా దేశీయచ్ఛందోమార్గములను, సంస్కృత చ్ఛందోరీతుల కనుగుణముగా సంస్కరించి, లక్షణమేర్పరచుటచే నిట్లేర్పడెననియుఁ దలంపవలసియున్నది. ఈ దేశీయ రచనారీతులే ప్రాకృతములలోఁ గూడ గ్రహింపఁబడినపుడీ దక్షిణ దేశీయఁ మాత్రాగణపద్ధతిని వాని కన్వయింపజాలక, కేవల మాత్రా సంఖ్యాపద్ధతినే యవలంబించి, ఇన్ని మాత్రలో, లేక ఇన్ని గురువులో లఘువులో నుండవలెననియు, ఇన్నో అక్షరము గురువో లఘువో కావలయుననియు సామాన్య నియమబద్ధము గాని యేర్పాట్లతో లక్షణముచేసిరి. ఈ ప్రాకృతచ్ఛందస్సులోని మాత్రానియమము గలిగిన "జాతులు" అను వర్గములోఁ జేరిన పద్యములలో ననేకములు దేశీయములే కావచ్చుననుటకు సందేహములేదు. కాని వైదికచ్ఛందస్సులో మాత్రాసంఖ్యాబద్ధములగు పద్యములు లేవా యను ప్రశ్న వెంటనే బయలుదేరకమానదు. కాని అవియు మాత్రాసంఖ్యాబద్ధములు కావచ్చును గాని, దక్షిణదేశీయచ్ఛందో రీతులను బోలిన వైన మాత్రాగణబద్ధములు మాత్రము కాఁజాలవు. ఈ దేశీయ గురులఘు సంకేతమునకును, గణనియమ పద్ధతికిని, సంస్కృత ప్రాకృతములందలి దానికిని గల యీ భేదమును బట్టియు, సంస్కృత ప్రాకృతములలోను, తెలుఁగు కన్నడ

ములలోను గల కొన్ని ఛందోరచనల నామములందుఁ గల సామ్య మునుబట్టియు మాత్రాగణనియమ బద్ధములగు నీ దేశీయరచనలు కొన్ని అతి ప్రాచీనకాలముననే సంస్కృత ప్రాకృతములలోని కెక్కినవనియు, వానికి లక్షణము నేర్పరచునపు డీ దక్షిణదేశీయ మగు మాత్రాగణ నియమపద్ధతి నవలంబింపని సంస్కృత ప్రాకృతలాక్షణికులు కేవలమాత్రాసంఖ్యా నియమపద్ధతిని లక్షణ మేర్పరచి, యెట్లో తమకంతకుఁ బూర్వము పరచితమగు గురు లఘు పద్ధతితో సమన్వయముచేయఁ దలపడిరనియు నిశ్చయింప వలసియున్నది. దీనికి ప్రస్తుతమున నొక యుదాహరణము చాలును. నేర్నిరైల ప్రస్తారమువలనఁ గలిగిన యీరశైచీర్లతో నేర్పడిన దక్షిణదేశీయ రచనలలో నొకటగు సీసపద్యము భరతుని కాలమునాఁటికే ప్రచారములో నున్నట్లగపడుచున్నది. ఏల యనఁగా శీర్షక మనుపేర నొక రచనా విశేషమును, లేదా గేయ విశేషము నాతఁడు తన నాట్యశాస్త్రమునఁ బేర్కొనియున్నాడు. దీనిని గూర్చిన లక్షణమును గేవల మాత్రల సంఖ్యలతోడను, అక్షరముల సంఖ్యతోను చెప్పుటచే నిది సహజముగ దేశీయమే యని తలంపనగును. తాళభేదమగు శీర్షిత మనుదానినిబట్టి యా రచనకు శీర్షకమని యాతఁడే పేరుపెట్టిన ట్లగపడుచుండుటచే, నీ దేశీయ గీతరచనకు భరతుఁడు పెట్టిన పేరునుబట్టియే తరువాతి కాలమున సీసమను తెనుఁగుపేరు సిద్ధించినదని తోఁచుచున్నది. "శీర్షిక" మను ఛందోరచనా భేదమునకు మూలము "శీర్షిత" మను నొక తాళభేదమనియు, దీనితోఁగూడినది గావున దానికా పేరు

వచ్చినదనియుఁ దెలియుచున్నది. ఇది ఒకవేళ అప్పటి కర్థము తెలియని దేశీయ పదముయొక్క సంస్కృతీ కరణమైనను గావచ్చును.

భరతుఁడు చెప్పిన శీర్షకలక్షణము—

"శీర్షకం సాతు విజ్ఞేయా శీర్షి తేన విభూషితా.
ఏకపాదావసానస్తు యస్య స్యా దర్ధవర్ణతః.
ఏతావసానేన బుధైః సా జ్ఞేయా తు చతుష్పదా,
పూర్వపాదేన తస్య స్యాత్ సర్వత్ర గురులాఘవః.
పాదే పాదావసానే చ సా జ్ఞేయా నియతాక్షరా,
శీర్షకం చ ప్రకర్తవ్యం గురుప్రాయాక్షరాన్వితం.
తతశ్చ శీర్షకం కార్యం ప్రయుక్తం పంచపాణినా,
శీర్షకో నామ నియమో భవే త్పాదవిధానతః.
నామ్నా వృత్తవినిష్పన్నం కుర్యాద్వై శీర్షకం బుధః.
గురు ర్గుర్వాది స్తథాల్పాది ర్యుగ్మః సతు లఘు స్తథా.
చతుర్మాత్రాక్షరో జ్ఞేయో పూర్వచ్ఛందోవికల్పకః.
అర్ధాష్టమగణాః పాదాః శీర్షకస్య భవంతి హి,
త్రింశన్మాత్రాశ్చ విజ్ఞేయా యుగ్మజాక్షరజైః పదైః.
శీర్షకే హ్యేకవింశత్యాః షడ్వింశతిపర స్తథా,
అక్షరాణాం భవే త్పిండః పాదే హ్యేకత్ర నిర్దిశః,
యుగ్మజమిశ్రకాః ఖలు పాదే కార్యాస్తు చత్వారఃస్యుః.
శీర్షకే తు నియమేన పశ్చా ల్లఘుసంచయః కార్యః.

త్రయఏవ గణాస్తు ముఖే లఘవస్త్రయ ఏవావసానే తు,
మధ్యే చేత్ గురుణీద్వే తచ్చపలా శీర్షకంనామ,
పూర్వే హ్యర్ధం తు గురుహ్రస్వాద్విత్రాగణాస్తు చత్వారః
పాదే భవంతి నియతం పశ్చాల్లఘుసంచయాః శేషాః"

భరతుఁడు నాట్యశాస్త్రమునఁ జెప్పిన పై శీర్షిక లక్షణము తెలుఁగు సీసలక్షణమునకు సరిపోవుచున్నట్లే యున్నది. "చతుర్మాత్రో జ్ఞేయో పూర్వచ్ఛందో వికల్పకః" అనగా పూర్వచ్ఛందమునకు భిన్నముగా నిందు ౪ మాత్రలు గల గణములను గ్రహింపవలెనట. భగణము - అక్షరగణములలో ౪ మాత్రలు గలదే. ఇదియు, "నల" అను నిదియు ఇంద్రగణములలో నాలుగుమాత్రల గణములు, ఈ యింద్రగణము లారును, త్రిమాత్రాకములగు సూర్యగణములు రెండును ఒక పాదమునఁ జేరియుండుట తెలుఁగు సీసపద్యమునకు లక్షణముగదా. అనఁగాఁ బాదమున కెనిమిది గణములు, పాదములోని దళములకు నాలుగేసి యుండును. "అర్ధాష్టమ గణాః పాదాః శీర్షకస్య భవంతిహి" అనుదానికి ఇదే అర్థము కావచ్చును.

ఇఁకఁ అందలి మాత్రలనుగూర్చి. "త్రింశన్మాత్రాశ్చ విజ్ఞేయా యుగ్మౌజాక్షరకైః పదైః" అని పాదమునకు ముప్పది మాత్ర లుండవలయును. తెలుఁగు సీసమునందలి యా రింద్రగణములును నాలుగు మాత్రలుగల "నల"ములో, "భ"గణములో యైనచో నివి యిరువదినాలుగు మాత్రలును, రెండు సూర్యగణములును ౬ మాత్రలును గలిసి ముప్పది మాత్రలగును. ఇట్లు

సీసపాదము ముప్పదిమాత్రలు కలదగును. కాని యితరములగు నింద్రగణములుకూడఁ జేరినజో మాత్రలెక్కువగును. ఇక ౨౧, లేదా ౨౬ అక్షరముల మొత్తముండుననుట తెలుఁగు సీసపాదములో ౨౨ అక్షరములకు తక్కువయుండుట కవకాశము లేదు గాని ౨౬ అక్షరములుండవచ్చును. కాని భరతుని కాలమున నిది యొకవిధమగు దక్షిణ దేశీయగేయముగా నుండియుండుటచే నక్షర సంఖ్యలో భేదము కలిగియుండవచ్చును. దీనినిబట్టి గేయ రూపములుగా నున్న దేశీయ చ్ఛందోరచనలకు భరతాదులా కాలముననే లక్షణము కల్పించి, నామకరణమునుగూడఁ జేసి, తమ ఛందోగ్రంథములలోఁ జేర్చికొనియుండిరనుటకు సందేహములేదు. శీర్షక మను తాళభేదమునుబట్టి యీ గేయమున కాతఁడు పెట్టిన "శీర్షక" మను పేరువలననే తెలుఁగున నిలిచియున్న యీ రచనా భేదమునకు 'సీస'మను పేరు వచ్చియుండును. ఇట్లే దక్షిణదేశీయ సంప్రదాయసిద్ధములగు ప్రాచీనగేయ రచనలనేకములు మాత్రాచ్ఛందస్సులుగా సంస్కృత ప్రాకృత లాక్షణికులచే గ్రహింపఁబడినట్లగపడుచున్నది.

కావునఁ దెనుఁగునందలి యీ యుపజాతులను దేశీయ రచనలు నన్నయకాలముననో, అంతకు రెండు మూఁడు శతాబ్దులకుఁ బూర్వము శాసనముల కాలముననో తెలుఁగున నేర్పడినవి గాక క్రీస్తు శకారంభమునాటి ప్రాచీన తమిళ వాఙ్మయమునందలి వెణ్బా, అగవల్పాలతోడను, భరతుని కాలమునాఁటి శీర్షకాదులతోడను సంబంధించి యున్నవని

తలంపవలసియున్నది. ఇట్లనేక విధములుగా నన్న గేయ రచనలలో చాళుక్య ప్రభువుల యాస్థానములందలి శిష్టకవుల దృష్టినాకర్షించి, వారి యాదరమును బడసిన యేవో కొన్ని రచనలు మాత్రము వారి కాలమున రచింపఁబడిన కొన్ని శాసనములలోనికెక్కి యా యా శాసనపురాళ్ళమీఁదనో, రాగిరేకులమీఁదనో నిలిచి యుండుటచే నన్నయకుఁ బూర్వకాలమునఁ గల తెలుఁగు కవితా రచన లిట్టివి యని మనమిప్పుడు తెలిసికొనుట కాధారమేర్పడుచున్నది. అట్టివానిలో నింతకుఁ బూర్వము దేశీయరచనలుగా మనము పరిశీలించిన సీసములు, గీతములు, ద్విపదములు, తరువోజలు, అక్కరలు మొదలుగాఁగలవి కలవు. ఇవియే మనకిప్పటికి మిగిలిన ప్రాఙ్నన్నపార్యయుగమునందలి యాంధ్ర కవితారచనలు. ఇట్టి దక్షిణదేశభాషా కవితామూలములనుండియే యాంధ్రశిష్టకవితా మహావృక్షమును బెంపొందించి నన్నపార్యుఁ డాంధ్రభాషావాగనుశాసనుఁడైనాఁడు.

ఇట్టి యల్పమూలమునుండియా మన యాంధ్ర సాహిత్య మహావృక్షము పెంపొందినది ? అను సందేహ మెల్లరకును గలుగవచ్చును. వాస్తవముగా నది యల్ప మూలమే కావచ్చునుగాని, దాని యా రూపమంతయుఁ గూడ మనకిప్పుడు గోచరించుటలేదు. అది యా కాలమున గేయరచనారూపమై సామాన్యజనుల హృదయసీమలయందు పెరుగుచుండుటచే, నది గ్రంథస్థమై స్థిరరూపమును దాల్చలేదు. దేశి కవితయం దభిమానము చూపిన చాళుక్యరాజుల యాస్థానములందలి శిష్టకవులు దాని నెల్లెంతవరకు గ్రహించి శాసన

బద్ధము చేసిరో, అంతమట్టుకే యీ దేశి కవితాస్వరూపము మన కిప్పుడు పొడకట్టుచున్నది. అల్పముగనే పొడకట్టుచుండిన యీ దేశీయ సాహిత్యపుమొక్క నొక్కసారిగా నల్పకాలముననే మహా వృక్షముగఁ జేయనెంచియే, నన్నపార్యుఁడు మొదలగు శిష్టకవులు దీనిని సంస్కృతసాహితీవృక్షముతో నంటఁగట్టి పెంపొందించినారు. ఈ యుద్యమము నన్నయకుఁ బూర్వమే ప్రారంభించినను, నన్న పార్యుని రచనానైపుణ్యమే, యీ రెండు నంత చక్కగా నతుకు కొని వృద్ధినొందుటకును, మహాభారతమంతటి స్వాదుఫలము నది వెంటనే యొసంగుటకునుఁ గారణమైనది. కావుననే యాంధ్ర భాషావాగనుశాసనుఁడై నెగడిన నన్నయ రచనా నైపుణ్యము మహత్వము నెంతయు నెన్నఁదగిన వైనవి.

ఈ దేశ భాషాసాహిత్యములకు నన్నయ మూలమునఁ గలిగి స్థిరపడిన కొన్ని సంస్కార విశేషములు :—

1. దేశీయచ్ఛందమునందలి, సీస గీతాదులను, అక్కర తరువోజ కందాదులను గ్రహించి, కన్నడ కవులవలె యతివిలం ఘనముచేయక, దేశీయ సంప్రదాయ సిద్ధములగు వడిప్రాస నియ మములతోఁగూర్చి సంస్కృత వృత్తములను దెనుఁగు సాహిత్య మునకు దింపుట, కొన్ని సంస్కృత వృత్తములలోని యతి స్థాన ములను దన రచనకనుకూలముగ మార్చుట.

2. ఛందో విషయమున వలెనే భాషా విషయమునను దేశీయ సంప్రదాయానురోధంబుగ "నక్షర రమ్యత" నాదరించి సంస్కృత శబ్దజాలమును, దీర్ఘసమాసములను, అనర్గళధారా వాహి యగు శైలిలో శ్రుతిమహిత మగునట్లు

తెలుఁగు పలుకులతో సమ్మేళనముచేసి- తెనుఁగురచనకుఁ బరుష త్వములేని గాంభీర్యమును సమకూర్చుట.

3. అంతకుఁ బూర్వము భిన్నరూపముల నొందుచు నవ్యవస్థస్థితిలో రూపాంతరములతోఁ గూడియున్న దేశ్య శబ్దజాల మునందలి శిష్టరూపములను గ్రహించి తన గ్రంథమున వెలయించుటచే- వాని కొక వ్యవస్థ నేర్పఱచుటమైనది. భాషలో "ఱ" కార మంతరించి దాని స్థానమున డ-ళ-లు స్థిరపడినవి. "ఎఱుంబొది"- "పదియేఁడు" "మహరాజుళాకున్" ఇరుభది, వంటి రూపము లంత రించి- ఎనిమిది, పదునేడు, మహారాజులకు, ఇరువది వంటివి స్థిర పడినవి. "సంవత్సరంబుళ్" "కొడుకుళ్"- ఇత్యాదులలోని "ళ్" అను బహువచన ప్రత్యయము పోయి "లు" స్థిరపడినది. సముచ్చయార్థక "ఉమ్" లోని- ఏఱు వేఱుం ఏలుచు, "అన్వయం బునవారెవ్వరైయుమ్" అను వానిలోని- "మ"కారము "న" కార ముగా మారి స్థిరపడినది.

4. కేవలము తాళబద్ధములగు పదములు పాటల రూప మునఁగాని- లేదా వృత్తముల నడుమ దేశీయ రచనలతోఁ గూడిన (కన్నడ బెదెండె) ఉదాహరణాదుల రూపమునగాని యున్న దేశీయ సాహిత్యమును వెనుకకుఁ ద్రోసివేసి కన్నడ పంపాదుల మార్గము ననుసరించిన గద్యపద్య సమ్మిశ్రితమగు చంపూకావ్య పద్ధతి తెలుఁగులో నెలకొనుట.

5. జైనబౌద్ధములింకను ప్రాధాన్యమునకై పెనఁగులాడు కొనుచున్న కాలమున "త్రిపురుషులఁ" బూజించి, వర్ణాశ్రమ ధర్మరక్షణ మహా మహిమ నొప్పిన చాళుక్య ప్రభువు నాజ్ఞచే-

కృష్ణద్వైపాయనకృత మహాభారతబద్ధ నిరూపితార్థము తెనుఁగున నేర్పడ, పంపాదులవలె ప్రౌఢ ప్రబంధవర్ణనాపద్ధతిని స్వతంత్ర కథా కల్పనారీతినిగాక "ప్రసన్న కథా కలితార్థయుక్తిని" భారత సంహితారచన బంధురుఁడై- ఆంధ్రదేశమున వైదికమత స్థాపకుఁడై నాడు. కావుననే "ద్వైపాయనోద్యానజాత మహాభారత పారిజాతము" ధాత్రీసురప్రార్థ్యమై "యీ దేశీయులకు" నిరంతర సంతత పుణ్య సంపదున్నత్యభివృద్ధి చేయుచునే యున్నది.

6. ఇట్లీ సంస్కృత వృత్తసంగ్రహణము, తత్సమ భాషా బాహుళ్యము, చంపూపద్ధతి, వైదికమత ప్రాబల్యములతో బాటు, నన్నయభట్టారకుని భారత రచనామూలముగా సంస్కృత భాషాలక్షణ సంప్రదాయములు కూడ నీభాషలోనికి విశేషముగా దిగినవి.

విభక్తి ప్రత్యయములు- లేదా విభక్త్యర్థక శబ్దములు -వాని ప్రయోగరీతి సంస్కృతభాషా సంప్రదాయరీతి ననుసరించి విపులీకృతమైనది. తృతీయా పంచమ్యర్థములచేత, తోడలు, ఉపయోగార్థమున తోడవర్ణక ప్రయోగము, చేసి, మెయి, పొంటె, కోలె, ఉండి, వలన, అందు, మొదలగు వాని ప్రయోగరీతి చాలవరకు సంస్కృతభాషాప్రయోగ సందర్భానుసారియై నెగడినది. ఇట్లే- "పడు" ధాత్వనుప్రయుక్తమగు కర్మణ్యర్థకరూపములు, తత్సమ ధాతురూపకల్పనము, దేశ్య ధాతువులనుండి విశేషార్థ రూపకల్పనము, (cf. నమ్మనేర నయ్యెదను.) మొదలగువాని మూలముగా దేశభాషకు గొప్ప దోహదముచేసి దాని భావప్రకటనాశక్తిని

పెంపొందించి. తేనె లొలికించు మహా స్వాదుఫలముల నిచ్చు దానినిగాఁ జేసి యాంధ్రభాషా వాగనుశాసనుఁడై యాంధ్ర కవిత్వ విశారదుండైనాఁడు నన్నయభట్టు మహాకవీంద్రుఁడు.

ఈతని రచనయందలి ప్రసన్నత, భావగాంభీర్యమును జూచినపిదప, వెనుకటిది కవితకాదనియే యనిపించవచ్చును. ఆ భాషకు సురూపత లేదందురు. వ్యాకరణ సంస్కారము లేదని కొందరు తలంతురు. మన వ్యాకరణజ్ఞానమునకు లక్ష్యమొక్క నన్నయయేగదా. అతని రచనలలో గ్రామ్య ప్రయోగములట. అవి యనింద్యములని సమర్థన. అట్టివానినే నన్నిచోడ సోమనాదులు ప్రయోగించిరన్న - వారిభాష సంస్కారహీనము. వారు లాక్షణిక కవులు కారని చెప్పుదురు. వారికి భాష రాదందురు. ఇది భాసుర కవి కింగ్లీషురాదన్నట్లే యుండును. అతఁడు మహాకవిగా పరిగణింపఁబడకపోలేదు. అతని భాష కొక ప్రత్యేక వ్యాకరణ మేర్పడినది. నన్నిచోడాదుల రచనలను వదలి ఆంధ్రభాషకు సమగ్ర వ్యాకరణ మేర్పడవలయుననుట వట్టి భ్రాంతి. సమగ్ర వ్యాకరణమనుట అర్థములేనిమాట. నన్నయకుఁ బూర్వమునఁ గల భాషా స్వరూపలక్షణములను గుర్తించి తరువాతి దానితోఁ బోల్చి తత్పరిణామ రీతులను, చరిత్రను ఆరయుటయే చేయఁదగిన పని. ఆంధ్రమునఁ జరిత్రాత్మక వ్యాకరణరచనమే సమగ్ర వ్యాకరణ రచనమగును. నన్నయకుఁ బూర్వమునందలి భాషకు మన మనుకున్న సంస్కారము కలుగలేదు. గనుక ఆ భాషలో నప్పుడు వ్రాసినది కవిత్వము కాకపోదు. కాని యా దేశీయ కవిత లిఖిత రూపమునొంది మనకు లభ్యముకాలేదు.

# VI

## దేశి రచనలు

తెనుఁగు దేశి సాహిత్యశాఖలలోఁ బ్రధానమైనవి, ద్విపదో దాహరణ యక్షగాన రగడాదులని యిదివరకే తెలిసికొని యున్నాము. ఆంధ్రమునఁ బురాణ ప్రబంధశాఖల వలెనే ద్విపద శాఖయు బాగుగనే విస్తరించినది. తొలుత శైవమత ప్రచారము నకై పాల్కురికి సోమనాథుఁడు దీని నవలంబించినను, జన సామాన్యమున వ్యాప్తికొరకు రంగనాథ రామాయణము, గౌరన హరిశ్చంద్ర ద్విపద, నవనాథ చరిత్రము, శ్రీనాధుని-పల్నాటి వీరచరిత్రము, తాళ్ళపాక చిన్నన్న పరమయోగి విలాసము, అష్ట మహిషీ కల్యాణము, పిడపర్తి సోమన ప్రభులింగలీల మొదలగు నవేగాక, దక్షిణదేశాంధ్ర వాఙ్మయమున తిమ్మన ద్విపద భార తము, రఘునాథరాయల ద్విపద రామాయణము మొదలగున వనేకములు బయలుదేఱి ద్విపదవాఙ్మయ శాఖను పెంపొందించి నవి. ఆంధ్రమున నుదాహరణశాఖ దేశి రచనాశాఖలలో మిగుల ప్రాచీనమైనదే యైనను చిన్న ఖండకావ్యమువంటిదై, సప్త విభ క్త్యంత పద్యములతోఁగూడి పరిమిత ప్రయోజనము కలదై కథాకల్పనా విస్తృతి కవకాశము కల్పించునది గాకపోవు టచే ద్విపదవలె నంతగా విస్తృతిఁ జెందలేదు. భాషలో వెలసిన యన్నిటిని ప్రోవుచేసినను 15, 20 కంటె నెక్కువగా నుండవు. వీనిలోఁ బ్రసిద్ధములు - ప్రకటితము లగునవి పాల్కు-

రికి సోమనాథ రచితములు, త్రిపురాంతకోదాహరణము వంటివి మిక్కిలి యల్పసంఖ్యాకములు. "రగడలకు" ప్రత్యేక కావ్యగౌరవము కలుగనే లేదు. ప్రబంధములలో వర్ణనాదులందు శిష్టకవులు కొందరు రగడలను రచించిరి. ఇవి పాటల రూపమున యక్షగానాదులలోఁ జేరుచు వచ్చినవి. ఇఁక యక్షగానములు జనసామాన్యమునఁ బ్రదర్శనార్థమయియే యుపయోగపడుచుండుటచేతను, శిష్టకవులందరు పురాణ ప్రబంధ ఫక్కి ననుసరించియే తమ కవితా రచనమును సాగించుచుండుటచేతను, ఈ దేశిశాఖా రచనలు సామాన్య జనాదరణమును బడసిన కొందర కవులచేతనే రచింపఁబడి విస్తృతిఁజెందుచు వచ్చినను, రాజాశ్రయముగాని, తగిన సంస్కారముగాని లేకపోవుటచే పెక్కు రచనలు గ్రంథస్థములై స్థిరరూపమును దాల్చుట కవకాశము కలిగినట్లగపడదు. రుద్రకవి సుగ్రీవ విజయము, రంగాజమ్మ మన్నారుదాస విలాస నాటకము ముద్రితములైనవి. ఇటీవల చిరకాలమునుండి దేశమున భాగవతములని వీధినాటకములని ప్రదర్శింపఁబడుచుండిన వానిలో గ్రంథస్థములై ప్రాచ్యలిఖిత పుస్తకాలయములోఁ జూచువారు లేక మూలపడియున్నవి నూరుపైగా నుండును. వీనిలో నీదేశమున ముద్రణమంది గుజిలీప్రతు లనఁబడుచు ప్రకటితములైనవి గరుడాచల నాటకము, శశిరేఖా పరిణయము, గయోపాఖ్యానము, ప్రహ్లాద, పారిజాతము మొదలగునవి యే పది పండ్రెండో, అంతకంటె నెక్కుడుగా లభ్యమగునని తోఁచదు. వానినైనను జూచువారిప్పుడు చాల అరుదే.

శశిరేఖా పరిణయ నాటకమునకు "మట్లిగుంట శశిరేఖా పరిణయ" మని పేరు. దీనిని పంచమకులుఁడగు గొట్టిముచ్చు రంగదాసుని తనయుఁడగు "అబ్బయదాసుఁ"డు రచించెను. ఇది మట్లిగుంట గోపాలున కంకితము.

"అని మట్లిగుంట గ్రామం
బున పంచమకులుఁడ గొట్టిముచ్చు రంగదా
సుని తనయుం డబ్బయదా
సునిచే రచియింపఁనయ్యె సుస్థిరమయ్యెన్"

అని యాతఁడే గ్రంథాంతరమునఁ జెప్పికొన్నాడు. ఇది మట్లిగుంట నాయకుఁడగు బొంతా లింగప్పనాయఁడు

ద్వి. ఆరూఢి సింహాసనాసీనుఁడగుచు
భారతగ్రంథంబు భాగవతంబు
చదివించి వినుచుండి సంతోషుఁడగుచు
మదిలోన శశిరేఖ పరిణయంబపుడు
శృంగార నాటకము సేయింపదలఁచి
పొంగుచు సంతోష పూర్ణుఁడై తాను

కందార్థము —

ఘనుడగు లింగపనాయఁడు
పనివడి బిలిపించి నన్ను బహుసంతోషం
బునఁగాంచి కరుణతోడను
దనరగ యీ నాటకంబు త్వరితము-చెప్పా

శశిరేఖా చరితమూ-గురుతుగ
శ్రీన్యగ్రోధగుంటపురి వరదునిపై కృతి
సరవితో నిల్పియు త్వరితమూ-చెప్పూ

అని ఇట్లానతిచ్చిన సంతసించి రచించెనఁట. గ్రంథాంత మున నాశీస్సిట్లు గలదు—

ద్వి. ఈ నాటకంబెపుడు నింపుగా చదివి
మానుగా వ్రాసిన మరువక వినిన
ఆడిన పాడిన నాయువు సిరియు
కూడియు సతి సుతులకూడి సుఖింతు
రెందాక రవిచంద్రు లెందాక తార
లెందాక వారిధులెందాక ధరణి
యెందాక వేదంబు లెందాక నుండు
నందాక నీ కృతికాయువుగల్గి
సుందరంబై యొప్పి శుభకర మమరు.

ఇట్లే భద్రాద్రిరాముని కంకితముగ యాదవదాసుఁడను కవి గరుడాచల నాటకమను యక్షగానమును రచించెను.

"ధరణిలో యాదవాఖ్యుడను దండిగ నరహరిచరితమిప్పుడున్
మురియగ జెప్పితిన్ వినుడి ముప్పదిరెండు దినంబులలోపలన్
పరగున లక్ష్మినాథుడును సాధుజనంబుల భక్తులందరిన్
కరుణతోబ్రోవు భద్రగిరికాంతుడు దాసుల హృదయలోలుడై."

"ఈ కథ విన్నను వ్రాసిన
భూకాంతుడు లక్ష్మి విభుడు పురహరసఖుడున్
జోకతొ మోక్షము నిచ్చుచు
సాకల్యముతోను బ్రోచు సాధులనెల్లన్."

అని యాశంసనము కలదు. ఇది "శ్రీలక్ష్మీనృసింహ దేవుఁడు వేఁటకుఁబోయి చెంచు వనితను బెండ్లియాడుట యనెడి శ్రీ పద్మపురాణస్థ ప్రబంధంబునకు "నాటక రూపంబు". వెనుకటి నాటకములో కందార్థములవలెనే యిందు సీసార్థములు రచింపఁబడి యున్నవి. నాలుగు సీస పాదములు రచింపఁబడిన వెనుక గీత పద్యమునకు బదులుగా పాట చరణములు చేర్పఁబడియుండును. ఇందు ఎరుకలసాని వచ్చుట - లక్ష్మీదేవి కన్నకలకు ఫలితంబు చెప్పుట. ఈ యెరుకల నాచారును వెదకుకొనుచు భర్త "సోడిగాఁడు" వచ్చుట. వీరి వింత సంభాషణ ఏలపాటలో రచింపఁ బడినది - ఇది సుగ్రీవ విజయములోని ఏలపాట ఫణితినే యున్నది :— (3 + 4 మాత్రలగణములు-4).

"సింగినీవూ నన్ను విడిచీ చెంగునాగం తూలువేసీ
ఎందుబోయీ నావుచెప్పా వే-ఆలవోలయ్యా సింగి నీ
వెందుబోయి నావుచెప్ప వే"
సింగినీవు బిలచెదవు అంగనాల యింటికీ
పొంగుచూను యెఱుకజెప్పీ తీ-ఆలఓలయ్యా
బంగారూ సొమ్ములూ యిచ్చిరీ
బుట్టవంకా బెట్టుకోనీ పిట్టలాను దెచ్చినాను

పట్టివేగా వండిపెట్ట వే—ఓ అలిఓలయ్యా
పెట్టుకుంటే పారవేసే దా.

గయోపాఖ్యానంబను నాటకంబనుదానిని

"ఇమ్మనూరి వంశాబ్ధి చంద్రుడుఁ
గొనకొని శ్రీవత్సగోత్రపవిత్రుఁ
డనువంద నీలకంఠాఖ్య పుత్రుండు
సునయుఁ డా వెంకటసుబ్బ సత్కవియు
ప్రాపిత శ్రీ వెంకటాంపల్లె వెలయు
గోపాలుపేర మక్కువ నంకితముగ
చాటి కృష్ణార్జున సంవాద కథయు
నాటకం బొనరించె నవ్యమృదూక్తి"

నీ కథఁ జదివిన నింపుగా విన్న
చేకొని వ్రాసిన చెలఁగి యాడినను
ఆయురారోగ్యభాగ్యాది సంపదలు
తోయజాక్షుఁడు కృతతోడుత నొసగు

కులగిరులెందాక కూర్మమెందాక
జలనిధులెందాక సత్యమెందాక
సోమార్కులెందాక చుక్కలెందాక
భూమియు నాకాశ భూతమెందాక
యందాక వెలయు కౌంతేయుల కీర్తి
నందాక యీ కృతి యవనిఁ బెంపొందు."

గ్రంథాంతమున వ్రాసిన చదివిన విన్నవారిని గూర్చిన యీ యాశంసనము శిష్టకవిత్వములోఁ దొలుత నన్నిచోడుని కుమార సంభవముననే గానవచ్చునుగాని తరువాతి కవులలోఁ గానరాదు. ఇది కన్నడ కవులలో నంతకుఁ బూర్వమునఁ గాననగును. గావున యిది కన్నడాంధ్రములకు సమానమగు ప్రాచీన దేశీయ సంప్రదాయమేమో యని తలంపఁదగి యున్నది.

ఈ వెంకటసుబ్బ కవి గ్రంథాదిని

"వ్యాసవాల్మీక వరకాళిదాస ముఖ్యు
లైన గీర్వాణ కవులను నభినుతించి
సొంపుమీరగ తిక్కన సోమయాజి
మొదలుగా నాంధ్రకవులను మదిదలంచి"-యున్నాఁడు.

"నా యొనర్పఁబూనిన శ్రీ గయోపాఖ్యానాటకంబునకు కథాక్రమంబెట్టిదనిన" అని ప్రారంభించినాడు. దీనిలో కథాభాగ మును సూచించు సంధివచనముగా, పద్యములును గూడ నెక్కు డుగా నున్నవి. పైవానికంటె రచనయు మిన్నగాఁ గనఁబడును. వీనిని రచించిన కవు లెప్పటివారో చెప్పుట కాధారము గానరాదుగాని, మిగులనాధునికులనియే యూహింపవచ్చును. దీనిలో చక్కని రచ నలును లేకపోలేదు. వీనిలో ననేకవిధములగు దేశీయ రచనలు, ద్విపదలు, పాటలు, దరువులు, కందార్థములు, సీసార్థములు, మంగళహారతులు, ధవళములు, ఏలలు, జోలలు మొదలగు నవి కొంతవరకు సర్వజన సామాన్యమగు వ్యావహారిక

భాషలో రచింపబడియుండుటనుబట్టి యివి లాక్షణికుల యొక్క-గాని, పండితులయొక్క-గాని పరిశీలనకు నర్హమైనవిగాఁ దలంపఁబడినట్లు లేదు. ఈ కారణముచే దేశీయ వాఙ్మయశాఖలలో నొక ముఖ్యమైన శాఖ మూలఁబడి ముక్కి-పోవలసినస్థితి యేర్పడినది. ఆంధ్రదేశములోని యీ పై యక్షగాన రచనల కాలము నిర్ణయించుట కవకాశము లేకపోయినను, నాయకరాజుల కాలములోని రంగాజమ్మ మొదలగు విదుషీమణులచే రచింపఁబడిన యక్షగాన రచనలు తంజావూరు సరస్వతీ పుస్తకభాండారమున సుమారు రెండు వందలుగా నున్నవి. సంస్కృతాది నాటకములతోఁ బోల్పఁదగినవి కాకున్నను ఆంధ్రదేశి వాఙ్మయశాఖా పరిణామచరిత్ర పరిశీలన సందర్భముననైనను ఇవి భాషా వాఙ్మయ పరిశీలకుల దృష్టి నాకర్షింపఁ దగినవే. దేశి రచనా పరిశీలనమునకేగాక, భాషా పరిణామ పరిశీలనమునకుఁగూడ నివి యత్యంత సహాయకారులు కాఁగలవు.

ఈ యక్షగానములు ప్రాచీన దేశీయ ప్రదర్శనానుకూల రచనలనియేగాక, వీనియందు, వీని మూలముగాను నిలిచియున్న వివిధ రీతులగు దేశీయచ్ఛందో రచనలనుబట్టికూడ వీని ప్రాధాన్యమును మనము గుర్తింపవలసి యున్నది.

ద్విపద, ఏల, దరువు, ధవళము, మంగళహారతులు, మొదలగునవేగాక, ఇంక ననేకరీతుల తాళబద్ధములగు రచనలు వీనియందుఁ గానవచ్చుచున్నవి. ఇవన్నియు రగడ భేదములే యనియు, వాని నా యా తాళములను బట్టియే గ్రహింపనగు

ననియు, నవి యనేక రీతులుగా నుండుననియు నప్పకవి సూచించియే యున్నాఁడు. ఇవి పాటలరూపమున నుండుటచే జక్కులరేకులను పేరుతో లాక్షణికులు కొందరు వానిని బేర్కొని లక్షణము కల్పింపక- వ్యావహారిక భాషలో నవి విరచింపఁబడుటచేఁ గాబోలు వదలివేసినారు. ఇంక ననేక విధములగు పదములను, పాటలను, లాక్షణికులు, ప్రబంధకవులునుగూడ నా యా సందర్భములఁ బేర్కొనిరేగాని, వానిని రచించి చూపలేదు. కావున నవి సామాన్య జనుల నోళ్ళలోను, ఇండ్లలో పండుగలు, పెండ్లిండ్లు, నోములు, వ్రతములు, పూజలు మొదలగునవి జరుగు సందర్భములలో స్త్రీలు పాడుకొను పాటలలోను, చిన్నపిల్లల యాటపాటలలోను, కొందరు భక్తుల భక్తి, శృంగార వేదాన్త కీర్తనల రూపమునను నిలిచియున్నవి. ఇట్టి కీర్తనలను తొలుత రచించి ప్రత్యేకముగా రాగిరేకులపై వ్రాయించి స్థిరత్వమును గల్పించినవారిలో ముఖ్యులు తిరుపతి వేంకటేశ్వర భక్తులై యాతని సాన్నిధ్యముచే ధన్యులైనవారు తాళ్ళపాకాన్వయమువారు. వారిలో అన్నమాచార్యులు అనేక వేల భక్తి శృంగార వేదాంత సంకీర్తనలను రచించి సంకీర్తనాచార్యులని ప్రసిద్ధి నొందినవాఁడు. వీరి కీర్తన లిటీవల శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధన సంస్థలో ప్రకటితములై ప్రసిద్ధిఁ గాంచుచున్నవి. త్యాగరాజాదులు వీరికి తరువాతివారు.

తాళ్ళపాకంవారు తిరుపతిలో వెంకటేశుని సన్నిధానమున క్రీ. శ. 15, 16 శతాబ్దములలో నుండినవారు. అం

దన్నమాచార్యులు క్రీ. 1408 మొదలు 1503 వరకు నుండిన వారు. ఈయన కుమారులు పెద తిరుమలయ్య, చిన తిరుమలయ్య యనువారలు. వీరు కీర్తనల రచనచే ప్రసిద్ధులు. పెద తిరుమలయ్య కుమారుఁడు ద్విపద కావ్యకర్తయగు "చిన్నప్ప" యను తిరువెంగళనాథుఁడు.

అన్నమాచార్యుల కుమారులలో పెద తిరుమలాచార్యు లనునాతఁడు తండ్రివలె శృంగార వైరాగ్య సంకీర్తనలేగాక, యితర విధములగు దేశి రచనలనుగూడ రచించినాఁడు. శైవమత పరముగ దేశి రచనలను రచించిన పాల్కురికి సోమన తరువాత, వైష్ణవ మతపరముగ పెక్కువిధములగు దేశి రచనలను చేసినవాఁ డీ తిరుమలాచార్యులే. సోమనవలెనే- ఆతఁడు బసవోదాహరణ మును రచింపగా, నీతఁడు వెంకటేశోదాహరణమును రచించెను. ఆతఁడు చెన్నమల్లు సీసములు, వృషాధిప శతకము రచింపగా- నీతఁడు "నీతి సీసములు, శృంగారవృత్త శతకమును రచించెను. ఇంకను "సుదర్శన రగడ" శృంగార దండకము, చక్రవాళ మంజరి అనునవి యీతని యితర కృతులు. ఈతని కుమారుఁడే చిన తిరుమలయ్య. "చిన్నన్న" యని ద్విపద కవిత్వమునకుఁ బ్రసిద్ధి గాంచినవాఁడు. పరమయోగి విలాసము, అష్టమహిషీకల్యాణము, ఉషాపరిణయము అను గ్రంథములను రచించినాఁడు. వీరిని గూర్చియే

చిన్నన్న ద్విపదకెఱుగును
పన్నుగఁ బెద తిరుమలయ్య పదమున కెఱుగున్

అని చెప్పఁబడినది. వీరి రచనలలోనివే కొన్ని యీ క్రింది రచనారీతుల కుదాహరణములుగా గ్రహింపఁబడినవి.

ఈ దేశీయరచన లనునవి పదములని పాటలని రెండు విధములుగా నున్నవి. అట్టివానిలోఁ జేర్పదగినవే యీ క్రిందివి కొన్ని :—

పదములను పేరుతో నున్నవి —

తుమ్మెద పదములు

ప్రభాతపదములు- ఇవియే మేలుకొలుపులు గావచ్చును;

వెన్నెల పదములు- ఇవియే చందమామ పదములు.

కోవెల పదములు

చిలుక పదములు

విరాళి పదములు

గొబ్బి పదములు

నివాళి పదములు- ఇవియే ఆరాత్రికములు-ఆరతులు గావచ్చును. మంగళ హారతులును గావచ్చును.

మువ్వగోపాల పదములు- శిరి శిరి మువ్వ

హరిహరీ నారాయణ పదములు

పాట లనుపేరుతో నున్నవి —

లాలిపాట

జోలపాట

ఏలపాట

సువ్విపాట—ఇదియే దంపుళ్ళపాట. సువ్వాలపాట.
ఉయ్యాలపాట
జాజరపాట
ఐరేనిపాట
అప్పగింతల పాట
శ్రావణ శుక్రవారం పాట
శ్రావణ మంగళవారపు పాట
అక్కల పాట
అల్లోనేరేళ్ళు
శోభనములు
ధవళములు
సూళాదితాళ కొట్నములు
చద్దులు-కృష్ణుని చద్దులు
సుద్దులు-(గొల్లసుద్దులు etc.)
ఉరుటణులు
గౌడుగీతములు
కందార్థములు
గీతార్థములు
పీసార్థములు
దరువులు
చిందులు
కీర్తనలు
పవతుల కయ్యము etc. etc.

తాళ్ళపాక అన్నమాచార్యులు
తిరువెంగళనాథుమీద విన్నపముచేసిన శృంగార కీర్తనలు.

అల్లోనేరేళ్లు.

(నాలుగేసి మాత్రల నాలుగు గణములు.)

రాగం, దేసాళం.

పల్లవి.

నెయ్యము లల్లో నేరేళ్ళో।
వొయ్యన పూరెడి వువ్విళ్ళో॥

చరణము.

పలచని చమటలు - బాహూమూలల
చెలమలలోనఁ - జెలువములే।
దళదళమనుము - త్యంపుజె అంగు
దులిపెటి నీళ్ళా - తుంపె ళ్ళో॥ — నెయ్యము
తొటతొటఁ గన్నుల - దొరిగెడి నీళ్ళా
చిటిపొటి యలుకల - చిరునగవే
వటఫలంబు నీ - వన్నెల మోవికి।
గుటకల లోనా — గుక్కిళ్ళో॥
గరగరికల వేం - కటపతి కౌఁగిట
పరిమళములలో బచ్చన లూ।
మరుని వింటిక - మ్మనియంప విరుల
గురితాకూ లినుప — గుగ్గిళ్ళో॥

శోభనము. రాగం. వసంతం.

పల్లవి.

శోభన మేశోభన మే
వైభవ ములపా వనమూర్తీ కీ ॥

చరణము.

అరుదుగ మునునర కాసురు డూ
సిరులతో జీరలు దెచ్చిన సతులా
పరువపు వయసుల పదారు వేలను
సొరిదిబెం డ్లాడిన సుముఖుని కీ ॥

చెందిన వేడుక శిశుపా లుండూ
అది పెం డ్లాడగ నవగళించి
విందువలెనె తా విచ్చేసి రుక్మిణి
సందడి బెం డ్లాడిన సర సునికీ ॥

దేవదానవులు ధీరతను
దావతిపడివార్ధి దరువంగను
శ్రీవని తామణి జెలగి పెండ్లాడిన
శ్రీ వెంకటగిరి శ్రీనిధికి

....0....

సువ్వి. కేదారగౌళ.

పల్లవి.

సువ్వీ సువ్వీ సువ్వా నీ
సుదములు దంచెద రో— లాల

చరణము.

వనితల మనసులు కుందెన చేసిటు
వలపులు తగనిం చో (ఓ) -లాల

కనుస న్నలనెడి-రోకం-డ్లానూ
కన్నెలు దంచెద-రో-లాల

బంగరు చెఱగుల-పట్టుపు ట్టముల
కంగులు దూలగ-నో-లాల

అంగన(నా) లందఱు(ఋా)-నతివేడుకా-తో
సంగడి దంచెద-రో-లాల.

కురులుదూలగమంచి-గుబ్బచన్నూలపై
సరులుదూలాడంగ-నో-లాల
అరవిరిబాగుల-నతివలు ముద్దులు
గురియుచు-దంచెద-రో-లాల.

ఘల్లుఘల్లుమని-కంకణరవములు
పల్ల వపాణులకో-లాల
అల్లన నడుములు-అసియాడుచు-సతు
లొల్ల నె-దంచెద-రో-లాల ॥

కప్పురగంధులు కమ్మనిపువ్వుల
చప్పరంబులనే-ఓ-లాల
తెప్పలుగారతి దేలుచుఁ గోనే
టప్పనిం బాడెద-రో-లాల ॥

....0....

ఉయ్యాలపాట. రాగం, శంకరాభరణం.

పల్లవి.

ఉయ్యాల బాలూ నూచెద రూ-కడు
నొయ్యనొయ్య నొయ్యనుచూ ॥ ఉయ్యా.

చరణము.

బాలయవ్వనలు, పసిండి వుయ్యాల
బాలునివొద్దం బాడేరు।
లాలిలాలిలాలి, లాలెమ్మయెల్ల
లాలిలాలి లాలెనుచు ॥
తమ్మిరేకుగను దమ్మిల నవ్వుల
పమ్ముంజూపుల బాడేరు ।
కొమ్మలుమట్టుగునుకుల నడపుల
ధిమ్మిధిమ్మిధిమ్మెనుచు ॥
చల్లుంజూపుల జవరాండ్రు రే
పల్లె బాలునిం బాడేరు
బల్లిదు వేంకట పతిజేరియందెలు
ఘల్లుఘల్లు ఘల్లనుచు ॥

....0....

గొబ్బిళ్ళపాట. రాగం, దేసాళం.

పల్లవి.

కొలనిదోపరికి - గొబ్బిళ్ళో - యదు
కులముసామికిని — గొబ్బిళ్ళో

చరణము.

కొండగొడుగుగా - ఆవులగాచిన
కొండొక శిశువుకు - గొబ్బిళ్ళో
దుండగంపుదై - త్యులకెల్లను తల
గుండుగండనికి - గొబ్బిళ్ళో ॥
పాపవిధుల శిశు-పాలుని తిట్టిన
కోపకానికిని - గొబ్బిళ్ళో
యేపున గంసుని - యిడుమల బెట్టిన
గోపబాలునికి గొబ్బిళ్ళో ॥
దండి వైరులను - తఱిమిన దనుజుల
గుండె దిగులునకు - గొబ్బిళ్ళో
వెండి పైడియగు - వేంకటగిరిపై
కొండలయ్యకును - గొబ్బిళ్ళో ॥

....0....

అత్తా కోడళ్ళ జగడము. రాగం, పాడి.

రావే కోడల - రట్టడి కోడల
పోవే పోవే-అత్తయ్యా-పొందులునీతో-జాలూనూ

చరణము.

రంకెలువేయుచు - రాజునెదుట నీవు
కొంకూ గొసరూ - లేనీ - కోడాలా ।
పంకజముఖి - నీవు పలు దొడ్డవారిండ్ల
అంకెల దిరిగేవు - అత్తయ్యా ॥

ఈడాడ, నలుగురు - నేడ్గురు మగలతొ
కూడీ - శిగ్గూ - లేసీ - కోడాలా
వాడకు బదుగురి - వలపించు — కొనినీవు
ఆడాడ - దిరిగేవు - అత్తయ్యా.
బొడ్డున బుట్టిన - పూపనికే విను
గొడ్డేరు తెస్తీ - నే కోడాలా
గుడ్డముపయినున్న - కోనేటిరాయుని
నడ్డగించుకొంటి - వత్తయ్యా.

....0....

గయోపాఖ్యాన నాటకములోని యొక "దరువు"
రాగం-తోడి, ఆది తాళం-ఇది "ఏలా" లక్షణము
కలదై యున్నట్లగపడుచున్నది.

"నందివాహను డగుచువచ్చే నూ - గౌరీశు డిదిగో
నందివాహను డగుచువచ్చేను.
నందివాహను డగుచువచ్చెను - నందనందనుడైన యా గో
విందునకును పు రందరప్రియ నందనునకును, సంధినేయగ
(నంది)
జడలలోమిన్నేరు సగము నొడల పార్వతి మెరయుచుండగ
బుడుత చందురు నందముగదల పువ్వుగను సిగదురిమి వేగమె
(నంది)
కరమునను శూలంబు మూడవ కన్ను ఫాలమునందు మెరయగ
వరదుడా శ్రీవెంకటంపలె-వాసుడౌ శ్రీ విష్ణుకడకు (నంది)

## శోభనము.

(మృత్యుంజయ విలాసము-గోకులపాటి కూర్మనాథ కవి.)
(ఐదేసి మాత్రల గణములు)

శోభాన మే - శోభాన మే
శోభనమె - శర్వునకు, శోభనమె — పార్వతికి
శోభనమె కైలాస, శుభమంది — రునకూ (శోభానమే)
మణితతుల-హారతులు, మదవతులు ఇయరమ్మ,
మతియుతుడు-శివ్వన్న, మగువగౌ-రమ్మకు (శోభానమే)

....0....

## సుగ్రీవవిజయము.

శ్రీరాముడు-గుణధాముడు, వారిజదళ లోచనుడూ
శూరతరా-వణుగూలిచి, నారీమణి-దేవలయున్ (శోభానమే)
రామునికృప కపిరాజ్యము క్షేమంబున బాలించీ
శ్రీమంతుడు సుగ్రీవుడు. భూమండలి పొగడొందున్ (శోభా)
సంగరవిజ యముతోను-పొంగెను సుగ్రీవునకు
సంగతిగా యువరాజై యంగదుడిల బెంపొందున్ (శోభా)

## కొట్నముల పాటలు

చెలియారావె, చేడెరావె, చిన్నిరావె, పొన్నరావె
వెలదిరావె, కొట్నమూలు, వేగదంచుమూ.

గరుడవాహ నములు మంచి, గౌరికుంక మములు రత్న
సరులు పచ్చగన్నేరులు సన్నదినుసులూ
కలయగూర్చి దంచిరపుడు. (మృ. వి. 3-60)

—o—

గజేంద్రమోక్షము_కథాగీతమను పేర నున్నది.

రాగం, ఆనందభైరవి. ఆటతాళము.

రాజేంద్ర వినుమువి రాజిత మగుగజ
రాజమో క్షణకథనూ.
మహాసుధను రహితమనోవ్యధనూ ॥
రాజిల్లు భువిసుధా రాశిత్రి కూటాద్రి
యోజనా యుతయామ మున్నత త్వంబూ వి
భ్రాజితంబుగ కాంచనంబున రాజితంబు గయోమయంబున
రాజెలంగెడి శృంగములుమూ డతులమణిధా తువుల వెలుగును
॥రాజేం.

ఇవ్వారి చరమున-కెవ్వర-డ్డమువత్తు
రెవ్వారు నాకాఢ్యు డూ-పరమేశ్వరు
డెవ్వాడు కారాణు డూ-సర్వాధారు
డెవ్వాడు పరిపూర్ణు డూ
పారాత్మకు డెవ్వాడు నిర్ధారణు డూ-మహాత్మకూ
డెవ్వానిచేగ_ర్త నెవ్వానినుంచ నెవ్వనిలోడిందు యీ జగ
[మంతాయు
ఎవ్వడీలో కంబులునులో కేశులునులో కష్టులును దెగి
నవ్వలనుపెం జీకటినినే కాకృతినివెలు గొందునతనిని ॥

గజరాజ మోక్షణ కథవిను వారికి
కలుషాము హరియించు నూ
దుస్స్వప్నము తొలగును యశమెచ్చు నూ
దుఃఖమూ బాయూక లుములు ప్రాప్తించూ నూ
సౌఖ్యము గల్గుకై వల్యములభించునూ.

....0....

తలుపుదగ్గర పాటలు

శ్రీకాం-తామణి-నేనీ-సఖుడను
శీఘ్రము-వాకిలి-తీవే- నీవు
శీఘ్రము-వాకిలి-తీ-వే.

ఓకాం తుడనీ-గుణములు-తెలిసెను
ఊరికె-వెళ్ళగ-దో-యీ. నీవు
ఊరికె-వెళ్ళగ-దో-యీ.

ఈమా టలునీ-వెన్నడా-డవది
ఏమే-అలుమెలు-మం-గా-అది
ఏమే-అలుమెలు-మం-గా.

భామల-మరిగిన-వాడవు-నాతో
పలుకు-లేలపో-వో-యీ-యీ
పలుకు-లేలపో-వో-యీ.

పరభా మలనే-కూడితి ననియిటు
పలుకుట-కారణ-మేమే-సఖి
పలుకుట-కారణ-మేమే.

తరుణుల-కూడక-యుంటే-పువ్వుల
దండలు-ఎక్కడి-వో-యీ-పూల
దండలు-ఎక్కడి-వో-యీ.

హరిహరి-నేనే-మెరుగను-భక్తులు
అర్పిం చిరెవో చెలీ యా-నా
కర్పిం చిరెవో చెలీ-యా.

—0—

మంగళవారం పాటలు.

కైలాస-గిరిలోను-కల్ప వృ-క్షముక్రింద
ప్రమథాది-గణములు-కొలువగా-నూ
పార్వతీ-పరమేశు(లు)-బాగుగా-కూర్చుండ
పరమేశు-నడిగెఁదా-పార్వతప్ప-డూ,
జయమంగ-ళంనిత్య-శుభమంగ-ళం.

ఏ వ్రతము-సంపదలు-నెలమితో-డుతనిచ్చు
ఏ వ్రతము-పుత్రపౌ-త్రావృద్ధి-నొసగూ
అనుచునా-పార్వతీ-యాహటా-నడిగే.

శ్రావణా-మాసాన-శుక్ల ప-క్షమునందు
శుక్రవా-రమునాడు-మునిమాపు-నా
పంచక ల్వాలుదెచ్చి-బాగుగా-నూనిల్పి
భక్తితో-బూజించు-మనిచెప్పె-నూ.

అయిదేసి మాత్రలతోఁ గూడిన నాలుగేసి గణము లొక్కొక్క పాదమునకు. మూడవ గణము మొదటి యక్షరమున యతి. రెండవ పాదము-తుదిగణ మేకాక్షర గణము కావచ్చును.

ఆనంద గీతములు.

ఆనంద మానంద మాయెనూ మనశ్రీ
రాములు పెండ్లి కొడు కాయెనూ-మన
జానకి పెండ్లి కూతు రాయెనూ-యెల్ల
జనులాకు సంతోష-మాయెనూ-సుర
మునులాకు-విన వేడు-కాయెనూ.

—0—

లాలిపాట—కృష్ణ జననము.

కస్తూరి-రంగరం-గా, మాయన్న-కావేటి-రంగరం-గా
శ్రీరంగ-రంగరం-గా-నినుబాసి-యెట్లునే-మరచుందు-రా.

—0—

జో అచ్యుతానంద-జోజో-ముకుందా
లాలి పరమానంద రారమూకుందా-లా-లీ.

—0—

లాలి శ్రీకృష్ణలాలీ-లాలిమానల్ల నయనా,
లాలి మాబొజ్జతండ్రీ-లాలినావరహాల పంట-లాలీ.

—0—

మేలుకొలుపు పాట

(3 + 4 మాత్రల 4-గేసి పాదాలు)

మేలుకొనవే-చంద్రశేఖర-మేలుకొనవే-ఇంద్రవందిత
మేలుకొనవే-నీలలోచన-నీలకంఠా-హరహరా మేలుకొనవే.

శంభుశంభో-యనుచు వేడ్క-తో-నమ్మునీశ్వరు-లరుగుదెంచిరి.
జృంభణమ్మున-నారుమోముల-సూనుదే తెంచె
పండువెన్నెల-గ్రుంకుతూర్పున-కొండపై నుద-యించెసూర్యుఁడు
దండికలువల-జారచోరుల-దర్పమడగగ మా
హరహరా- మేలుకొనవే ?

....0....

మేలుకో-శ్రీరామ-మేలుకో-రఘురామ
మేలుకో-గుణధామ-మేలుకో-నాస్వామి-మేలుకో.
చాలునిం-కానిద్ర-పూనికతో-నిన్ను బూ
జించువా రలనుబో షింపవలె వేగ-మేలుకో.
నాస్వామి-మేలుకో.

....o....

వెన్నెల పాటలు

కాకీ కాకీ గంతుల కాకీ
కాకిని తీస్కెళ్ళి గంగలో ముంచితే
గంగానాకూ పాలూ ఇచ్చే
పాలూ తీస్కెళ్ళి అమ్మాకిస్తే
అమ్మా నాకూ డబ్బానిచ్చే
డబ్బా తీస్కెళ్ళి పంతులకిస్తే
పంతులు నాకు చదువూనిచ్చే
చదువు తీస్కెళ్ళి మామాకిస్తే
మామా నాకూ పిల్లానిచ్చే
పిల్లా పేరూ-మల్లె మొగ్గ
నా పేరు జమీందార్.

అట్ల తద్దెలలో వెన్నెట్లో వెన్నెల పరుగులు - చిన్నీ చిన్నీ లని పిల్లలు పాడుకొనే పాటలు—

చిన్నీ చిన్నీ కెన్నెళ్ళూ
సింగలగౌరీ కెన్నెళ్ళూ
తరళనేత్రా కెన్నెళ్ళు
తామరసిరీ మొగ్గల్లు

—o—

ఏల.

ఓబలేశుని కొండల నడుమా
ఒంచేగడ్డీ కోనేదానా
ఒంచేగుడ్డా వాల్లీ గుడ్డేమే।
కాళింగి కిణికిణి, ఛణక ఛణకని
ఒంచెతీసి, పంచవరవా లే.
గిద్దెగిరీ కొండలనడుమా
ఎద్దులతో-లే ముద్దులమరిదీ
నన్నుసూసీ నవ్వబోకోయీ—హరిఓబాబులేశా
నన్నుసూసీ నవ్వబోకోయీ.

—o—

"ఏగంటివారి వచనాలని" సామాన్యజన వ్యవహారమున సుప్రసిద్ధములు. వానిలో గొన్ని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నేకరింపఁబడియున్నవి. వారిశిష్యుల రచనలలోనివి. శైవము-వేదాంతము, గార్లపాటి లక్ష్మణకవిరచితము.

తుమ్మెద పాట. అయిదేసి మాత్రల గణముల

శ్రీకరుఁ డను పువ్వు-తుమ్మెదా-మోడు
లోకము లాయెను-తుమ్మెదా
సాకారమైయుండు-తుమ్మెదా-పర
మేకాంతమునజూడు-తుమ్మెదా.

శివశివ యనవే—ఎ—తుమ్మెదా
శివుడనగ వినమేలు—తుమ్మెదా
శివునిభక్తూలాకు-తుమ్మెదా
శివశార-ణనమేలె-తుమ్మెదా ॥

ఆఱు రేకులపూవు తుమ్మెదా—అది
మీఱీన వాసనె తుమ్మెదా
వేఱునేయక నీవు తుమ్మెదా—శివు
చేరి భజించవె—తుమ్మెదా ॥

ఈళ పింగళాలు—తుమ్మెదా—సుషమ్న
నాళిమధ్యమున—తుమ్మెదా.
మేలిమెఱిగే—నీవు—తుమ్మెదా-శివ
కేళి జరించవె—తుమ్మెదా ॥

....o....

చిలుకపాటలు — అయిదేసి మాత్రల గణములు.

చెలగి చెప్పెదబుద్ధి చేకొనీ వినినీదు
చింతమీ దానుండు చిలుకా

కులముతో వైరంబు కొఱగాదు మిక్కిలీ
గూడువె ళ్ళకయుండు చిలుకా
పట్టుబసలేని యాపదలకై కెమ్మోవి
పండ్లకే రాకుమీ చిలుకా
పట్టముట్టగరాని బట్టబైటను తేనె
పండు ఉన్నదిచూడు చిలుకా,
గురుతైనయేగంటి గురుపాదములుచేరి
గిరిగడచి యామీద చిలుకా
సిరులుమాయని తెలిసి జీవగుణమిది యెఱిగి
చిగురుమే తలబోకు చిలుకా ॥

....0....

ఏల పాట

సూర్యచంద్ర వహ్ని నడుమా
శౌర్యమానే చిలుకగంటీ
సూర్యదీప్తి గాయుచుండా గా—యేగంటిలింగా
చూడజూడా శ్చర్యమాయె రా—యేగంటిలింగా

....0....

కాంతాల పాలెములోన
చింతమానూ పుట్టెగదరా
చింత అనలూ కొనలుసాగా నా—యేగంటిలింగా
చింత పూసీ—వండు పండే—రా
కానరాని యడవిలోన
వానలేని మడుగునిండె

వానలేని మడుగుమీదానూ—యే గంటిలింగా
మానరానీ అగ్నిపొడమే-రా
ఆకులేని యడవిలోన
తోకలేని మృగము కదుపూ నా—యే గంటిలింగా
ఈకెలేనీ పక్షి బుట్టేరా.

—o—

## లాలి పాట

లాలనుచు ఊచేరు లలనలందఱునూ
ఫాలలోచన నిన్ను బాన్పుపైనుని చీ-లాలీ
ప్రణవపంచాక్షర పాన్పుతాగాగ
భరితచిత్ప్రణవమే బాలీసుగాగా
చరలింగ చిత్కళలు దీపములుగాగ
పరమసద్గురువందు-పవళించుకోగా-లాలీ
లాలిచిద్రూపాంగ లాలయ్య లాలీ
లాలి సజ్జన హృదయ లాలయ్య-లాలీ.

—o—

## మంగళం

అరుదొంద వృషభవాహనుడు ఏగంటీశు
దరయలక్ష్మి భక్తవరదుడనుచూ
పరికింప నేలినా ప్రమథగణములాకు
సరససా యుజ్యశివ సామూహ-మునకూ
జయమంగళం నిత్య శుభమంగళం.

—o—

దేశి రచనలనుగూర్చి భరతుని నాట్యశాస్త్రమందు వలెనే, మతంగుని బృహద్దేశియందును పార్శ్వదేవుని సంగీత రత్నాకర మందును గొంత చెప్పఁబడియున్నది. వీనినిబట్టి చూడఁగా ఏలా భేదము లనేకములుగా నున్నట్లగపడును. ఏలలే కాదు – దేశీ ప్రబంధములే అసంఖ్యాకములనియు వానిలోఁ గొన్నిటినే తాము తెలుపుచున్నట్లును జెప్పినా రీ లాక్షణికులు.

"దేశికారప్రబంధోఽయం హర వక్త్రాద్వినిర్గతః
అసంఖ్యాకాస్తు కథితాః న జ్ఞాయంతేఽల్పబుద్ధిభిః
తేషాం మధ్యాత్ సముద్ధృత్య యుక్త లక్షణలక్షితాన్
శ్రీమతఙ్గో ముని ప్రాహ మునీనుద్దిశ్య తద్యథా
ఆద్యః ప్రబంధః కన్దాఖ్యో వృత్తా నామ ద్వితీయకః
గద్యరూపః తృతీయస్స్యాత్ దండకః స్స్యాచ్చతుర్థకః
పంచమో వర్ణకః ఖ్యాతః షష్ఠ ఆర్యాభిధాయకః
సప్తమీ కథితా గాథా తతో ద్విపదకోఽష్టమః

9. వర్ధతీ; 10. అడ్డిలా; 11. చతుష్పది: 12. తోధకము; 13. తోటకము: 14. వస్త్వాఖ్యప్రబంధము: 15. క్రౌంచపదము; 16. హంస; 17. శుకసారికః; 18. అశ్మలీలా;..... .... ....
28. త్రిపదీ - షట్పదీ; 29. బంధకర; 30. పాటకరణం; 36. ద్విపదీ; 37. వర్తనీ; 38. ఏలా.

"అష్ట త్రింశత్తమాత్వేలా బహు భేద ప్రవిస్తరా"
39. ఢేంకీ; "ద్వ్యధేకాచ్చైకతాళకా."

ఏతేషా మధికః ఖ్యాతః ప్రబన్ధో మాతృకాహ్వయః
ప్రబన్ధోఽయం స్వరార్థస్స్యాత్ జ్ఞేయోఽసౌ గీతవేదిభిః
తాలశూన్యాది యః పాఠై ర్విరుదై శ్చసమన్వితః
స కన్ద ఇతి కర్ణాటభాషాదిపదమిశ్రితః
కన్దాది ప్రబన్దా లక్ష్యతః ప్రసిద్ధా ఏవ.
గీయతే యత్ తదత్రాహుఃర్గద్యం గీతవిశారదాః
తాలయుక్తం స్వరోపేతం మధ్యే పాటవిరాజితం.
దేశీగీతేఽపి వస్తుస్స్యాన్నాటకేఽపి ప్రయుజ్యతే
గీతే తు ప్రతితాలేన పదస్వరసమాయుతః
మతః క్రౌంచపదో నామ స తు గాంధర్వవేదినాం
సంస్కృతం పాదమేకం తు ద్వితీయం దేశసంయుతం
సప్రాసం గీయతే యత్ర గీతం హంసపదం విదుః
యస్తు తాలద్వయోపేతపదపాటవిరాజితః
యా స్యాత్కరణతాలేన ద్విపదీ వృత్తసంగతా
సా భవేత్ ద్విపదీనామ ప్రోక్తా వస్తువిచక్షణైః
ఆద్యం పాదద్వయం యత్ర స్యా దనుప్రాసవర్జితం,
అనుప్రాసస్తృతీయేఽపి చతుర్థే వాథ గీయతే,
చతస్రో గీయతే యత్ర పాదే పాదే భవన్తి చ
గీత్వా తదీయపాదార్థం అనుప్రాసో విధీయతే,
త్యాగసౌభాగ్య సౌందర్య శౌర్యధైర్యాదివర్ణనా
యస్యాం భవితి గీతజ్ఞా స్తామేలాం సంప్రచక్షతే.

మట్టేనాథ ద్వితీయేన కంకాలేన తథైవచ
సంయుక్తా ప్రతితాలేన కర్తవ్యైలా మనీషిభిః
వర్ణనీయస్య గాతుశ్చ సాతునామాజ్కితా భవేత్
ఆదౌ నాదవతీ ప్రోక్తా-తతో హంసావతీ మతా
నన్దావతీ తృతీయాచ-తుర్యాభద్రావతీ స్మృతా
ఇత్యేలా గణమార్గేణ బుధైరుక్తా చతుర్విధా.

ఏలా నాదవతీ రమ్యా వర్ణాలంకార శోభితా
గీయతే మట్టతాలేన నాదయుక్తా పదేపదే
శ్వేతోవర్ణశ్చ విజ్ఞేయః శృంగారః కథితో రసః
కైశికీవృత్తిరాఖ్యాతా పాంచాలీ రీతి రిష్యతే
యత్ర చంద్రగణాః పంచస్వర్గణైకేన సంయుతా.
ఏలా నాదవతీ నామ సా స్మృతా పూర్వసూరిభిః.

హంసస్యేవ గతిం కాసా నాదేన చ పదేన చ
సమం ప్రవర్తతే యస్మాత్ తతో హంసావతీ స్మృతా
తాలో ద్వితీయకస్తత్ర హిన్దోళేన తు గీయతే
రక్తో వర్ణః సమాఖ్యాత శ్చండికా దేవతా భవేత్
యత్రానలగణాః పంచ, షష్ఠో వాయుగణస్తథా
ఏలా హంసావతీ నామ సా స్మృతా గీతపారగైః ॥

లఘుభిర్గమకైర్యుక్తా రాగో మాళవకైశికీ
ఏలా నన్దావతీ నామ ప్రతితాళేన గీయతే.
యత్రాంబరగణాః పంచ మార్తాణ్డగణ సంయుతాః
ఏలా నన్దావతీ సా తు విజ్ఞేయా గీతివేదిభిః ॥

ఏకైక పదసంయుక్తా మూర్ఛనాధ్వని సంకులా
కంకాలతాల సంబద్ధా కకుభేన ప్రగీయతే
ఏలా భద్రావతీనామ శూద్రజాతి సముద్భవా ॥
యత్ర భూమిగణాః పంచ షష్ఠో జలగణ స్తథా
త్రిపదం పాదసంఖ్యానం మూర్ఛనాబిన్దు సంకులం
యత్స్థితం గమకం కుర్యాదేత దేలాసు లక్షణం

ఇతి గణైలా చతుష్టయం.

తృతీయపాదవత్ పాద శ్చతుర్థో యది వర్తతే
ఏలా సంకరతా మేతి మతంగమునిభాషితం.
రతిలేఖా, కామలేఖా, బాణలేఖా తథైవచ
కథ్యతే చన్ద్రిలేఖా చ-మాత్రైలామాహ వల్లభః
యస్యా మంఘ్రిద్వయే మాత్రా రుద్ర సంఖ్యా స్తృతీయకే
రుద్రహ స్తసమా శ్చైవ, రత్యాఖ్య గణసమ్మితాః
కథితా గీతి శాస్త్రజ్ఞై రతిలేఖేఽపి నామతః.

సంగీత రత్నాకరం.

ప్రబంధో రూపజం వస్తు నిబద్ధస్యాభిదాయకం
చతుర్భిర్ధాతుభిః షడ్భిశ్చాంగై ర్యస్మాత్ ప్రబధ్యతే
తస్మాత్ ప్రబంధః కథితో గీతలక్షణకోవిదైః.
ఉద్గ్రాహకశ్చ మేలాపః ధ్రువ ఆభోగ ఏవచ
ఏలాయాం ఢేంకికాయాం చ స్యాద న్తే నియమాదిమౌ
అంగాని తు ప్రబన్ధానాం వదామః సాంప్రతం క్రమాత్.
పాద, తేనౌ, చి విరుద, పాటో-తాలస్వరౌ తథా
సన్దేహో వాద్యవర్ణానాం పాటస్తా లానుగో భవేత్.

తేన్న తేన్నేతియే వర్ణా గీతేఽపౌ తేన్నకోమపః
అంగమాత్రేణవిహితా అనిర్యుక్తా ఇతీరితాః
ఛందస్తాలాదినియమాన్నిర్యుక్తాస్తే నిరూపితాః
ధవళశ్చర్చరీ చైవ వదనం ఝంపట స్తథా
చరిజా త్రిపదీచైవ సింహపాద స్తథైవచ
పదం తాలసమాయుక్తా మంగళం స్తవమంజరీ
అమీ సర్వప్రబంధాశ్చ నిర్యుక్తాః పరికీర్తితాః
హరిర్విజయసంజ్ఞస్స్యాత్ ఏకతాళీ తథైవచ.

ఏలా.

ఉద్గ్రాహేఽంఘ్రిద్వయప్రాప్తైః ప్రతిపాదం గణాశ్చ షట్
పాదస్యాంతే ప్రయోగస్స్యాత్ పల్లవాఖ్యం పదం తతః.
పల్లవాఖ్యేపదే నాస్తి నియమో గణవర్ణయోః.
అనేనైవ ప్రకారేణ ద్వితీయాంఘ్రేః ప్రకల్పనా.
గీత్వా తత స్తృతీయాంఘ్రిం దేయో మేలాపకో భవేత్
తదా పాదత్రయే గీతమేకమేవ విధీయతే.
సప్రాసోఽథ ధ్రువే గేయో వర్ణ్యనామ్నా సమన్వితః
అభోగశ్చతతో గేయో గాతుర్నామ్నా విరాజిః
ధ్రువం గీత్వా తతోన్యాసః సర్వైలాసు ప్రశస్యతే.

గద్యం.

అపాదః పదసందోహో గద్యం షోఢా తదిష్యతే
వృత్తగంధి తథా చూర్ణమన్యదుత్కలికాభిధం.
లలితం చ తథా ఖండం చిత్రం తల్లక్ష్మ కథ్యతే.

పద్యభాగాన్వితం గద్యం వృత్తగన్ధి నిగద్యతే
అసమస్తైస్సమస్తైర్వా ద్వితైౖస్తు చతుర్తైః పదైః
రచితం చూర్ణమాఖ్యాతం గద్యం గద్యవిశారదైః
గౌడరీత్యా యుతం గద్యం ప్రోక్తముత్కలికాభిధం
సమస్తైః పంచషైర్బద్ధం పదైర్లలిత మీరితం
ప్రక్రాన్తరీతిభంగేన బృహల్లఘుపదైర్యుతం
గద్యం ఖండ మితి ప్రాహుః గద్యభేదవిశారదాః
గద్యం చిత్రమితి ప్రోక్తం నానారీతిసమన్వితం
ప్రణవాద్యం భవేద్గద్యం గేయం తాలవివర్జితం
మిథః సయమకైషడ్భి రష్టభిర్వా సమన్వితం.
పదాన్యేతాని మేధావీ గాయేత్ గీతానుసారతః.

ఏకతాళీ.

ద్విరుద్గ్రాహం ధ్రువం ద్విశ్చ గీత్వా భోగం సకృత్ పునః
ధ్రువం గీత్వా తతః కార్యో న్యాసో గీతవిశారదైః
ఘనద్రుతా ఘనప్రాసా యత్యా చ ఘనయా యుతా
ఏకతాళాఖ్యతాలేన గేయా స్యాదేకతాలికా
ఆలాపానిర్మితః కైశ్చిదస్యా ఉద్గ్రాహ ఇష్యతే.

దీనినిబట్టి తాళప్రధానములు, మాత్రాగణబద్ధములు, ఉద్గ్రాహాదులతో గూడి గేయములగు నీ దేశి రచనలకు దేశీయపద్ధతిని లక్షణ మేర్పఱచుటలో నీ సంస్కృత లాక్షణికులెట్లు శ్రమపడినదియు సువ్యక్తమగుచునే యున్నది.

కందము, ద్విపది, త్రిపది, చతుష్పది, షట్పది, ఏలపదం, పాట, గద్యం, కళిక, ఉత్కళిక, ఏకతాళి, ధవళం, మంగళం, మంజరి మొదలగువానిని లక్షణయుక్తముగాఁ జేయుటకు కొంత ప్రయత్నము జరిగినది. ఇవి తెలుఁగు కన్నడ సాహిత్యములకు సంబంధించినవై యున్నవి. మరికొన్ని— ఢేంకా, ఝొంబడకం, వర్తనీ, ముక్తావళీ మొదలగునవి మహారాష్ట్రాది దేశ ప్రాంతముల లోని దేశి రచనా భేదములు కావచ్చును. తెలుఁగు లాక్షణికులు పైవానిలోఁ గొన్నిటిని వదలివేసినను, వీనిలో పెక్కు చిరకాలము నుండి సామాన్య జన వ్యవహారమున నుండిన దేశి రచనలనుటకు సందేహము లేదు. వీనికి సరియైన లక్షణ సమన్వయము, లక్ష్య సంపాదనము, భిన్న భాషలలోని దేశి రచనలకుఁ గల పరస్పర సంబంధాన్వేషణము, భిన్నములగు నీ ఛందోరీతుల మూలతత్వ పరిశీలనము, ఆ యా దేశ భాగములం దింకను నిలిచియున్న దేశి రచనల సంగ్రహణము, ప్రకటనము మొదలగు కార్యము లాంధ్ర దేశి సాహితీపరుల యాదరాభిమానముల నాకాంక్షించుచున్నవి. వారు వీనియందు శ్రద్ధాళువు లగుదురు గాక.



# సవరణ

క్రింది పదాల్లో శకటరేఫ ఉన్నచోట్ల ఴ కారం ఉండాలి.

| పుట - పంక్తి | |
|---|---|
| 9 - 11 | ఴ కార |
| 13 - 19 | ఴ కారములు |
| 16 - 9 | పుకఴ్, పొగఴ్ |
| 16 - 14 | పుకఴ్ |
| 17 - 3 | పుకఴ్, పాఴ్ |
| 17 - 4 | కోఴి |
| 17 - 7 | "ఴ" కారము |
| 17 - 9 | పుఴల్, పొఴల్, కీఴె, కెఴగె |
| 17 - 10 | ముఴంగు, పొఴుదు, పొఴ్తు |
| 17 - 11 | ముఴుకు |
| 27 - 21 | ఉఴున్దు |
| 53 - 20 | పొఴుదు, పొఴ్తు |
| 89 - 12 | తమిఴర్ |
| 110 - 3 | విజయతెందుఴూర |
| 110 - 5 | తెందుఴూరు |
| 110 - 7 | అగుబంఴు |
| | అగుంబఴ్టు పదాదివర్ణం |

# సవరణ

క్రింది పదాల్లో శకటరేఫ ఉన్నచోట్ల ఴ కారం ఉండాలి.

| పుట - పంక్తి | |
|---|---|
| 9 - 11 | ఱ కార |
| 13 - 19 | ఱ కారములు |
| 16 - 9 | పుకఱ్, పొగఱ్ |
| 16 - 14 | పుకఱ్ |
| 17 - 3 | పుకఱ్, పాఱ్ |
| 17 - 4 | కోఱి |
| 17 - 7 | "ఱ" కారము |
| 17 - 9 | పుఱల్, పొఱల్, కీఱె, కెఱగె |
| 17 - 10 | ముఱంగు, పొఱుదు, పొఱ్తు |
| 17 - 11 | ముఱుకు |
| 27 - 21 | ఉఱున్దు |
| 53 - 20 | పొఱుదు, పొఱ్తు |
| 89 - 12 | తమిఱర్ |
| 110 - 3 | విజయతెందుశూర |
| 110 - 5 | తెందుశూరు |
| 110 - 7 | అగుబంఱు |
| | అగుంబఱ్ఱు     పదాదివర్ణం |